


# సూచిక

- - - - జిల్లాల సరిహద్దులు

——— తాలూకాల సరిహద్దులు

1. శ్రీకాకుళం
2. విశాఖపట్నం
3. తూర్పు గోదావరి
4. పశ్చిమ గోదావరి
5. కృష్ణా
6. గుంటూరు
7. నెల్లూరు
8. చిత్తూరు
9. కడప
10. అనంతపురం
11. కర్నూలు

# విషయసూచిక



# పటముల పట్టిక

*





# ద్వితీయముద్రణకు పరిచయం

"ఆంధ్రప్రజలు – సిరిసంపదలు" ప్రథమముద్రణ జరిగిన నెలకే, ద్వితీయ ముద్రణాబాధ్యత స్వీకరించవలసి వస్తుందని మేమూహించలేదు. ఆంధ్రపాఠకలోకం మా పుస్తకంయెడల చూపిన ఆదరాభిమానాలే మమ్ము ద్వితీయముద్రణాప్రచురణకు ప్రోత్సహించాయి.

ఈ ముద్రణలో, ప్రథమముద్రణలో దొర్లిన లోపాల సవరించుకోవటంతో పాటు అదనపుసమాచారాన్ని చేర్చి చాల అధ్యాయాలు పూర్తిగా తిరగవ్రాశాం.

వ్యవసాయం, నదులు – ప్రాజక్టులు, పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి, వాణిజ్య వ్యాపారాలు, విద్య , ఇత్యాది అధ్యాయాలను ఈ విధంగా తిరగవ్రాశాం.

రెండవముద్రణను వీలైనంత చౌకగా అందివ్వాలనే అభిలాషతో, సవరించిన కొత్తసంఖ్యల ప్రకారం మ్యాపులు తిరిగి వ్రాయించక పాతవాటినే తిరిగి వాడాం. అందుచేత, మ్యాపులలోని సంఖ్యలకు, పుస్తకంలో అదేవిషయానికి సంబంధించిన సంఖ్యలకు కొద్ది వ్యత్యాసం కనిపిస్తుంది. ఇందుకు పాఠకలోకం మమ్ము మన్నిస్తుందని ఆశిస్తాం.

ప్రథమముద్రణ యెడల చూపిన ఆదరణనే ఆంధ్రపాఠకలోకం ద్వితీయ ముద్రణయెడలకూడా చూపుతుందనే ఆశిస్తున్నాం.

ఓపికతో వ్రాతప్రతిని చదివి భాషాలోపాలు సవరించిన మా మిత్రుడు "క. యమ్." కు, ద్వితీయముద్రణ వెలువరించడంలో సాయపడిన ఇతర మిత్రులకు మా అభివందనాలు.

23/231 మాచవరం,<br>విజయవాడ,<br>29–11–1953

ఇట్లు,<br>రచయితలు

# ప్రథమ ముద్రణకు పరిచయము

నలుబదిసంవత్సరాల ఆంధ్రప్రజల పోరాట ఫలితంగా అక్టోబరు ఒకటవ తేదీన ఆంధ్రరాష్ట్రం అవతరించబోతున్నది. అవతరించబోయే ఈ రాష్ట్రం ఎట్టిది? సహజ సంపదల పరిమాణ మెంత? వ్యవసాయం, పరిశ్రమలు మున్నగునవి ఏ స్థితిలో ఉన్నాయి? ప్రజల జీవిత స్థితిగతు లెలా ఉన్నాయి, మున్నగు విషయాలను వివరిస్తూ, ఆంధ్రరాష్ట్ర సమగ్ర స్వరూపాన్ని - స్థూలంగానైనా చిత్రించగలిగిన పుస్తకం మనకులేదు. ఈ లోటును తీర్చుటకు మేము చేసిన ప్రయత్న ఫలితమే ఈ పుస్తకం. ఇందులో ఎంతవరకు కృతకృత్యులమైనది నిర్ణయించవలసినది పాఠకులే!

ఈ పుస్తక రచనకు కావలసిన సంఖ్యావివరాలనన్నింటినీ ప్రభుత్వ ప్రచురణల నుండే తీసుకున్నాం. ఉమ్మడిరాష్ట్రంలో మనకు జరిగిన అన్యాయాల్ని కప్పిపుచ్చే ఉద్దేశ్యంతో మదరాసు ప్రభుత్వం, ఆంధ్రకు సంబంధించిన అనేక విషయాలను బుద్ధిపూర్వకంగా దాచి ఉంచింది. ప్రచురించబడిన కొన్ని విషయాలయినా కలగా పులగంగా ఉన్నాయి. అధికారపూర్వకమైన అంచనాలు మరెచ్చటా లభించే అవకాశంలేదు. కనుక, కష్టమైనా, సాధ్యమైనన్ని వివరాలను, ప్రభుత్వ లెక్కల నుండే ఏరి కూర్చాం.

దొరికిన విషయమైనా కొన్ని కొన్ని సందర్భాలలో సమగ్రంగాలేదు. ఉదాహరణకు వివిధ పట్టాలక్రిందఉన్న భూమిలో, ఎంత మెట్ట, ఎంత మాగాణీ ఉన్నది అనే వివరాలు ఎచ్చటా ఇవ్వబడలేదు. దీనికితోడు రెండు డిపార్టుమెంటులు ప్రకటించిన ఒకే విషయానికి సంబంధించిన సంఖ్యా వివరాలకు కొన్నిచోట్ల సాపత్యం కనుపించటంలేదు.

కొన్ని సందర్భాలలో ప్రభుత్వ సంఖ్యా వివరాలు అసలు విషయాన్ని తారుమారుచేసి చూపించే అవకాశంకూడా ఉన్నది. ఉదాహరణకు, రాయలసీమ జిల్లాల్లో సుమారు తొమ్మిదిలక్షల ఎకరాలకు నీటిపారుదల సౌకర్యమున్నట్లు చూపబడింది. ఇన్ని లక్ష ఎకరాల మాగాణి ఉన్న రాయలసీమలో కరువు వస్తున్నట్లు చెప్పబడుతున్నదంటే వాస్తవంగా నమ్మరాని విషయం. ఈ మాగాణి భూమిలో సుమారు ఎనిమిది లక్షల ఎకరాలు నీటి పారుదలకు, వర్షం కురిస్తేనేగాని నిండని బావులు, చెరువులపై ఆధారపడవలసి ఉన్నది. వర్షాభావం చాల సామాన్యమైన యీ ప్రాంతాల్లో, ఇన్ని లక్షల ఎకరాలకూ, ప్రతి సంవత్సరం నీటి పారుదల సౌకర్యం ఉండదు. కాని, ఒకచోట వర్షాభావాన్ని ఒప్పుకునే ప్రభుత్వ అంచనాలు, వేరొక

చోట ఇన్ని లక్షల ఎకరాలలో నీటిపారుదలతో పంటలు పండించబడినట్లు చిత్రిస్తాయి. ప్రజలు కరవుతో ఒకప్రక్క అల్లాడుతూ ఉన్నా, రాయలసీమ ప్రాంతం ఆహార పంటల విషయంలో మిగులుప్రాంతంగా చిత్రించుటకుకూడా అవకాశం ఇస్తున్నాయి. కనుక పాఠకులు, ఆయా ప్రాంతాల వాస్తవిక స్థితిగతులతో యీ సంఖ్యావివరాలను జోడించి చూడాలికాని, ప్రభుత్వ సంఖ్యా వివరాల దృష్టితోమాత్రమే, కొన్ని విషయాలలో, ఆయా ప్రాంతాల చిత్రాన్ని ఊహించరాదు.

ప్రభుత్వ సంఖ్యావివరాలలో ఇట్టి బలహీనతలు కొన్ని ఉన్నా, ఆంధ్ర ప్రజల సిరి సంపదల నర్థం చేసుకునేందుకు అవి నిస్సందేహంగా తోడ్పడతాయి. కనుకనే వీటిని స్వీకరించాం.

అన్ని విషయాలలోనూ బళ్లారి జిల్లాలోని మూడు తెలుగు తాలూకాలకు సంబంధించిన వివరాలు లభించకపోవటంచేత, మొత్తం జిల్లా వివరాలనే ఇచ్చాం.

వ్రాత ప్రతిని ఓపికతో చదివి, అమూల్య సలహాల నిచ్చిన మిత్రులకు ఆంధ్ర రాష్ట్ర అవతరణనాటికి పుస్తకాన్ని వెలువరచ సాయపడిన మిత్రులందరికీ అభివందనాలు.

**23/251**, మాచవరం,<br>
విజయవాడ,<br>
**26—9—1953.**

ఇట్లు,<br>
**రచయితలు**

# ఆంధ్రరాష్ట్రం

నలభై సంవత్సరాల దీర్ఘ ఆందోళన ఫలితంగా, అనేకమంది అమరవీరుల త్యాగఫలితంగా ఆంధ్రుల చిరకాలవాంఛితమైన ఆంధ్రరాష్ట్రము అక్టోబరు ఒకటవ తేదీన అవతరించింది ఈ నవ్యాంధ్రరాష్ట్రం, శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, అనంతపురం, చిత్తూరుజిల్లాలు, బళ్ళారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాలతో ఏర్పరచ బడింది. పరిపాలనా సౌలభ్యంకోసం, ఈమూడు తాలూకాలలో ఆదోని, ఆలూరుతాలూకాలు కర్నూలుజిల్లాలోను, రాయదుర్గం తాలూకా అనంతపురంజిల్లాలోను చేర్చబడ్డాయి.

రాష్ట్ర భూభాగపు వైశాల్యం 63417 చదరపుమైళ్ళు. ఈ భూభాగం, 77° - 85° అక్షాంశరేఖలమధ్యను, $19\frac{1}{3}°$ - $12\frac{1}{3}°$ తులాంశరేఖల మధ్యను ఉన్నది. ఉత్తరమున ఒరిస్సారాష్ట్రము, తూర్పున బంగాళాఖాతము, దక్షిణమున మదరాసు రాష్ట్రము, నైరుతిని మైసూరురాష్ట్రము, పడమట బొంబాయిరాష్ట్రము, వాయువ్యమున హైదరాబాదు సంస్థానము, మనరాష్ట్రమునకు ఎల్లలుగా ఉన్నాయి.

మనరాష్ట్రము వైశాల్యంలో బెల్జియం, హాలెండు, డెన్మార్కు దేశాలకు నాలుగురెట్లు, స్కాట్లెండ్, ఐర్లండు, బల్గేరియా, గ్రీసు దేశాలకు రెండురెట్లున్నది. కోటి మదరాసురాష్ట్ర వైశాల్యంలో సగం కంటె కొంచెము తక్కువ; హైదరాబాదు సంస్థానంలో నాలుగింట మూడుపాళ్ళు; భారతదేశ వైశాల్యంలో 25 వ వంతు; ఒరిస్సా రాష్ట్రంకంటె పెద్దది; మైసూరు సంస్థానానికి రెండురెట్లు ఉన్నది.

జ నా భా :

రాష్ట్రజనాభా 1951 జనాభా లెక్కల ప్రకారం 205 లక్షలు. వీరిలో 170 లక్షలమంది గ్రామవాసులు, 31 లక్షలమంది పట్టణవాసులు. (పట్టణ గ్రామీణ జనాభా విభజనలో బళ్ళారి 3 తాలూకాలు చేర్చబడలేదు). 103 లక్షలమంది పురుషులు, 102 లక్షల మంది స్త్రీలు. సగటున చదరపుమైలుకు 353 మంది నివసిస్తున్నారు.

జనాభాలో 182 లక్షలమంది హిందువులు, 12 లక్షలమంది ముస్లింలు, పదిలక్షలమంది క్రైస్తవులు. రాష్ట్రప్రజలలో 180 లక్షలమంది మాతృభాష తెలుగు. సుమారు తొమ్మిదిలక్షలమంది మాతృభాష ఉరుదు. తమిళులు నాలుగు లక్షలమంది. వీరిలో అత్యధికభాగం చిత్తూరుజిల్లాలోఉన్నారు. అనంతపురం, బళ్లారి మూడు తెలుగుతాలూకాలలోను దాదాపు రెండులక్షలమంది కన్నడులున్నారు. రాష్ట్రంలోఉన్న 162 వేలమంది ఒరియాలలో ఒక్క శ్రీకాకుళంజిల్లాలోనే, 118 వేల మంది ఉన్నారు.

లంబాడీలు, కోయలు, సవరలు మొదలయిన కొండజాతి ప్రజలు 509 వేల మందిఉన్నారు. కోయలలో అధికసంఖ్యాకులు ఉభయగోదావరిజిల్లాల మన్యప్రాంతం లోను, సవరలు, ఖోండులు దాదాపు అందరూ శ్రీకాకుళంజిల్లాలోను ఉన్నారు.

గ్రామాలు - పట్టణాలు :

మన రాష్ట్రంలో 17044 గ్రామాలు, 171 పట్టణాలు మొత్తం 17215 ఉన్నాయి. వీటిలో 500 జనాభాకు లోపు ఉన్న గ్రామాలు 7,752; 500-1000 మధ్య జనాభా ఉన్న గ్రామాలు 3123; వెయ్యి - పదివేలకు మధ్య జనాభా ఉన్న గ్రామాలు 6213; పదివేలు-లక్షమధ్య జనాభాఉన్న పట్టణాలు 103, లక్షకు పైబడి జనాభా ఉన్న పట్టణాలు నాలుగు ఉన్నాయి. మునిసిపాలటీలుగా గుర్తించబడిన పట్టణాలు 35 మాత్రం (1953).

భూవిభజన

1950-1951 లెక్కలప్రకారం, మొత్తం రాష్ట్రవిస్తీర్ణంలో, నూటికి 18.4 పాళ్లు అడవుల క్రిందను, 13 పాళ్లు సాగుకు లాయకుగాని బంజరుగాను, 8.6 పాళ్ళు సాగుకు లాయకైన బంజరుకిందను, 6.5 పాళ్ళు పడావుల (Current fallows) కిందను, 4.2 పాళ్ళు ఇతరపడావులకిందను ఉన్నది. నూటికి 40.1 పాళ్ళ విస్తీర్ణంమాత్రం పంటభూమి.

మన రాష్ట్రంలో సగటున తల 1కి సాగుచేయబడుతున్న భూమి 0.75 ఎకరాలు. బొంబాయి రాష్ట్రంలో 1.32 ఎకరాలు, మదరాసులో 0.65 ఎకరాలు, ఒరిస్సాలో 0.74 ఎకరాలు సాగుచేయబడుచున్నది. ప్రస్తుతము మన రాష్ట్రంలో బంజరుగా ఉన్నభూమిని సాగులోకి తెచ్చినట్లైతే, అది తల 1కి 0.25 యకరాలు వస్తుంది. దీనితోసహా తల 1కి సాగుచేయబడే భూమి, ఒక ఎకరానికి పెరుగుతుంది.

# ఆంధ్రరాష్ట్రం

## జనాభా-విస్తీర్ణం

బళ్ళారిజిల్లా మొత్తం వివరాలు యివ్వబడ్డాయి.




### సూచిక

------ జిల్లాల సరిహద్దులు

జనాభా (అంకెలు లక్షలలో)

విస్తీర్ణం (అంకెలు వేల చదరపు మైళ్ళలో)

# జనసంఖ్యా వివరాలు (1951)

| | జిల్లా పేరు | | విస్తీర్ణం చదరపు మైళ్లలో | పురుషులు | స్త్రీలు | మొత్తం జనాభా | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా | జనసమ్మర్దము చ॥ మైలుకు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | — | 3,888.96 | 10,34,910 | 10,88,226 | 21,23,136 | 19,32,351 | 1,90,785 | 546 |
| 2. | విశాఖపట్నం | — | 5,178.78 | 10,23,192 | 10,49,506 | 20,72,698 | 17,67,840 | 3,04,858 | 400 |
| 3. | తూర్పుగోదావరి | — | 5,682.13 | 12,06,483 | 12,08,325 | 24,14,808 | 19,54,662 | 4,60,146 | 425 |
| 4. | పశ్చిమగోదావరి | — | 3,014.77 | 8,48,990 | 8,48,737 | 16,97,727 | 13,66,458 | 3,31,269 | 563 |
| 5. | కృష్ణా | — | 3,498.73 | 9,03,872 | 8,75,612 | 17,79,484 | 14,09,392 | 3,70,092 | 509 |
| 6. | గుంటూరు | — | 5,771.45 | 12,91,745 | 12,58,251 | 25,49,996 | 20,48,075 | 5,01,921 | 442 |
| 7. | కర్నూలు | — | 7,836.29 | 6,43,594 | 6,27,249 | 12,70,843 | 10,70,625 | 2,00,218 | 162 |
| 8. | అనంతపురం | — | 6,706.45 | 7,01,242 | 6,60,314 | 13,61,556 | 11,39,998 | 2,21,558 | 203 |
| 9. | కడప | — | 5,928.95 | 5,95,060 | 5,66,671 | 11,61,731 | 10,27,502 | 1,34,229 | 196 |
| 10. | నెల్లూరు | — | 7,959.67 | 9,02,794 | 8,92,838 | 17,95,632 | 15,91,993 | 2,03,639 | 226 |
| 11. | చిత్తూరు | — | 5,889.52 | 9,24,592 | 8,85,785 | 18,10,377 | 16,41,043 | 1,69,334 | 307 |
| 12. | బళ్ళారి (3 తా॥లు) | — | 2,061.00 | 2,37,251 | 2,32,552 | 4,69,813 | — | — | 258 |
| | | | 63,416.70 | 1,03,13,725 | 1,01,94,066 | 2,05,07,801 | 1,69,49,939 | 30,83,049 | 4,237 |

CENSUS OF INDIA - 1951

Vol. III - PART II A - Pages 2 3 & 336 - 358

# జిల్లావారీ భూవిభజన వివరాలు

| | జిల్లాపేరు (1) | మొత్తం విస్తీర్ణం (2) | అడవులు (3) | మొత్తం విస్తీర్ణంలో ఎన్నోవంతు? (%) (4) | సాగుకు లాయకుగాని పఱ్ఱభూమి (5) | మొత్తం విస్తీర్ణంలో ఎన్నోవంతు? (%) (6) | సాగుకు లాయక్కైన బంజరు (7) | మొత్తం విస్తీర్ణంలో ఎన్నోవంతు (%) (8) |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం — | 24,88,931 | 5,55,243 | 22.3 | ... | ... | 2,50,322 | 10.1 |
| 2. | విశాఖ — | 33,14,434 | 15,20,978 | 46.2 | 3,73,222 | 11.3 | 92,896 | 2.3 |
| 3. | తూర్పుగోదావరి — | 36,36,573 | 8,64,855 | 23.8 | 7,54,544 | 20.8 | 4,04,463 | 11.1 |
| 4. | పశ్చిమగోదావరి — | 19,20,460 | 1,16,485 | 6.0 | 1,80,501 | 9.4 | 2,01,974 | 10.5 |
| 5. | కృష్ణా — | 22,39,187 | 1,25,550 | 5.6 | 3,07,150 | 13.8 | 2,50,917 | 11.3 |
| 6. | గుంటూరు — | 36,93,743 | 4,68,862 | 12.7 | 3,75,095 | 10.2 | 92,652 | 2.5 |
| 7. | కర్నూలు — | 50,15,222 | 16,60,142 | 30.2 | 2,95,877 | 5.9 | 6,00,475 | 12.0 |
| 8. | అనంతపురం — | 42,92,129 | 4,52,794 | 10.6 | 3,62,477 | 8.5 | 4,02,030 | 9.4 |
| 9. | కడప — | 37,94,524 | 11,56,865 | 30.5 | 1,69,628 | 4.5 | 6,43,240 | 16.9 |
| 10. | నెల్లూరు — | 50,94,191 | 4,73,222 | 9.3 | 17,50,640 | 34.4 | 11,267 | 0.2 |
| 11. | చిత్తూరు — | 37,69,290 | 5,23,743 | 13.9 | 9,34,700 | 24.8 | 4,34,689 | 11.5 |
| 12. | బళ్ళారి (మొత్తం) — | 37,64,342 | 3,65,077 | 9.7 | 2,03,807 | 5.4 | 1,75,201 | 4.7 |
| | | 4,30,32,026 | 82,92,816 | | 57,07,641 | | 35,60,156 | |

విస్తీర్ణం ఎకరాలలో

| జిల్లా | శాశ్వతపచ్చిక భూములు (9) | మొత్తం విస్తీర్ణంలో ఎంత % (10) | తోటలు, చెట్ల తోపులు ఇత్యాది వాటిక్రింద ఉన్న భూమి (11) | మొత్తం విస్తీర్ణంలో ఎంత % (12) | పడావులు (Current fallows) (13) | మొత్తం విస్తీర్ణంలో ఎంత % (14) | ఇతర పడావులు (Other fallow lands) (15) | మొత్తం విస్తీర్ణంలో ఎంత % (16) | ఒకసారి మొత్తం పంట పండించే భూమి (17) | మొత్తం విస్తీర్ణంలో ఎంత % (18) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. శ్రీకాకుళం | 3,362 | 0.1 | 8,157 | 0.3 | 1,62,514 | 6.5 | — | — | 8,28,311 | 33.3 |
| 2. విశాఖ | 37,559 | 1.1 | 41,415 | 1.2 | 1,05,656 | 3.2 | 40,125 | 1. | 8,27,903 | 25.0 |
| 3. తూర్పుగోదావరి | 1,38,726 | 3.8 | 52,565 | 1.4 | 52,762 | 1.5 | 1,24,254 | 3.4 | 10,49,014 | 28.8 |
| 4. పశ్చిమగోదావరి | 65,452 | 3.4 | 20,519 | 1.1 | 2,50,932 | 13.0 | 84,271 | 4.4 | 8,91,947 | 46.3 |
| 5. కృష్ణా | 26,850 | 1.2 | 32,516 | 1.4 | 2,08,022 | 9.3 | 12,460 | 0.6 | 12,48,591 | 56.0 |
| 6. గుంటూరు | 94,737 | 2.6 | 92,470 | 2 5 | 3,44,698 | 9.3 | 63,855 | 1.7 | 21,21,910 | 57.5 |
| 7. కర్నూలు | — | — | 191 | — | 2,69,092 | 5.4 | — | — | 21,26,643 | 42.5 |
| 8. అనంతపురం | 40,304 | 0.9 | 1,10,668 | 2.6 | 2,48,689 | 5.8 | 2,45,813 | 5.7 | 22,25,597 | 51.9 |
| 9. కడప | 1,49,368 | 3.9 | 28,851 | 0.8 | 2,77,420 | 7.3 | 26,861 | 0.7 | 10,56,282 | 27.8 |
| 10. నెల్లూరు | 9,614 | 0.2 | 36,455 | 0.7 | 26,754 | 0.5 | 12,91,014 | 25.4 | 12,85,704 | 25.2 |
| 11. చిత్తూరు | 45,536 | 1.2 | 57,885 | 1.5 | 4,28,855 | 11.4 | 1,68,692 | 4.5 | 8,21,356 | 21.9 |
| 12. బళ్ళారి | 42,216 | 1.1 | 16,720 | 0 4 | 1,83,654 | 4.9 | 92,274 | 2.5 | 24,59,004 | 65.8 |
|  | 6,53,724 |  | 4,98,412 |  | 25,59,048 |  | 21,56,219 |  | 1,69,45,260 |  |

| జిల్లా పేరు | | ఒక్కసారికి మించి పైరువేసే విస్తీర్ణం | మొత్తం విస్తీర్ణంలో ఎంత (%) | మొత్తం పంట పండించే విస్తీర్ణం (Gross cultivated area) | మొత్తం విస్తీర్ణంలో ఎంత (%) |
|---|---|---|---|---|---|
| | | (19) | (20) | (21) | (22) |
| 1. శ్రీకాకుళం | ... | 2,28,104 | 9.1 | 10,56,415 | 42.4 |
| 2. విశాఖ | ... | 2,72,734 | 8.2 | 11,00,637 | 33.2 |
| 3. తూర్పు గోదావరి | ... | 2,83,085 | 7.8 | 13,32,099 | 36.6 |
| 4. పశ్చిమ గోదావరి | ... | 2,34,886 | 12.2 | 11,26,803 | 58.5 |
| 5. కృష్ణా | ... | 1,56,124 | 7.0 | 14,04,715 | 63.0 |
| 6. గుంటూరు | ... | 2,73,350 | 7.3 | 23,95,260 | 64.8 |
| 7. కర్నూలు | ... | 52,395 | 1.1 | 21,79,038 | 43.6 |
| 8. అనంతపురం | ... | 69,142 | 1.6 | 22,94,739 | 53.5 |
| 9. కడప | ... | 73,367 | 1.9 | 11,29,649 | 29 7 |
| 10. నెల్లూరు | ... | 1,13,828 | 2.2 | 13,99,530 | 27.5 |
| 11. చిత్తూరు | ... | 52,442 | 1.4 | 8,76,798 | 23.3 |
| 12. * బళ్లారి | ... | 1,29,548 | 3.5 | 25,88,552 | 68.8 |
| | | 19,39,005 | | 1,88,84,235 | |

* బళ్ళారి జిల్లాలోని అన్ని తాలూకాలు చేర్చబడినవి.

— Source: Season and crop Report of Madras State – 1950–'51.

# నైసర్గిక స్వరూపం

పశ్చిమ కనుమలలోని "సహ్యాద్రిశ్రేణి" వలె దట్టమైన అడవులుగల ఎత్తైన పర్వతశ్రేణి మనరాష్ట్రంలోలేదు. మనకున్నదల్లా ఉత్తరమున విశాఖపట్టణంజిల్లా - ఒరిస్సా సరిహద్దునుండి దక్షిణాన నెల్లూరుజిల్లా - మదరాసు సరిహద్దువరకూ చెదురుగా వ్యాపించిఉన్న తూర్పు కనుమలే! వీటి సగటుఎత్తు 3,500 అడుగులు.

ఈ కనుమలు విశాఖజిల్లాలో అనంతగిరివద్ద ప్రారంభించి, పాతపట్నం తాలూకాగుండా దక్షిణాన గూడెంవరకూ వ్యాపించి ఉన్నాయి. 5,000 అడుగుల ఎత్తు ఉన్న మహేంద్రగిరి, నాలుగువేల అడుగుల ఎత్తుఉన్న పాలకొండలు, గోలుకొండలు, గాలికొండలు వీటిలో ఎన్నదగినవి. రమణీయమైన ప్రకృతిదృశ్యములకు ఖ్యాతిగన్న "డాల్ఫిన్సునోస్" అన్నకొండ విశాఖపట్నం ఓడరేవు దగ్గర ఉన్నది.

మూడువేల అడుగుల ఎత్తున ఉన్న పాపికొండలు, దూమకొండ, అనువారం, తిరుమలకొండలు ఉభయగోదావరి జిల్లాల్లో ఉన్నాయి.

విశాఖ-గోదావరిజిల్లాలలో వ్యాపించిఉన్న ఈ కొండలప్రాంతంలోనే పేరుపొందిన "మన్యం" అడవులున్నాయి. వీటిలో మద్ది, ఏగీస, టేకు, వెదురు మొదలైన కలప, చింతపండు, కుంకుడుకాయలు, తేనె, మైనము ఇత్యాది అటవీ సంపద లభ్యమౌతుంది.

కృష్ణాజిల్లాలో బెజవాడ, మొగలురాజపురం కొండలున్నాయి. గుంటూరుజిల్లాలో గనికొండ, నాగార్జునకొండ, బెల్లంకొండ, మంగళగిరికొండ, కొండవీడుకొండ, కోటప్పకొండ, వినుకొండ, చీమకుర్తికొండలు ఉన్నాయి. అనంతపురం జిల్లాలోని పెనుగొండ, మల్లప్పకొండ, మడకసిరకొండలు, కడప జిల్లాలోని శేషాచలం, పాలకొండలూ చెప్పతగ్గవే! కర్నూలుజిల్లాలోని నల్లమల కొండలు, ఈప్రాంతపు కొండలలోకెల్ల ఎత్తయినవి. ఇచ్చటనే ప్రశస్తమయిన "నల్లమల" అడవులున్నాయి. యర్రమల, వెలిగొండలు కర్నూలు-నెల్లూరు జిల్లాల సరిహద్దున ఉన్నాయి. తిరుపతికొండలు, ఆవులపల్లికొండలు, ఏనుగఎల్లమ్మకొండ చిత్తూరుజిల్లాలో ఉన్నాయి.

### స ము ద్ర తీ ర ము

మన రాష్ట్రానికి 500 మైళ్ళ సముద్రతీరమున్నది. కాని ఒక్క విశాఖ పట్టణం రేవు మినహా, స్వాభావికమైన రేవు పట్నం లేదు. శ్రీకాకుళం జిల్లాలోని కళింగపట్నం, విశాఖజిల్లాలోని భీమునిపట్నం, తూర్పుగోదావరిజిల్లాలోని కాకినాడ, పశ్చిమగోదావరిజిల్లాలోని నరసాపురము, కృష్ణాజిల్లాలోని మచిలీపట్నం (బందరు) మనకున్న కొన్ని చిన్న ఓడరేవులు.

మన రాష్ట్రంగుండా ప్రవహించే నదులలో ముఖ్యమైనవి గోదావరి, కృష్ణా, తుంగభద్ర, పెన్న-ఇవి గాక, వీటికి అనేక ఉపనదులు, ఇతర చిన్ననదులు కూడా ఉన్నాయి.

### గో దా వ రి

దక్షిణగంగ అని పిలువబడే గోదావరినది పశ్చిమకనుమలలో బొంబాయి రాజధానిలోని నాసిక్‌కు సమీపముననున్న "త్రియంబకం" వద్ద పుట్టి, ఏడువందల మైళ్లు ప్రవహించి, రావణుడు సీతను అపహరించాడని చెప్పబడే "పర్ణశాల" వద్ద ఆంధ్రరాష్ట్రంలో ప్రవేశిస్తున్నది. తర్వాత మరి 225 మైళ్ళు ప్రవహించి బంగాళాఖాతములో కలుస్తున్నది. తెలుగువారికి సంబంధించినంతవరకు మంజీర, ప్రాణహిత, శబరి, ఇంద్రావతి ముఖ్యమైన ఉపనదులు. ఈ నది పాపికొండలవద్ద 600-900 అడుగుల వెడల్పుమాత్రమే ఉన్నది.

ఇచ్చటినుండి నది మరి 25 మైళ్ళు ప్రవహించి, "గౌతమీ గోదావరి" (తూర్పుశాఖ) వశిష్ట గోదావరి (పశ్చిమశాఖ) అనబడే రెండుపాయలుగా చీలుతున్నది. "గౌతమీ గోదావరి" యానాంవద్దను, "వశిష్టగోదావరి" నరసాపురం వద్దను సముద్రములో కలుస్తున్నాయి. ఈ నదికి ధవళేశ్వరమువద్ద 1852 వ సంవత్సరంలో పెద్ద ఆనకట్ట నిర్మించబడింది.

### కృ ష్ణా న ది

దీనితర్వాత చెప్పదగిన పెద్దనది కృష్ణ. ఇది బొంబాయి రాష్ట్రంలోని మహాబలేశ్వరమువద్ద పుట్టి, 520 మైళ్ళు ప్రవహించి, కర్నూలు జిల్లాలోని సిద్ధేశ్వరంవద్ద మన రాష్ట్రంలో ప్రవేశిస్తున్నది. సిద్ధేశ్వరం, గుంటూరు జిల్లాలోని నందికొండల మధ్య అడవి ప్రాంతాల్లో 120 మైళ్ళు, ఆపైన పులిచింతలవరకు కొండప్రాంతంగుండా 35 మైళ్ళు ప్రవహిస్తున్నది. అక్కడ నుంచి మరొక నలభై మైళ్ళు ప్రవహించి, విజయవాడవద్ద రెండు కొండలమధ్య ఉన్న లోయను దాటి 40 మైళ్ళు దిగువకు ప్రవహించినతర్వాత, "పులిగడ్డపాయ" చీలింది. నదికీ, ఈ పాయకూ మధ్యనున్న ప్రాంతాన్ని "దివిసీమ" అంటారు. తరువాత ఈ నది మరొక 15 మైళ్ళు ప్రవహించి, మూడు పాయలుగా చీలి బంగాళాఖాతంలో హంసలదీవివద్ద కలుస్తున్నది.

కోయన, భీమ, ఘటప్రభ, మలప్రభ, తుంగభద్ర, ముసి, యర్ల, వర్ణ, దూధ్‌గంగ దీని ముఖ్య ఉపనదులు.

ఈ నదికి విజయవాడవద్ద 1852-55 సంవత్సరాలలో పెద్ద ఆనకట్ట నిర్మించబడింది.

పెన్నా నది

దీనినే "ఉత్తరపినాకిని" అనికూడా పిలుస్తారు. ఈనది మైసూరులోని "నంది దుర్గ" కొండలలోపుట్టి 25 మైళ్లు ప్రవహించిన తర్వాత, ఆంధ్రలో ప్రవేశిస్తున్నది. తరువాత ఈ నది అనంతపురం, కడప, కర్నూలు, నెల్లూరు జిల్లాలగుండా ప్రవహించి నెల్లూరుజిల్లాలోని ఊటుకూరువద్ద సముద్రములో కలుస్తున్నది. జయమంగళి, చిత్రవతి, కుందేరు, పాపఘ్ని, సగిలేరు, చెయ్యేరు, బుగ్గేరు, బీరపేరు ముఖ్యమైన ఉపనదులు. దీనికి రెండుచోట్ల రిజర్వాయర్లు నిర్మించబడ్డాయి.

నాగావళి

ఇది, శ్రీకాకుళంజిల్లాలో కెల్ల పెద్దనది. దీనిని"లాంగుళ్యా" అనికూడా పిలవటం కద్దు. ఇది ఒరిస్సాలో నియ్మగిరులలోపుట్టి 60 మైళ్లు ప్రవహించి మనరాష్ట్రంలో ప్రవేశిస్తున్నది. తర్వాత మరొక .0 మైళ్ళు శ్రీకాకుళం జిల్లాలో ప్రవహించి, శ్రీకాకుళందగ్గర మోపాసు బందరువద్ద బంగాళాఖాతంలో కలుస్తున్నది. బట్టిగెడ్డ, జంఝావతి, స్వర్ణముఖి, వేదవతి దీని ఉపనదులలోకొన్ని.

వంశధార

తూర్పుకనుమలలోపుట్టి బంగాళాఖాతంలో కలిసే నదులలోకెల్ల పెద్దదైన వంశధార జయపూరుసంస్థానంలోపుట్టి (ఒరిస్సా) 60 మైళ్లు ఒరిస్సాలోప్రవహించి మన రాష్ట్రంలో ప్రవేశిస్తున్నది తరువాత శ్రీకాకుళంజిల్లాలో 80 మైళ్ళు ప్రవహించి, కళింగపట్నంవద్ద సముద్రములో కలుస్తున్నది. ఈ నది నీరుకూడా సాగుకు ఉపయోగించబడుతున్నది.

చిన్న నదులు

తూర్పుకనుమలలోపుట్టి బంగాళాఖాతంలోపడే చిన్ననదులు దాదాపు 17 ఉన్నాయి. వీటి పొడవు చాల తక్కువ. విశాఖ, గోదావరిజిల్లాలలో ప్రవహించే వాటిలో నీరు సమృద్ధిగా ఉంటుంది.

బహుదా, మహేంద్రతనయ, గరిబులగడ్డ, పెద్దగడ్డ, నెల్లిమర్ల, గోస్థని, చంపావతి, శారదానది, వరహానది, ఖాండానది ఇత్యాది చిన్ననదులు విశాఖ, గోదావరి జిల్లాలలో ప్రవహిస్తున్నాయి.

తుంగభద్ర

ఉపనదులలో కృష్ణానది ఉపనదైన తుంగభద్ర పెద్దది. పశ్చిమ కనుమలలో, దక్షిణ కనరా - మైసూరుల సరిహద్దులో ఉన్న వరాహాపర్వతాలలో పుట్టిన తుంగ-భద్రల కలయికవల్ల ఏర్పడిననదే తుంగభద్ర. ఇది సంగమేశ్వరంవద్ద (కర్నూలుజిల్లా) కృష్ణలో కలుస్తున్నది. బళ్లారిజిల్లాలోని మలప్పురంవద్ద ఆనకట్ట నిర్మించబడినది. హగరినది దీని ఉపనదులలో పెద్దది.

మనకున్న సరస్సులలో చెప్పదగినది పశ్చిమగోదావరిజిల్లాలోని కొల్లేరు సరస్సు. తూర్పు కనుమలలో పుట్టిన తమ్మిలేరు, బుడమేరు దానిలో కలుస్తున్నాయి.

కొండకర్ల ఆవ, కొమరోలు ఆవ, తలతంపర, దమయంతిసరస్సు, జగన్నాథ సాగరము మొదలైన చిన్నచిన్న సరస్సులుకూడా మన రాష్ట్రంలో ఉన్నాయి.

వర్షపాతం - శీతోష్ణస్థితి

రాష్ట్రవాతావరణ పరిస్థితిని స్థూలంగా క్రిందివిధంగా విభజించవచ్చును.

(1) జనవరి - మార్చి ... పొడిగాలి.
(2) ఏప్రిల్ - మే ... వేడిగాడ్పులు.
(3) జూన్ - సెప్టెంబరు ... నైరుతి ఋతుపవనాలు.
(4) అక్టోబరు - డిశెంబరు ... ఈశాన్య ఋతుపవనాలు.

ఆంధ్రదేశ వ్యవసాయానికి నైరుతి ఋతుపవనాలవల్ల కల్గే వర్షాలే ముఖ్యాధారం. కృష్ణా - గోదావరి జిల్లాలకు నీటి సప్లయి పుష్కలంగా జరగడంకూడా వీటిపైనే ఆధారపడి ఉన్నది. కృష్ణా - గోదావరీ నదులకు వచ్చే వరదలకుకూడా ఈ పవనాలే ఆధారం.

జూన్ మాసంతో నైరుతి ఋతుపవనాలవల్ల కలిగే వర్షాలు ప్రారంభమవుతాయి. జూన్, జూలై నెలలలో మొత్తంమీద కొద్దిపాటి వర్షమే కురుస్తుంది. ఆగస్టు, సెప్టెంబరులలో ఈ పవనముల మూలంగా వర్షం అధికంగా కురుస్తుంది.

సెప్టెంబరు నెలాఖరునుండి, పశ్చిమ పవనములు నీరసించిపోతాయి. కొద్దికాలం తర్వాత ఈశాన్య ఋతుపవనాలు ప్రారంభమవుతాయి. ఈ పవనాలవల్ల మనకు నవంబరు, డిశెంబరు నెలలలో వర్షము కురుస్తుంది.

శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరిజిల్లాలు, కృష్ణాజిల్లాప్రాంతాల్లో సంవత్సరంలో సగటున సుమారు *36 అం॥ - 38 అం॥ వర్షం పడుతుంది. ఇందులో సగ భాగానికి పైగా ఈశాన్య ఋతుపవనాలవల్లనే కురుస్తున్నది. మరింత దక్షిణంగా ఉన్న గుంటూరు, నెల్లూరు జిల్లాల సముద్రతీరం, కడప జిల్లాలోని రాజంపేట తాలూకాలో సంవత్సర సగటు వర్షపాతం 31 అం॥ - 39 అం॥ లు.

---

* అంగుళం=2½ దుమ్ములు.

ఈ ప్రాంతానికి దక్షిణంగా ఉన్న చిత్తూరు జిల్లా ప్రాంతంలో సంవత్సర సగటు వర్షం 30 అం॥ - 49 అం॥లు.

బళ్లారి, అనంతపురం, కర్నూలు జిల్లాల్లో, పైన పేర్కొనబడిన భూభాగానికి ఉత్తరదిశన ఉన్న ప్రాంతాల్లో, మన రాష్ట్రంలోకెల్లా తక్కువ వర్షం పడుతుంది. ఇచ్చట సంవత్సర సగటు వర్షపాతం 20 అం॥ మాత్రమే!

పవనాలవారీగా జిల్లాల్లో పడే వర్షపాతం వివరాలు క్రిందిపట్టికలో యివ్వబడినవి :

(1950 - 51 లో వర్షపాతం అంగుళాలలో)

| జిల్లా | నైరుతి ఋతు పవనాలు జూన్-సెప్టెంబరు | ఈశాన్య ఋతుపవనాలు అక్టోబరు-డిసెంబరు | శీతగాడ్పులు జనవరి-మే | మొత్తం వర్షపాతం | సగటు వర్షపాతం |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం మైదానాలు | 21.9 | 9.4 | 7.4 | 38.7 | 54.5 |
| విశాఖపట్నం మైదానాలు | 16.7 | 11.5 | 6.9 | 35.1 | 50.6 |
| తూర్పుగోదావరి : | | | | | |
| ఏజన్సీ ప్రాంతం | 32.9 | 7.3 | 8.3 | 48.5 | 53.6 |
| మైదానాలు | 31.6 | 13 1 | 6.1 | 50.8 | 57.5 |
| పశ్చిమగోదావరి | 33.0 | 7.3 | 6.6 | 46.9 | 54.6 |
| కృష్ణా | 23.1 | 4.4 | 6.7 | 34.2 | 43 7 |
| గుంటూరు | 16.4 | 6.5 | 4.1 | 27.0 | 45 0 |
| కర్నూలు | 10.8 | 4.8 | 7.1 | 22.7 | 40.8 |
| అనంతపురం | 8.2 | 6.8 | 6.7 | 21.7 | 34.6 |
| కడప | 10.0 | 4.8 | 4 9 | 19.7 | 35.9 |
| నెల్లూరు | 12.0 | 16.7 | 3.8 | 32.5 | 48.6 |
| చిత్తూరు | 13.3 | 7.9 | 8.0 | 29.2 | 47 3 |
| బళ్ళారి | 10.0 | 8.7 | 5.6 | 24.3 | 34.7 |

Source : Season and Crop Report of Madras State 1950–'51.

ఈ ప్రాంతాన్ని ఆనుకొని ఉన్న ఆదోని, పత్తికొండ, పులివెందుల, జమ్మలమడుగు, కోయిలకుంట్ల తాలూకాలలో సంవత్సరానికి సగటున 21 అం॥లు-26 అం॥లు వర్షం పడుతున్నది. ఈ ప్రాంతంలో సంవత్సరం పొడుగునా పడేవర్షంలో 5 అం॥లు-7 అం॥ వాయువ్య ఋతుపవనాల మూలముగానే పడుతున్నది. వర్షపాతం ఇంత తక్కువ కనుకనే, ఈ ప్రాంతంలో ఒక్క సంవత్సరం పంటలు సరిగా పండితే తర్వాత రెండు లేక మూడు సంవత్సరాలు ఎండిపోవడం సామాన్యమైనది.

# ఆంధ్రరాష్ట్రం

## వర్షపాతము




**సూచిక**

0—30 అంగుళములు

31—40 ,,

41—70 ,,

మైసూరు

మద్రాసు

# ప్రజలు - వారి వృత్తులు

ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా ఆంధ్రదేశ జనాభాను, డెల్టా ప్రాంత వాసులు, మెట్ట ప్రాంతవాసులు అని స్థూలంగా రెండు భాగములుగా విభజించవచ్చును. కృష్ణ, గోదావరి, పెన్నా డెల్టా భాగంలోని ప్రజల స్థితిగతులు కొద్ది వ్యత్యాసాలున్నా మొత్తాపై ఒకే రకంగా ఉంటాయి. రెండవ తరగతివారు మెట్ట ప్రాంత వాసులు - ప్రధానంగా రాయలసీమ జిల్లాల వాసులు. వీరు నిత్యం కరువు కాటకాలతోను, అనారోగ్యంతోనూ బాధ పడుతున్నారు. దీని ఫలితంగా ఈ ప్రాంతజనాభా కూడా అతి నీరసంగా పెరుగుతున్నది.

గత అరవై సంవత్సరాలలో, ఈ రెండు ప్రాంతాల జనాభా పెరుగుదల పరిమాణంలో ఎంత వ్యత్యాసం ఉన్నదో క్రింది పట్టిక స్పష్టం చేస్తుంది.

| జనాభా లెక్కల సంవత్సరం | కృష్ణా, గోదావరి డెల్టా ప్రాంతం : ఉభయ గోదావరి, కృష్ణా గుంటూరు జిల్లాలు | రాయలసీమ ప్రాంతం : కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాలు |
|---|---|---|
| 1891* | 40,20,262 | 34,44,163 |
| 1901* | 45,20,892 | 36,33,121 |
| 1911* | 51,41,043 | 37,61,856 |
| 1921* | 54,13,751 | 36,21,106 |
| 1931* | 61,92,977 | 39,94,543 |
| 1941* | 69,91,959 | 44,25,411 |
| 1951† | 84,42,015 | 50,37,655 |
| 1891-1951 సంవత్సరాల మధ్యకాలంలో జనాభా పెరుగుదల శాతం | 110 | 43 |

*Source: Monograph of Rural Problems in Madras, Pages 10-11

† Census of India 1951- Vol. III Part 11 A Pages 2-3

కృష్ణా-గోదావరి డెల్టా ప్రాంతంకూడా ఆనకట్టల నిర్మాణానికి పూర్వం కరువు ప్రాంతమే. 1861-62 జనాభా లెక్కల ప్రకారం, ఈ ప్రాంత జనాభాకూడా 25,61,252 మాత్రమే! కాని కృష్ణ, గోదావరి ఆనకట్టలు కట్టిన తర్వాత, 1901 సంవత్సరానికి అంటే 40 సంవత్సరాలలో 45,20, 892 కు-(దాదాపు రెట్టింపు) పెరిగింది. 80 సంవత్సరాలలో (1861 – 1941) జనాభా నూటికి 274 పాళ్లు అంటే $2\frac{3}{3}$ రెట్లు పెరిగింది. (Monograph of Rural Problems in Madras–Page 12)

రాయలసీమ జిల్లాలలో కడప – కర్నూలు కాలువ మినహా, మరే నికరమైన నీటిపారుదల వసతులూ లేకపోవటంవల్ల, ఈ జిల్లాలలోని ప్రజానీకం ఇతరులకంటే ఆర్థికంగా వెనుకబడి ఉన్నారు. 1945 వ సంవత్సరంలో, ప్రాంతాలవారీ ఆదాయాలనుగూర్చి, డా॥ బి. వి. నారాయణస్వామి సేకరించిన ఈక్రింది వివరాలు ఈ విషయాన్ని రుజువు చేస్తాయి.

1915 సం॥లో వ్యావసాయిక ఆదాయం (రూపాయలలో)

| ప్రాంతం* | సగటున కుటుంబానికి | సగటున తల 1కి |
|---|---|---|
| (1) కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరిజిల్లా మెట్టప్రాంతాలు | 1064.4 | 168.5 |
| (2) కృష్ణా, గోదావరి డెల్టా ప్రాంతాలు | 1010 5 | 161.8 |
| (3) ఉభయ విశాఖలు | 754.8 | 112.1 |
| (4) రాయలసీమ ప్రాంతం (నెల్లూరు మెట్టప్రాంతంతో) | 623.5 | 107.0 |

Source . Report of the Economist for Enquiry into rural Indebtedness. Page 44.

---

*ప్రాంతాల విభజనకు నారాయణస్వామి వ్రాసిన పేర్లు నంబర్లవారీగా :

(1) సర్కారుల మెట్ట పొలాలు (uplands)

(2) కోస్తా ప్రాంత సర్కారు జిల్లాలు.

(4) దక్కను జిల్లాలు.

నోట్:— 1 వ నంబరు ప్రాంతంలో డెల్టా ప్రాంతంకంటె సగటు ఆదాయం అధికంగా చూపబడింది. ఇది వర్షాలు సక్రమంగా పడ్డ సంవత్సరపు ఆదాయాన్ని అనుసరించి వేసినపట్టిక.

మన రాష్ట్ర ప్రజలలో 1951 జనాభా లెక్కలప్రకారం నూటికి 80.4 మంది గ్రామవాసులే! కనుక, వీరి స్థితిగతులను పరిశీలించడమంటే, ఆంధ్ర ప్రజల స్థితిగతులను అర్థం చేసుకోవడమే అవుతుంది! కాని 1951 జనాభా లెక్కలవివరాలు నేటికీ ప్రకటించబడలేదు. కనుక 1951 సం॥లో కేంద్ర ప్రభుత్వ వ్యవసాయశాఖ వారు కూలీల జీతాల నిర్ణయానికని గ్రామాలలో జరిపిన పరిశీలనలోని వృత్తుల వివరాలను యిచ్చట తీసుకోనటం జరిగింది. ఈ విచారణలో ఆంధ్ర ప్రాంతాలలో సగటున ప్రజలు యిలా విభజింపబడ్డారని తేలింది.

| వృత్తులు | | మొత్తం జనాభాలో నూటికి ఎన్ని కుటుంబాలు ? |
|---|---|---|
| 1. భూఖామందులు ... ... | | 23.9 |
| 2. కౌలుదారులు ... ... | | 6.7 |
| 3. వ్యవసాయకూలీలు ... ... | | |
| భూమి ఉన్నవారు | 26.5 | |
| భూమి లేనివారు | 21.9 | 48.4 |
| వ్యవసాయంమీద జీవించే మొత్తం కుటుంబాలు | | 79.0 |
| 1. వ్యవసాయకూలీలు గాక మిగతా కూలీలు ... (Non-Agricultural Labourers) | | 2.7 |
| 2. కుమ్మరం, కమ్మరం ఇత్యాది వృత్తులవారు ... (Artisans) | | 4 7 |
| 3. వ్యాపారస్తులు ... ... | | 4.1 |
| 4. తదితరులు ... ... | | 9.5 |
| | | 21.0 |
| మొత్తం | | 100.0 |

(Source: Agricultural wages in India. Page 110.)

ఈ విభజన ప్రకారం మన గ్రామీణ జనాభాలో నూటికి 79 మంది ప్రజలు వ్యవసాయంపై ఆధారపడి జీవిస్తున్నారు. పారిశ్రామికంగా మన రాష్ట్రం ఎంతో వెనుకబడి ఉంది. ఈ రంగంలో అభివృద్ధికూడా చెప్పదగినంత జరగడంలేదు. కనుక క్రమంగా పెరుగుతూన్న జనాభా, వ్యవసాయంమీదే ఆధారపడవలసి వస్తున్నది. జనాభా అభివృద్ధితోబాటు అదే పరిమాణంలో సాగు చేయబడుతున్న భూమికూడా పెరగకపోవడంచేత, వ్యవసాయంమీద వత్తిడి ఎక్కువ అవుతున్నది. ఒక ఎకరం పొలంమీద ఆధారపడుతున్న జనాభా 1911 సంవత్సరంలో288గాఉన్నదల్లా

1921 సంవత్సరానికి 313 కు, 1931 సంవత్సరానికి 315 కు, 1941 సంవత్సరానికి 326 కు పెరిగిపోయింది. (Monograph of Rural Problems in Madras Page 25)

వ్యవసాయంపై ఆధారపడే వారి సంఖ్య అధికమైనకొలది, వ్యవసాయ రంగంలో బీదతనం, నిరుద్యోగం ప్రబలిపోయింది. క్రమంగా చిన్న రైతులు ఉన్న కొంద్రను కోల్పోయి ఏవిధంగా వ్యవసాయ కూలీలుగా తయారవుతున్నారో క్రింది పట్టిక వివరిస్తుంది.

| వృత్తి వివరం | | 1931 లో నూటికి ఎంతమంది | 1951 లో నూటికి ఎంతమంది |
|---|---|---|---|
| 1. భూఖామందులు | ... | 39.0 | 30.1 |
| 2. వ్యవసాయ కూలీలు | ... | 42.9 | 61.2 |
| 3. కౌలుదారులు | ... | 12.0 | 8.5 |

Source : 1931 సంఖ్యలు " Monograph of Rural Problems " నుండి, 1951 సంఖ్యలు "Agricultural wages in India"లో వృత్తి, విభజన వివరాలకు కట్టిన శాతము.

గత యిరువది సంవత్సరాలలో, భూవసతి కలిగి ఉన్న ప్రతి వందమంది ఖామందులలోను తొమ్మిదిమంది దాన్ని కోల్పోయారు. ఇలా కోల్పోయినవారు వ్యవసాయకూలీలుగా మారినట్లుకూడా పై లెక్కలే స్పష్టం చేస్తున్నాయి. భూమిపై జీవించే ప్రతి వందమందిలో 1931 లో 43 మంది వ్యవసాయ కూలీలుగా వుంటే 1951 నాటికి వీరి సంఖ్య 61 కి పెరిగింది. భూఖామందులే గాక కౌలు దారులు కూడా క్రమంగా ఈ తరగతిలోకి జారడం జరిగింది.

1931 సంవత్సరంలో ప్రభుత్వం నియమించిన ఆరోగ్యస్వామి కమిటీ రిపోర్టును పరిశీలిస్తే అత్యల్ప సంఖ్యాకులైన పెద్దపట్టాదారుల చేతిలో, సేద్యంచేయ బడే భూమిలో అత్యధిక భాగం ఉన్నట్లు తేలుతుంది. మొత్తం పట్టాదారులలోనూటికి 16 మందిగా ఉన్న (పదిఎకరాలు అంతకు పైబడిన భూవసతిగలిగిన) పట్టాదారుల ఆధీనంలో మొత్తం సేద్యం చేయబడుతున్న భూమిలో నూటికి 63 పాళ్లు, నూటికి 13.5 మందిగా ఉన్న (5–10 ఎకరాల) పట్టాదారుల చేతిలో 15.4 పాళ్లు ఉన్నది. నూటికి 71 మందిగా ఉండి రైతాంగంలో అత్యధిక సంఖ్యాకులైన ఐదుఎకరాల లోపు పట్టాదారుల చేతిలో, మొత్తం సేద్యం చేయబడే భూమిలో నూటికి 21 పాళ్లు మాత్రమే ఉన్నది.

1931 సంవత్సరం తర్వాతవచ్చిన ఆర్థికమాంద్యం ఫలితంగా చాలమంది కిందితరగతి రైతులు తమ భూమిని, పూర్తిగానో, పాక్షికంగానో కోల్పోవడం, ఈ భూమి పైతరగతి పట్టాదారుల చేతిలో కేంద్రీకృతం కావడం జరిగింది. కాని, 1931 సంవత్సరం తర్వాత ప్రభుత్వం ప్రచురించిన, ఏ ఒక్క ప్రచురణలోను ఈ పరిణామానికి సంబంధించిన వివరాలు లభించవు. పైగా కొన్ని ప్రచురణలలో, రైతాంగ స్థితి బాగుపడినట్లుకూడా చిత్రించబడిఉంది. ఉదాహరణకు, 1931 జనాభా లెక్కల ప్రకారం వ్యవసాయంపై జీవించే జనాభాలో భూమిఉన్నవారు నూటికి 39 మంది ఉంటే, 1951 జనాభాలెక్కల్లో వీరు 58 కి పెరిగినట్లు చూపబడింది. 1931 లో 42.9% మందిగా ఉన్న వ్యవసాయకూలీలు 1951 కి 28.3% తగ్గినట్లు చిత్రింపబడింది. ఈ అంకెలే నిజమైతే గత 20 సంవత్సరాలలో చాలమంది వ్యవసాయకూలీలకు భూమి లభించినట్లు తేలుతుంది. కాని ప్రభుత్వంచేత నియమించబడిన అనేక విచారణ కమిటీలు, ప్రభుత్వ పరిపాలన రిపోర్టులలోని విషయాలకు విరుద్ధంగా వ్రాయటం గమనిస్తే, ఈ సత్యం మరింత నగ్నంగా కనిపిస్తుంది.

వ్యవసాయసమస్యలకు సంబంధించిన వివిధ విచారణకమిటీల రిపోర్టులు చిన్నరైతులు కోల్పోతున్న భూమి, క్రమంగా పెద్దపట్టాదారులచేతిలో కేంద్రీకృతం అవుతున్నదని రుజువుచేస్తున్నాయి. 1931 సంవత్సరపు ఆరోగ్యస్వామి కమిటీరిపోర్టు, 1949 లో ప్రచురించబడిన కుమారప్పకమిటీ (అఖిలభారత కాంగ్రెసు వ్యావసాయిక సంస్కరణల కమిటీ) రిపోర్టులోని భూఖామందుల వివరాలనుపోల్చి పరిశీలిస్తే కాలం గడచినకొలదీ చిన్న రైతులసంఖ్య క్రమంగా పెరుగుతూ పెద్దభూఖామందులచేతిలో భూమి కేంద్రీకృతం కావడం నేటికీ జరుగుతూనే ఉన్నదని స్పష్టమవుతున్నది.

| వర్గవిభజన | 1931 * మొత్తం పట్టాదారులలో శాతం. | 1949 ♦ మొత్తం పట్టాదారులలో శాతం |
|---|---|---|
| 5 ఎకరాలలోపు భూమి ఉన్నవారు | 70.7 | 82 |
| 5–10 ఎకరాలలోపువారు | 13.5 | 7 |
| 10 ఎకరాలు అంతకుమించి భూవసతి ఉన్నవారు | 15.8 | 11 |

పై పట్టిక ప్రకారం గత 18–19 సంవత్సరాల మధ్యకాలంలో ఐదు ఎకరాలకులోపు పట్టాదారులసంఖ్య నూటికి 12 పాళ్లు పెరిగింది. ఈ విధంగానే 5-10 ఎకరాలమధ్య భూమి ఉన్న, 10 ఎకరాలు అంతకుమించి భూమి ఉన్న పట్టాదారుల

* ఆరోగ్యస్వామికమిటీ రిపోర్టులో పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, కృష్ణాజిల్లాల లెక్కల శాతం అవిభాజ్యం.

♦ కుమారప్ప కమిటీ రిపోర్టులో అవిభక్త మదరాసు రాజధానికి ఇవ్వబడిన వివరాలు.

సంఖ్య క్షీణించింది. అనగా భూమి కొద్దిమంది చేతులలో క్రమంగా కేంద్రీకృతమవు తున్నదనే సత్యం బయటబడుతుంది. 18-19 సంవత్సరాలనాడు 5 ఎకరాలలోపు రైతుల సగటుభూమికి 23 రెట్లు భూమి 10 ఎకరాలు - అతనుపైబడిఉన్న భూస్వామికి సగటున ఉండేది. ఈ నిష్పత్తి గత 18-19 సంవత్సరాలలో మరింత పెరిగిందేకాని తరగలేదనేది పై సంఖ్యలనుండి రుజువవుతున్నది. కల్లిబొల్లి లెక్కలతో యీ సత్యాన్ని దాయాలని ఎంత ప్రయత్నించినా యిది నేటి సాంఘిక వ్యవస్థలో మావ లేని మచ్చగా నగ్నంగా ప్రదర్శితమవుతూనే ఉన్నది.

ఈపరిణామం ఫలితంగా ప్రజలయొక్క ఋణభారం క్రమంగా పెరుగుతూ వస్తున్నది. బి. వి. నారాయణస్వామి 1945 సంIIలో గ్రామప్రజల ఋణభారాన్ని విచారించడంకోసం అచ్చటచ్చట 8, 5, 30 కుటుంబాల జమా ఖర్చులను పరిశీలించారు. ఈ మొత్తం కుటుంబాల పరిశీలనలో బయల్పడిన ఋణభార పరిస్థితి 1939-45 సంIIలో యీ విధంగా ఉంది:

| తరగతి | ఋణం పెరుగుదల + తరుగుదల (–) శాతం |
|---|---|
| 25 ఎకరాలకు పైన ఉన్న భూస్వాములు | – 39.9 |
| 25-5 ఎకరాల మధ్య ... | – 24.6 |
| 5 ఎకరాలకు లోపు ... | – 12.3 |
| కౌలుదార్లు ... | + 4.1 |
| వ్యవసాయకూలీలు ... | + 45.1 |

Source: Report of the Economist for Enquiry into Rural indebtedness నుండి కూర్చబడినవి.

పై తరగతుల జనాభా, వారి వారి అప్పులను తీర్చుకొని నిల్వలలో పడితే, కింది తరగతివారు మరింత అప్పులపాలవుతూ వస్తున్నారు. బీద, మధ్య రైతాంగానికి డాII నారాయణస్వామి అంచనాల ప్రకారం అప్పులు లేవంటే అర్థం, వారు తమ అవసరాలను కుదించుకొనుటద్వారా ఉన్న గొడ్డూగోప్పా క్రమంగా అమ్ముకుంటూ వచ్చి ఋణభారాలు తొలగించుకొన్నారనేకాని, మరొక విధంగా అర్థం చేసుకోరాదు.

ఈ పరిణామ ఫలితంగా భూమిపై ఆధారపడి జీవించేవారి సంఖ్య గత అరశతాబ్దంలో రెట్టింపు పైబడి పెరిగింది. వీరందరకు భూమి ఆధారంతో జీవనంగడవక అనేకమంది నిరుద్యోగులుగా తయారవుతున్నారు. 1931 జనాభా లెక్కలప్రకారం, మన రాష్ట్రంలో ఉన్న ప్రతి వెయ్యిమంది జనాభాకు ఏ పనీలేక, సంపాదించే వారిమీద ఆధారపడి ఉన్నవారు 440 మంది ఉన్నట్లు అంచనా వేయబడినది.

(Rural Monograph - Page 24.) 1951 సం॥ జనాభా లెక్కల ప్రకారం జనా సంఖ్య ప్రతి వెయ్యిమందికిలోనూ [illegible] పెరిగింది. అలాగా గత 20 సం॥లో మన ప్రజలలో స్వతంత్ర జీవనాధారంలేనివారి సంఖ్య నూటికి 57 నుండి [illegible] వృద్ధి పొందింది.

ఈ నిరుద్యోగులు ఉద్యోగాన్వేషణకొరకు పల్లెపట్టులనుండి పట్నాలకు ఎగబ్రాకటం ప్రారంభించారు. 1941-51 మధ్యకాలంలో మన తెలుగు పట్నాలు కొన్నింటి జనాభా పెరుగుదల వివరాలను పోల్చిచూస్తే, ఈ పరిణామం ఎంత త్వరితగతిని జరుగుతున్నదీ తెలియగలదు.

| పట్టణం | | జనాభా 1941 | జనాభా 1951 | పెరుగుదల శాతం |
|---|---|---|---|---|
| (1) | విజయవాడ | 86,184 | 1,61,198 | 88.2 |
| (2) | గుంటూరు | 83,599 | 1,25,255 | 49.8 |
| (3) | విశాఖపట్నం | 70,243 | 1,08,042 | 53.8 |
| (4) | రాజమండ్రి | 74,564 | 1,05,276 | 41.3 |
| (5) | అనంతపురం | 21,482 | 31,952 | 48.7 |
| (6) | కడప | 28,246 | 37,438 | 32.5 |
| (7) | కర్నూలు | 45,250 | 60,222 | 33.0 |
| (8) | చిత్తూరు | 27,835 | 38,894 | 39.7 |

Source : 1951 Census Papers No. 1. Page 24.

1941-51 సంవత్సరాలమధ్య (పది సంవత్సరాలలో) జనాభా పెరుగుదల సుమారు నూటికి 14 మాత్రమే ఉండగా, పై పట్నాలలో జనాభా పెరుగుల 34% నుండి 60% వరకు పెరిగిందంటే, ఇది అంతా గ్రామీణవాసుల కదలికవలన కలిగిన పరిణామమే! ఇలాగే కొద్ది గొప్ప తేడాలతో ప్రతి పట్టణానికి ఎగబ్రాకటం జరుగుతున్నది.

పారిశ్రామికంగా అభివృద్ధికాని మన పట్నాలు, వీరికెట్టి పనిపాటులు కల్పించలేకపోవటంచేత చిన్న వ్యాపారస్తులుగాను, రిక్షాబండ్లు లాగేవాండ్లుగాను స్వల్పలాలలో దిగబడే కొంతమందిని మినహాయించి, మిగతావారు భుక్తికై పర రాష్ట్రాలకూ, పరదేశాలకూ వలసలు పోతున్నారు.

1931 జనాభా లెక్కల ప్రకారం ఒక్క బర్మాదేశానికి విశాఖజిల్లానుండి 63,000 మంది, గోదావరిజిల్లానుండి 44,000 మంది, కృష్ణాజిల్లానుండి 15,000 మంది వలసపోయారంటే, ఈ పరిస్థితి ఆ సంవత్సరంలో ఎంత తీవ్రపరిణామానికి దారితీసినదీ తెలియజేస్తుంది. ఈ విధంగా వలసపోయిన ఆంధ్రులు, బర్మాలోను, కలకత్తా,

కొంబాయి, ఖరగ్‌పూర్, షోలాపూర్, పూనా మొదలైన పట్టణాలలో లక్షల
సంఖ్యలో ఉన్నారు.

నేటి సాంఘిక వ్యవస్థ ఫలితంగా ఆంధ్రులు పొట్టను చేతబట్టుకొని, వలస
పోవుట అనేది నేటికీ కొనసాగుతూనే ఉన్నది. ఈ పరిణామాన్ని అపుచేసి, ఆంధ్ర
జాతి పురోభివృద్ధికి మార్గం వెయ్యాలంటే, జీవనోపాధికై భూమిపై ఆధార
పడేవారి సంఖ్యను తగ్గించడం అత్యవసరం. ఇందుకు, పారిశ్రామిక ప్రణాళికలను
అమలుపరచాలి. తద్వారా, రాష్ట్రాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిచేసి జీవనోపాధి
కల్పించాలి.

అలాగే, నేటి భూస్వామ్య వ్యవస్థ ఫలితంగా క్రమంగా నీరసించిపోతున్న
వ్యవసాయకూలి, బీద, మధ్యతరగతి రైతులకు ప్రోత్సాహమిచ్చే విధంగా భూసంస్క-
రణలను అమలుజరుపుతూ, ఈ భూస్వామ్య విధానాన్ని రద్దుచెయ్యాలి. అప్పుడే
ఆంధ్రజాతి పురోగమిస్తుంది.

# వ్యవసాయం

మనరాష్ట్రంలో నూటికి సుమారు 80 మంది జనాభాకు వ్యవసాయమే జీవనాధారం. కాలం గడచినకొలదీ వ్యవసాయంమీద ఆధారపడే జనాభా పెరుగుతూనే ఉన్నది. 1911 సంవత్సరంలో ఒక ఎకరంమీద ఆధారపడిన జనాభా 288 అయితే, అది 1921 సంవత్సరానికి 313 కు, 1931 కి 315 కు, 1941 కి 326 కు పెరిగిపోయింది.

ఈ విధంగా వ్యవసాయంపై జీవించేవారి సంఖ్య పెరుగుతూంటే, సాగు చేయబడే భూమి అదే పరిమాణంలో పెరగకపోవడంచేత, తల 1కి సగటున సాగుచేయబడే భూమి విస్తీర్ణం ఎలా తగ్గుతున్నదో ఈ క్రింది అంకెలు తెలియజేస్తాయి :

| సంవత్సరం | | తల 1కి సగటున (మద్రాసు రాష్ట్రంలో) సాగు చేయబడుతున్న భూమి |
|---|---|---|
| ♦1911 | ... | 0.78 ఎకరాలు |
| ♦1921 | ... | 0.79 ,, |
| ♦1931 | ... | 0.78 ,, |
| ♦1941 | ... | 0.69 ,, |
| *1951 | ... | 0.56 ,, |

సాగు చేయయబడే భూమి పెరగక పోవడంతోపాటు, అధునాతన వ్యవసాయ పద్ధతులుకూడా అభివృద్ధికాలేదు. జలవసతులున్నా నీటిపారుదల సౌకర్యాలు లేవు. మొత్తం సాగు చేయబడే భూమిలో నాల్గవవంతు భూవిస్తీర్ణానికి మాత్రమే నీటి పారుదల సౌకర్యాలున్నాయి. మిగతా మూడు వంతుల భూమి

♦ ఈ వివరాలు Monograph of Rural Problems in Madras నుండి.

* ఇవి మేము వేసిన అంచనా.

సేద్యానికి వర్షాలపై ఆధారపడవలసి ఉన్నది. కొయ్య నాగళ్ళతో భూమి దున్నడం, ఎద్దుల మోటలతో నీటి సాగుదల - ఇదీ నేటి మన వ్యవసాయ పద్ధతి! క్రింద పొందు పరచిన వివరాలు మనసేద్యం ఎంతగా పురాతన పరికరాలతో జరుగుతున్నదో వ్యక్తం చేస్తాయి.

* కొయ్యనాగళ్ళు 12,83.725 ఉపయోగించబడుతూంటే, ఇనుపనాగళ్లు 17,891 మాత్రమే వాడకంలో ఉన్నాయి. 14,221, చెరుకు గానుగలు ఎడ్లతో ఆడించబడుతూంటే, విద్యుత్తు (కరెంటు)తో ఆడించబడేవి 170 మాత్రమే! నాటి మదరాసు రాష్ట్రంలో 3,690 ఆయిల్ ఇంజన్లతో పనిచేసే పంపు సెట్లు, 4,307 కరెంటుపంపు సెట్లు వాడబడుతూంటే, మనరాష్ట్రంలో 906 ఆయిలు ఇంజన్లతో నడపబడే పంపుసెట్లు, 812 కరెంటు పంపుసెట్లు మాత్రమే వాడబడుతున్నాయి. ఈ పురాతన వ్యవసాయ పద్ధతుల ఫలితంగా ఎకరానికి ఉత్పత్తికూడ తగ్గిపో తున్నది.

ఇతర దేశాల సగటు ఉత్పత్తితో మన ఉత్పత్తినిపోల్చి చూస్తే మన వ్యవసాయం ఎంతగా వెనుకబడి ఉన్నదో అవగతమవుతుంది.

| దేశం పేరు | | సగటు, ఎకరి వరిధాన్యపు ఉత్పత్తి. (పౌనులలో) |
|---|---|---|
| స్పెయిన్ | ... | 3,709 |
| జపాన్ | ... | 2,053 |
| ఇటలీ | ... | 2,963 |
| ఈజిప్టు | ... | 1,779 |
| చైనా (కొమింటాంగ్) | ... | 1,554 |
| అమెరికా (U. S. A.) | ... | 1,413 |
| మదరాసు (ఆంధ్రతో) | ... | 1,050 |

(Monograph of Rural Problems in Madras State. P. 172.)

దీనికి తోడు సాగుకు లాయకైన భూమి దాదాపు 83 లక్షల ఎకరాలు సాగు చేయబడటంలేదు. ఇందులో కొంత బంజరుగాను, మరికొంత నీటి సౌకర్యాలు లేక, తరుణంలో వర్షాలు లేక పడావు (fallows) గాను పడిఉంది.

ఈ విధంగా వ్యర్థంగా ఉంటున్నభూమి 1950-51 సంవత్సరంలో ప్రభుత్వ అంచనాల ప్రకారం (Season & Crop Report) 82,75,423 ఎకరాలు. ఆ సంవ త్సరం సాగుచేయబడిన భూమిలో ఇది నూటికి 48.2 పాళ్ళు.

* పైన ఉదహరించిన వ్యవసాయ పరికరాలకు సంబంధించిన అంచనాలు మదరాసు ప్రభుత్వ ఆర్థిక సలహాదారు శ్రీ నటరాజన్‌వి.

దీని వివరాలు ఇలా ఉన్నాయి :

| వ్యర్థంగా ఉన్న భూమి వివరాలు | ఎన్ని ఎకరాలు? | మొత్తం సాగుచేయబడిన భూమిలో ఎన్నో వంతు? |
|---|---|---|
| 1. సాగుకు లాయకైన బంజరు | 35,60,156 | 21.0% |
| *2. ఒక్క-సంవత్సరం మించకుండా పడావుగా ఉన్న భూమి (Current fallows) | 25,59,048 | 15.1% |
| ♦3. పడావుభూమి (Other fallow lands) | 21,56,219 | 12.1% |
| వ్యర్థంగా ఉంచబడిన సాగుకు లాయకైన భూమి మొత్తం | 82,75,423 | 48.2% |

మన వ్యవసాయాభివృద్ధికి ప్రధాన ఆటంకంగా తయారైనవాటిలో భూస్వామ్య విధానం ఒకటి. దున్నేరైతు క్రమంగా ఉన్నకొంచెం పోగొట్టుకొని కూలీగా మారుతున్నాడు. భూమి అంతా భూస్వాముల చేతుల్లో క్రమంగా కేంద్రీకృత మవుతున్నది.

మదరాసు రాష్ట్రంలో నూటికి 94 గురు పట్టాదారుల చేతుల్లో, సాగు చేయబడే భూమిలో మూడింట రెండుపాళ్ళు మాత్రమే ఉన్నది. మిగతా మూడవ వంతు భూమి, నూటికి ఆరుగురుగావున్న పట్టాదారుల చేతుల్లో ఉన్నది. నూటికి ఒక్కరుగా ఉన్న పట్టాదారుల చేతుల్లో, మొత్తం సాగుచేయబడే భూమిలో నూటికి పదునాల్గువంతుల భూమి ఉన్నది. (Monograph of Rural Prolems in Madras State— P. 67. నుండి)

1900-01—1950-51 సంవత్సరాల మధ్యకాలంలో, యాభై-ముఫ్ఫై రూపాయలు శిస్తుచెల్లించే పట్టాదారులు, మూడవ వంతు భూమిని కోల్పోయారు.

రూపాయి - అంతకు తక్కువ శిస్తు చెల్లించే చిన్న పట్టాదారుల భూమి 1900-01 సంవత్సరంలో సగటున 0.77 ఎకరం ఉన్నదల్లా 1950-51 సంవత్సరానికి 0.71 ఎకరానికి పడిపోయింది. అలాగే పది - ఒకరూపాయిమధ్య శిస్తు చెల్లించే పట్టాదారులు నాలుగవవంతుకంటే కొంచెం ఎక్కువ భూమినే కోల్పోయారు. నూరు-యాభై రూపాయలు శిస్తుచెల్లించే పట్టాదారులుకూడా సుమారు నాల్గవవంతు భూమిని కోల్పోయారు.

---

* ఇది మామూలుగా సాగుచేయబడుతున్న భూమి. కాని ఆ సంవత్సరంలో మాత్రం వర్షాలు సకాలంలో పడకపోవటంచేత, ఇంత భూమిలో పైరు వేయబడలేదు.

♦ ఇదీ సేద్యం చేయబడుతున్న భూమే. ఒక సంవత్సరంనుండి ఐదు సంవత్సరాలవరకు వరుసగా బీడుగా వదలివేయబడుతున్న విస్తీర్ణం.

ఇదే అభిప్రాయాన్ని, అఖిలభారత కాంగ్రెసు సంఘంచేత నియమించబడి, వ్యవసాయ సంస్కరణల విషయంలో విచారణ జరిపి రిపోర్టు తయారుచేసిన కుమారప్ప కమిటీకూడ వెల్లడించింది.

జనాభాలో అధికసంఖ్యాకులైన చిన్న రైతులనుండి భూమి స్వయంగా సేద్యం చేయని భూస్వాముల చేతులలోనికి పోతున్నట్లు మదరాసులో జరిపిన ఒక విచారణలో తేలిందనీ, ఇది చాలా అలజడి గలిగించే విషయమనీ శ్రీ సత్యానాధన్ కుమారప్ప కమిటీకి సమర్పించిన విజ్ఞాపనలో తెలియచేశారు. (కుమారప్ప కమిటీ రిపోర్టు - P. 40)

ఇలాగే, మరొక ప్రముఖ మదరాసు రైతు నాయకుడు ఈ కమిటీ ముందు సాక్ష్యమిస్తూ, "భూమి అంతా ఎండ కన్నెరుగని వ్యవసాయదారుల" చేతుల్లోకి పోయిందనీ' "ఈ అవాంఛనీయ పరిణామాన్ని చక్కగా చిత్రీకరించారు" (అదే గ్రంథము - P' 40)

ఈ "అవాంఛనీయ" పరిణామ ఫలితంగా (దున్నేవారి చేతినుండి భూమి సేద్యం చేయని భూస్వాముల (noncultivating land-lord) చేతిలోనికి పోవడం వల్ల) వ్యవసాయోత్పత్తి ఎంత తీవ్రగతిని తగ్గిపోతున్నదో క్రింద పొందుపరచబడిన సంఖ్యల వివరాలు స్పష్టం చేస్తాయి.

**1943-'44—1949-'50 సంవత్సరాల మధ్యకాలంలో ఎకరానికి సగటున పండిన వరి, జొన్నపంటలు ***

| సంవత్సరం | సగటున ఎకరానికి పండిన పంట | |
|---|---|---|
| | వరిపంట(టన్నుల్లో) | జొన్నపంట (టన్నుల్లో) |
| 1943—44 | 0.673 | 0.250 |
| 1944—45 | 0.684 | 0.268 |
| 1945—46 | 0.620 | 0.225 |
| 1946—47 | 0.668 | 0.220 |
| 1947—48 | 0.618 | 0.233 |
| 1948—49 | 0 613 | 0.240 |
| 1949—50 | 0.570 | 0.242 |

—"మదరాసు రాష్ట్రంలో ఆహారం - వ్యవసాయం" అనే గ్రంథంలో - 215-218 పేజీలలో ఇవ్వబడిన పంటభూమి విస్తీర్ణం - పంట వివరాలు ఈ సగటు అంచనాలకు మూలము.

*. ఈ అంచనాలు, మదరాసు రాష్ట్రానికంతకు సంబంధించినవి.

భూస్వామ్య వ్యవసాయ విధాన ఫలితంగా ఎకరా సగటు పండుబడి నానాటికానాడు క్షీణించిపోతోంది. సేద్యానికి మంచి వసతులు ఉన్న జిల్లా ప్రాంతాలలో నేడు కొంతవరకు జరుగుతున్న ఇమ్మడి వ్యవసాయాన్ని (Intense-agriculture) చూసి మన సగటు పంట పెరుగుతున్నట్లు భావించరాదు. నేడు సాగవుతూన్న భూమిలో అత్యధిక భాగానికి ఎలాంటి నీటి పారుదల సదుపాయాలు లేవు. దీనికితోడు కౌలుదారు, పేదరైతు, మధ్యతరగతి రైతులకు వ్యవసాయాభివృద్ధికి అవసరమైన పెట్టుబడిపెట్టే ఆర్థికస్తోమత లేకపోవడం, భూస్వామ్య విధానం మన రాష్ట్ర వ్యవసాయ జీవితంలో ప్రబలంగా ఉండడం, ఈ క్షీణతకు తోడ్పడుతున్నాయి.

మద్రాసు రాష్ట్ర సగటు ఉత్పత్తి విషయంలో గత 8 సంవత్సరాల లెక్కలను చూస్తే ఈవిషయం స్పష్టమౌతుంది. మొత్తం భారతదేశ సగటుఉత్పత్తి లెక్కలలోకూడ ఈక్షీణత స్పష్టంగా కనిపిస్తోంది. ఆంధ్ర వ్యవసాయంలో సైతం ఇదే విషయం ద్యోతకమౌతుంది.

ఒకపక్క ఇలాగ సగటు ఉత్పత్తి క్షీణిస్తూఉంటే, మరొకపక్క లక్షల ఎకరాల భూమి బంజరుగా పడావుగా పడి ఉంటోంది. సాగుకింద ఉన్న భూమిలో మాత్రం ఎదుగూ బొదుగూ కానరావడంలేదు. అందుకని పెరుగుతూన్న జనాభా దృష్ట్యా తల ఒక్కింటికి వచ్చే పంటభూమి పరిమితికూడా క్రమంగా క్షీణిస్తున్నది.

నేటి భూస్వామ్య విధానం అటు ఎకరా సగటు ఉత్పత్తినీ పెరగనీయదు, ఇటు సాగుకిందకి అదనంగా భూమినీ రానీయదు. ఇదీ భూస్వామ్య విధాన నగ్న స్వరూపం. క్రింద పొందుపరచిన రెండు పట్టికలూ ఈ సత్యాన్ని చక్కగా చిత్రిస్తున్నాయి.

1938_39—1949_50 సంవత్సరాలలో తల 1కి

ఆహారపంటలు పండించబడుతున్న భూమి - పంట * (1)

| సంవత్సరం | తల 1కి ఆహారపంటలు పండించబడుతున్నభూమి (ఎకరాలలో) | తల 1కి పండించబడుతున్న ఆహారపంట (పౌనులలో) |
|---|---|---|
| 1938—39 | 0.4765 | 308.0 |
| 1939—40 | 0.4713 | 331.0 |
| 1940—41 | 0.4731 | 362.4 |
| 1941—42 | 0.4712 | 340.8 |
| 1942—43 | 0.4654 | 308.8 |
| 1943—44 | 0.4731 | 323.8 |

(౪)

1938-39—1949-50 సంవత్సరాలలో తల 1కి

ఆహారపంటలు పండింపబడుతున్న భూమి - పంట * (2)

| సంవత్సరం | తల 1కి ఆహారపంటలు పండించబడుతున్న భూమి (ఎకరాలలో) | తల 1కి పండింపబడుతున్న ఆహారపంట (పౌనులలో) |
|---|---|---|
| 1944—45 | 0.4518 | 324.8 |
| 1945—46 | 0.4187 | 262.8 |
| 1946—47 | 0.4326 | 291.5 |
| 1947—48 | 0.4081 | 261.9 |
| 1948—49 | 0.4235 | 269.1 |
| 1949—50 | 0.4161 | 242.4 |

— మదరాసు రాష్ట్రంలో ఆహారం - వ్యవసాయం

— బి. నటరాజన్ - ప్రభుత్వ ప్రచురణ. P. 45.

1943 - 1949 సంవత్సరాల మధ్యకాలంలో మదరాసు ప్రభుత్వం, అధికాహారోత్పత్తిపేర సుమారు ఏడుకోట్ల ముప్ఫై ఆరులక్షల రూపాయలు ఖర్చుచేసినప్పటికి, ఈ ప్రయత్నం అధికోత్పత్తిని సాధించలేకపోయింది సరికదా, ఆహార పంటల ఉత్పత్తి పతనాన్ని సయితం ఆపలేకపోయింది.

ఇలాగే, ఆహారేతర పంటలుకూడా (సగటున ఎకరానికి పండేపంట) తగ్గిపోయాయని ఈ దిగువ పొందుపరచిన సంఖ్యా వివరాలు తెలియచేస్తాయి:

| పంట పేరు | పండిన పంట - (సగటున - ఎకరానికి) | | |
|---|---|---|---|
| | 1939 - 40 | 1940 - 41 | 1949 - 50 |
| వేరుశెనగ ... | 0.478 టన్నులు | — | 0.413 టన్నులు |
| పత్తి ... | 0.227 బేళ్లు ♦ | — | 0.214 బేళ్లు |
| పొగాకు ... | — | 0.406 టన్నులు | 0.241 టన్నులు |
| ఆముదాలు ... | — | 0.102 టన్నులు | 0.089 టన్నులు |
| నువ్వులు ... | — | 0.130 టన్నులు | 0.117 టన్నులు |

— "మదరాసు రాష్ట్రంలో ఆహారం - వ్యవసాయం" అను గ్రంథంలో 215-18 పేజీలలో ఇవ్వబడిన సంఖ్యల ఆధారంతో ఈ అంచనాలు తయారుచేయబడ్డాయి.

— ఈ వివరాలు మొత్తం మదరాసు రాష్ట్రానికి సంబంధించినవి.

భూమి, దున్నే రైతుచేతిలోంచి ఉన్నవి భూస్వాములు, జమీందారులను సంక్రమించడం వలన కలుగుతున్న విష ఫలితాలు స్పష్టంగా గోచరిస్తున్నాయి.

* మదరాసు రాష్ట్రపు సగటు సంఖ్యలు. ♦ బేలు = 400 పౌ.

[illegible]

ఈ విషయ పరిస్థితులనుండి మన వ్యవసాయం ప్రైపు పడాలంటే భూస్వాముల, జమీందార్ల భూములను పేదరైతులకు, వ్యవసాయ కూలీలకు పంచి యివ్వడంతప్ప మరొక్క మార్గం లేదు అనేది అందరూ అంగీకరించారు. అయితే వీరి భూములను పంచునపుడు వీరికి కనీస పరిమితి భూమి వదలాలా? అలా వదలేట్లయితే, ఆ కనీస పరిమితి ఎంత? అనే విషయాలపై వివిధ అభిప్రాయాలు వెల్లడించ బడుతున్నాయి.

భూసంస్కరణలు కోరేవారిలో అత్యధికులు సంవత్సరానికి 250 రు. పైబడి శిస్తుచెల్లించే భూస్వాములు ఉండరాదని అంగీకరిస్తున్నట్లు ఎంచవచ్చు. అయితే అసలుభూపంపకం వినాదమే ఒకమిధ్యఅని, పంపకానికి తగినంత భూమి ఆంధ్రలో లేనేలేదనీ వాదించేవారు కూడ లేకపోలేదు. కనుక అత్యధికుల అభిప్రాయాలకు చేరువగా ఉన్న ప్రమాణాన్ని (రు. 250 పైబడి శిస్తుచెల్లించేవారు ఉండరాదనే సూచన) అంగీకరిస్తే ఆంధ్రలో పంపకానికి వీలున్న భూమిమొత్తం ఎంత ఉన్నదీ స్థూలంగానైనా తెలుసుకొన ప్రయత్నించటం అత్యావసరం.

ఆంధ్రలో (బళ్లారి మొత్తంతోసహా) 1950-51 మద్రాసుప్రభుత్వ సెటిల్ మెంటు రిపోర్టు ప్రకారం 30,93,513 పట్టాదారులున్నారు. వీరిలో సంవత్సరానికి రు. 250 పైబడి శిస్తుచెల్లించే వారిసంఖ్య 2922. 1952లో మద్రాసుప్రభుత్వ ఆర్థికసలహా దారుడు శ్రీనటరాజన్ యిచ్చినలెక్కల ప్రకారం (Monthly digest of Economics and statistics – August 1952) యీ 250 రూపాయల పైబడి శిస్తుచెల్లించే భూస్వాముల చేతిలో మొత్తం సేద్యంక్రింద ఉన్నభూమిలో నూటికి 6.18 వంతులు ఉన్నది. ఈ విధంగా మద్రాసు రాజధాని సగటు అంచనాలనే ఆంధ్రకు కూడ అనువర్తించి చూస్తే, 13,69,422 * ఎకరాలభూమి, 2,922మంది పట్టాదారుల అధీనంలో ఉన్నట్లు తేలుతున్నది.

అయితే, ఈ పట్టాదారులు ఎంతపరిమితి భూమికి రు 250 లు శిస్తు చెల్లించు తున్నారో అంతభూమిని వారికివదలి, మిగిలినదాన్నే పంచవలసి ఉంటుంది.

---

* 1950—51 సంవత్సరం Season and crop Report లో ఆంధ్రజిల్లాలకు ఇచ్చిన పంటభూమి, పడావులు, తోటభూములు మొత్తం విస్తీర్ణం కలిపి అందులో 6.18% వంతు విభజించగా వచ్చినమొత్తం.

ఈ పరిమితిని స్థూలంగా యిలా అంచనా వేయవచ్చు. సగటున మాగాణి శిస్తు రేటు ఎకరానికి పది రూపాయలు, మెట్ట శిస్తు రేటు ఎకరానికి 5 రూపాయలు ఉంటుందనుకొంటే, 250 రూ॥ల శిస్తు చెల్లించే ఆసామికి 25 ఎకరాల మాగాణిగాని, 50 ఎకరాల మెట్టభూమిగాని ఉంటుంది.

ఈ తరగతి పట్టాదారులకున్న భూముల్లో సగం మెట్ట, సగం మాగాణి అని అంచనా వేస్తే, వీరికి స్థూలంగా ఒక్కొక్కరికి 35-40 ఎకరాల భూమిని వదల వలసి వుంటుంది.

పై అదనపు భూముల్లో 250 రు. పై బడి శిస్తు చెల్లించే పట్టాదారులకు ప్రతిఒక్కరికి ఈ విధంగా వదలినతర్వాత కూడా, సీలైన భూమి మన రాష్ట్రంలో 12 లక్షల 50 వేల ఎకరాలవరకూ (12,52,542) ఉంటుంది. ఈ 12½ లక్షల ఎకరాలు, సాగుకు లాయకీయిన బంజరు 35,60,156 ఎకరాలు – మొత్తం 48,12,698 ఎకరాలు మన రాష్ట్రంలో పంచటానికి వీలున్నదని తేలుతుంది. *

1951 సం॥ జనాభా లెక్కలప్రకారం ఆంధ్రలో వ్యవసాయంపై ఆధార పడే వారి సంఖ్య సుమారు 1 కోటి 45 లక్షలు. ఒక్కొక్క కుటుంబంలో సగటున 5 గురు ఉన్నారనుకొంటే యీ జనాభా సుమారుగా 28 లక్షల 90 వేల కుటుం బాలుగా (28,90,136) ఉన్నట్లు తేలుతున్నది. పంపకానికి ఉన్న 48 లక్షల ఎకరాల భూమిని, భూమి ఉన్నది – లేదు అనే తారతమ్యం లేకుండా ఈ వ్యవసాయ కుటుంబాలన్నింటికి పంచినా, ఒక్కొక్క కుటుంబానికి సగటున 1½ ఎకరాల పైబడి భూమి వస్తుంది.

ఇట్టి సంస్కరణలు అమలుజరిగితే మన వ్యవసాయకూలీ, కౌలుదారు, బీద రైతుల జీవనప్రమాణం వృద్ధిచెందుతుంది. మన రాష్ట్రంలో తలఒక్కంటికి పండే అహారధాన్యాల విలువ ఎంతోగానో పెరుగుతుంది. చేతికందిన కొద్ది కొండ్రపై కష్టించే వ్యవసాయకూలి, కౌలుదారు, బీదరైతు ఎకరాసగటు ఉత్పత్తినిగూడ పెంచడానికి కృషి జేస్తాడు. వారి శ్రమశక్తి అదనపుపంటగా యీ భూములలో ఫలిస్తుంది. ఆరోజున ఆంధ్రగ్రామసీమలు నేటి నిరుద్యోగం, దారిద్ర్యం మటుమాయమై సిరిసంప దలతో పొంగి పొరలుతూంటాయి.

---

* ఈ అంచనాలు భూపంపకనినాదం బూటకమని వాదించేవారి వాదనలోని బలహీనతను చూపడానికి ప్రధానంగా ఉద్దేశించబడ్డాయి. ఇదికాలా స్థూలమైనఅంచనాలుగా మాత్రమే స్వీకరించాలి.

## ఆహార - ఆహారేతర పంటల వివరాలు (1950-51)

| జిల్లా | ఆహార పంటలు (ఎకరాల్లో) | ఆహారేతర పంటలు (ఎకరాల్లో) | మొత్తం పంటభూమి (ఎకరాల్లో) | ఒకసారికంటె ఎక్కువ సార్లు పైరు వేసే భూమి (ఎకరాల్లో) | మొత్తం పంట పండించే భూమి (Net area cropped) (ఎకరాల్లో) |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం - విశాఖ | 16,01,690 | 4,28,790 | 20,30,480 | 5,90,000 | 14,40,480 |
| తూర్పు గోదావరి | 10,77,050 | 2,36,320 | 13,13,370 | 3,17,000 | 9,96,370 |
| పశ్చిమ గోదావరి | 9,18,830 | 1,77,510 | 10,96,340 | 2,44,000 | 8,52,340 |
| కృష్ణా | 10,81,240 | 2,96,080 | 13,77,320 | 1,83,000 | 11,94,320 |
| గుంటూరు | 16,72,390 | 7,38,400 | 24,10,790 | 2,63,000 | 21,47,790 |
| కర్నూలు | 14,80,530 | 6,61,800 | 21,42,330 | 57,000 | 20,85,330 |
| అనంతపురం | 14,56,090 | 6,42,520 | 20,98,610 | 83,000 | 20,15,610 |
| కడప | 7,93,550 | 2,88,630 | 10,82,180 | 85,000 | 9,97,180 |
| నెల్లూరు | 12,65,830 | 1,61,010 | 14,26,840 | 1,64,000 | 12,62,840 |
| చిత్తూరు | 6,21,050 | 2,22,680 | 8,43,730 | 1,11,000 | 7,32,730 |
| బళ్లారి (మొత్తం) | 16,21,120 | 8,91,390 | 25,12,510 | 1,61,000 | 23,31,510 |

Source :—Season & Crop Report of Madras State 1950 - 51 Page 60.

# నదులు - ప్రాజక్టులు

ఆంధ్రదేశంలో జలసమృద్ధి గల నదీనదాలనేకం ప్రవహిస్తున్నాయి. ఇందులో కృష్ణా గోదావరులు రెండూ చాలాపెద్దవి; ప్రధానమైనవి. వీటికెన్నో ఉపనదులున్నాయి. ఇవిగాక రెండు మధ్యరకపు నదులు, 29 చిన్ననదులు తెలుగు గడ్డమీద పారుతున్నాయి. ఆరణి మున్నగు కొన్నినదులు ఇక్కడపుట్టి పరరాష్ట్రాలలో ప్రవహిస్తున్నాయి. ఈ నదులన్నీ కలిసి ఏటా 15 కోట్ల యకరపు టడుగుల నీటిని బంగాళా ఖాతంలో క్రుమ్మరిస్తున్నాయి. అంటే ఒక్క బ్రహ్మపుత్రానది తప్ప భారతదేశంలోని మిగతా నదులన్నీ కలిసి ఏటా సముద్రంపాలు చేసేనీటిలో ఇది నూటికి 15 వంతులుంటుంది. మన పొరుగునున్న మద్రాసు ఒరిస్సా రాష్ట్రాల నదీజలాలకన్న తెలుగు నదులజలప్రవాహం చాలాఎక్కువ. మద్రాసురాష్ట్రంలోని మొత్తంనదుల జలప్రమాణం సాలుకు 2 కోట్ల ఎకరపుటడుగులు. అంటే ఇది ఆంధ్ర రాష్ట్ర జలప్రమాణంలో నూటికి 13 వంతులు మాత్రమే. ఒరిస్సాలోని నదులన్నీ సాలీనా 12 కోట్ల ఎకరపు టడుగుల నీసును పారిస్తున్నాయి. ఇది ఆంధ్రరాష్ట్ర నదీజల ప్రమాణంలో నూటికి 80 వంతులు.

అయితే మనకున్న ఈ 15 కోట్ల యకరపుటడుగుల జలప్రవాహంలోనూ ఎంత ఉదారంగా అంచనావేసినా రెండుకోట్ల ఎకరపుటడుగుల నీటినిదాటి మనం నేడు వినియోగించుకొనుటలేదు. మన రాష్ట్రంలో ప్రవహించే అనేక నదులు పరరాష్ట్రాలలోపుట్టి, పారి మనసీమ చేరుతున్నాయి కనుక యీనదీజలాల వినియోగంలో వారికీ హక్కుఉంది. ఇలా మొత్తం 15 కోట్లయకరపు టడుగుల నీటిలో 4-5 కోట్ల యకరపుటడుగల నీటని యీ నదులు ప్రవహించే యితర రాష్ట్రాలు వినియోగించు కొనగలవని నిపుణుల అంచనా. అయినా ఎనిమిదికోట్ల యకరపుటడుగుల నీటిని మనం కొత్తగా వినియోగించుకొని మన భూములను సస్యశ్యామలం చేసుకొనవచ్చు.

ప్రస్తుతం ఆంధ్రలో 1 కోటీ 70 లక్షల ఎకరాల పంటభూమి ఉన్నది. ఇందులో 70 లక్షల ఎకరాలకు సాగుసౌకర్యాలు ఉన్నట్లు ఎంచబడుతున్నది. కాని

నిజానికి 27 లక్షల ఎకరాలకు మాత్రమే గ్యారంటీ నీటిపారుదల సదుపాయాలున్నాయి. మిగతాభూమి వర్షాలు కురుస్తేనేకాని నిండని చెరువులు, బావులు మున్నగు వాటిద్వారా సాగయ్యేది. కాని మనకున్న నీటివనరులను సద్వినియోగం చేసుకొంటే మరొక కోటిఎకరాలకు నీటిపారుదల సౌకర్యం కలుగచేయవచ్చని నిపుణుల అంచనా.

క్రింద పొందుపర్చిన పట్టిక చేటి మన ప్రధాన డెల్టాలను, వాటిక్రింద వివిధ జిల్లాల్లో సాగయ్యే భూమివివరాలను తెలియచేస్తుంది.

| నీటివనరు | లాభంపొందే జిల్లాలు | విస్తీర్ణం ఎకరాలలో |
|---|---|---|
| గోదావరి డెల్టా: | తూర్పుగోదావరి | 5,46,022 |
| | పశ్చిమగోదావరి | 6,58,101 |
| | కృష్ణాజిల్లా | 2,742 |
| | | 12,06,865 |
| కృష్ణా డెల్టా: | పశ్చిమగోదావరి | 41,106 |
| | కృష్ణాజిల్లా | 5,40,290 |
| | గుంటూరుజిల్లా | 4,06,219 |
| | | 9,87,615 |
| కర్నూలు కడప కాలువ (తుంగభద్ర నీరు) | కర్నూలుజిల్లా | 45,513 |
| | కడపజిల్లా | 35,841 |
| | | 81,354 |
| పెన్న: | నెల్లూరుజిల్లా | 1,98,118 |
| | ఈ నదీజలాలతో సాగయ్యే మొత్తం భూమి | 24,73,952 |

— ఈ పట్టికలోని సంఖ్యలు మద్రాసుప్రభుత్వ ఆర్థిక సలహాదారుడు ప్రకటించినవి. రెండవ పంటభూమికూడ కలిపి యివ్వబడింది.

మనకున్న డెల్టాలలో గోదావరిడెల్టా పెద్దదయినా నదీజలంలో నూటికి ఆరుపాళ్లుమాత్రమే, సాగుకు వినియోగించుకొనబడుతున్నది. గోదావరిపై ధవళేశ్వరం వద్ద 1847-51 లలో ఆనకట్ట నిర్మించబడింది. తర్వాత నూరు సం॥లలోను మరయేయితర ప్రధాన ప్రాజెక్టు యీ నదిపై నిర్మించబడలేదు. గోదావరి ఆనకట్ట నిర్మాణ ఖర్చుక్రింద 2 కోట్ల 20 లక్షలు మాత్రం ఖర్చుపెట్టబడింది.

గోదావరి నదీప్రవాహాలలో ఆటు – పోట్లు జాస్తి. ప్రవాహాలు ఎక్కువ ఉన్న సంవత్సరంలో ధవళేశ్వరం వద్ద తీసిన లెక్కల ప్రకారం ప్రవాహపరిమితి 13 కోట్ల 50 లక్షల ఎకరపుటడుగులు. ఈ పరిమితి ఒక్కొక్క సంవత్సరం 1 కోటి 5 లక్షల ఎకరపుటడుగులకు క్షీణిస్తుంది. కాని సగటు సంవత్సరంలో 8 కోట్ల 50 లక్షల ఎకరపుటడుగుల ప్రవాహపరిమితి ఉంటుందని అంచనా వేయబడింది.

పై అంచనాల ఆధారంతో, ఎట్టి పరిస్థితులలోను 5 కోట్ల 75 లక్షల ఎకరపుటడుగుల నీరు సాగుకు లభిస్తుందని అంచనా వేయబడింది. ఇందులో 2 కోట్ల 75 లక్షల ఎకరపుటడుగుల నీరు ఆంధ్రభాగంగా నిర్ణయించబడింది.

కృష్ణానది గోదావరంత ఆటు, పోటులు కలదికాదు. కనుక వ్యవసాయానికి మరింత స్థిరమైనదిగా ఎంచబడుతున్నది. ఈనది ప్రవాహపరిమితి మంచి సంవత్సరంలో 7 కోట్ల 97 లక్షల ఎకరపుటడుగులు గాను, నీరసమైన ప్రవాహం ఉన్న సంవత్సరంలో 1 కోటి 79 లక్షల యకరపుటడుగులు గాను అంచనా వేయబడింది. కాని విజయవాడవద్ద తీసిన లెక్కల ప్రకారం 3 కోట్ల 94 లక్షల ఎకరపుటడుగుల ప్రవాహం సాగుకు అనుకూలమైనదిగా ఎంచబడింది. ఇందులో 45% వరకూ ఆంధ్రభూభాగం.

1852–55 ల లో విజయవాడవద్ద నిర్మింపబడిన ఆనకట్టమినహా ఆంధ్రలో కృష్ణానదిపై మరే ఆనకట్టగాని, ప్రాజక్టుగాని నిర్మింపబడలేదు. ఈ ఆనకట్ట, దాని కాల్వల నిర్మాణమునకు 2 కోట్ల 28 లక్షలు ఖర్చుపెట్టబడింది.

పెన్నానది చాలా ఎత్తయిన ప్రదేశంనుండి ప్రవహిస్తున్నది. ఇది ఆంధ్రలో ప్రవేశించేస్థలం సముద్ర మట్టంకన్న రెండువేల అడుగుల ఎత్తున ఉన్నది.

పెన్నలో నీటిసప్లయి సమృద్ధిగా ఉండినట్లయితే యింత ఎత్తయినభూమి మీదుగా ప్రవహించటం ఆంధ్రులకు చాలా లాభదాయకమై ఉండేది. నది ప్రవహిస్తున్న ఎత్తుమూలమున అనేక మెరక భూములకు నీరు సప్లయిచేయ వీలుండెడిది. కాని పెన్నలోని నీటిప్రవాహం తక్కువ. సంగంవద్ద తీసిన కొలతల ప్రకారం యీ నదిలో 20–30 లక్షల ఎకరపుటడుగుల నీటినిమాత్రమే వ్యవసాయానికి వినియోగించ వచ్చునని తేలింది.

పెన్నపై ఇప్పటికే రెండుఆనకట్టలు 1854–63లలో ఒకటి, 1882–86లలో ఒకటి కట్టబడి ఉన్నాయి. వీటిద్వారా నీటిని కనిగిరి, సర్వేపల్లి రిజర్వాయరులోనికి తరలించి, అచ్చటనుండి వ్యవసాయ అవసరాలకు సప్లయి చేస్తున్నారు. ఈ ఆనకట్టలు మున్నగువాటి నిర్మాణానికి 7 లక్షల రూపాయలు ఖర్చుపెట్టబడింది.

తుంగభద్ర పేరుకు కృష్ణయొక్క ఉపనది అయినా, ఆంధ్రదేశ వ్యవసాయ అవసరాలదృష్ట్యా యిది చాలా ముఖ్యమైనది. సముద్రమట్టానికి వెయ్యి అడుగుల పైభాగంలో ఉండే ప్రదేశాలకు నీటిని అందించడానికి ఈనది తోడ్పడుతుంది.

విజయనగర రాజుల కాలంనుండి యీ నదీజలాలు వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుతూ వచ్చాయి. ఆ కాలంలో యీ నదిపై పది ఆనకట్టలు కట్టబడ్డాయి. వీటిలో రాంపురంవద్ద నిర్మింపబడ్డ ఆనకట్టమాత్రం ఆదోని తాలూకాలో నేటికీ నిలచివుంది. ఆదోని తాలూకాలోని మంటశాలవద్ద మరొక ఆనకట్టకట్టివుంది. కాని నేడది శిథిలరూపంలో ఉంది.

కర్నూలుకు 15 మైళ్ళదూరంలో ఉన్న సుంకేసుల ఆనకట్ట 1838 సం॥లో కట్టబడింది. ఈ ఆనకట్టను, కడప-కర్నూలు కాలువను మద్రాసు ఇర్రిగేషన్ అండు కెనాల్ కంపెనీ లిమిటెడ్ వారు నిర్మించారు. కాని 1870 లో 3 కోట్ల 2 లక్షల రూపాయలు పై కంపెనీకిచ్చి ప్రభుత్వం వీటిని స్వాధీనం చేసుకొంది.

కడప - కర్నూలు కాల్వ ఆదిలో రెండున్నర లక్షల ఎకరాల సాగుకు సరిపడు నీటిని కొనిపోయేందుకు త్రవ్వబడింది. కాని దీనిమరమ్మతులపై ప్రభుత్వం శ్రద్ధవహించక పోవుటచేత అనేకచోట్ల పూడికబడి లక్షా 20 వేల ఎకరాలకు సరిపడు నీటిని సప్లయిజేయుటయే నేడు గగనంగా ఉన్నది.

ఈ సంవత్సరమే బళ్ళారిజిల్లాలోని మల్లపురంవద్ద తుంగభద్రపై నూతనంగా రిజర్వాయరు నిర్మింపబడ్డది. దీనిలో 29 లక్షల ఎకరపుటడుగుల నీరు నిల్వచేయవచ్చు. దీనినుండి సుమారు అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలలో లక్షన్నర ఎకరాలను సాగుచేయవచ్చు.

ఇదిగాక శ్రీకాకుళం జిల్లాలో నాగావళి, వంశధార నదులద్వారా కొంతభూమి సాగులో ఉన్నది. నాగావళిపై 1909 సం॥లో తోటపల్లివద్ద ఒక రెగ్యులేటరు నిర్మింపబడినది. దాని కింద 28 వేల ఎకరాలు సాగుఅవుతున్నాయి. ఈ నదికి అక్కడక్కడ తవ్విన మరొక 14 కాల్వలకింద 42 వేల ఎకరాలు సాగుచేయబడుతున్నాయి.

వంశధార ప్రవాహ ప్రమాణం పెన్నానదితో సరిసమానంగా ఉంటుంది. ఈ నదికి 2½-3 లక్షల ఎకరాల వ్యవసాయానికి నమ్మకంగా తోడ్పడగల ప్రవాహ ప్రమాణంఉన్నా నేడానీరు వినియోగించుకోనబడుటలేదు. అక్కడక్కడ ఉన్న ఏడుకాల్వలకింద 50 వేల ఎకరాలుమాత్రమే సాగులో ఉన్నాయి.

ఇవిగాక చిన్నచిన్న ఆయకట్టులు అనేకం ఆయాజిల్లాలలో ఉన్నవి. వీటిలో ముఖ్యమైనవి - బాహుదా, గోస్తని, శారద, తాండవ, ఎర్రకాల్వ, స్వర్ణముఖి, మునేరు మున్నగునవి. వీటికింద కొద్దిమొత్తాలలో భూమి సాగుచేయబడుతున్నది.

పైన పేర్కొన్న నీటివసరులనుండి 27 లక్షల ఎకరాలు మాత్రమే సాగుచేయబడుతున్నాయి. మనవాటాకు వచ్చేనదీజలాలద్వారా కోటి ఎకరాలకు నీరు సప్లయిచేయవచ్చునని తెలుసుకున్నట్లయితే ఇందుకు అవసరమైన ప్రాజక్టులనునిర్మించు-

కొనటం మనముందున్న ప్రధానకర్తవ్యం అని గుర్తించవచ్చు. ఈ కోటిఎకరాలనూ సాగుకిందకు తెచ్చిననాడు ఆంధ్రరాష్ట్రం అవసరంగా కోటిటన్నుల బియ్యాన్ని ఉత్పత్తి చేయగలదు.

ఆంధ్రదేశ అభివృద్ధికి ప్రధానంగా తోడ్పడే ముఖ్యప్రాజక్టులేమో క్లుప్తంగా క్రింద పరిశీలిద్దాం. స్థూలంగా వీటిని నాల్గుగ్రూపులకింద విభజించవచ్చును. మొదటి గ్రూపు, 10 కోట్ల రూపాయలపైబడి ఖర్చు అగునవి. రెండవగ్రూపు, - 5-10 కోట్ల రూపాయల మధ్యఖర్చు అగునవి. మూడవగ్రూపు, 1-5 కోట్లమధ్య ఖర్చు అగునవి. 4 వ గ్రూపు, 10 లక్షలు - 1 కోటీ రూపాయలమధ్య ఖర్చు అగునవి.

## మొదటి గ్రూపు

రామపాదసాగర ప్రాజెక్టు

పోలవరంవద్ద గోదావరిపై యీ ప్రాజెక్టు ఒక మైలు పొడవునా, 190 అడుగుల ఎత్తునా నిర్మింపబడుతుంది దీనివల్ల ఏర్పడే రిజర్వాయరు ప్రమాణం మద్రాసు రాష్ట్రంలోని మెట్టూరు రిజర్వాయరుకు 8-9 రెట్లు; లేక బక్రా రిజర్వాయరుకు రెండు రెట్లకు పై బడి ఉంటుంది.

ఈ ప్రాజెక్టుద్వారా విశాఖపట్నం, ఉభయ గోదావరులలోని మెట్ట భూములు 13 లక్షల 40 వేల ఎకరములవరకూ సాగవుతవి. (రెండవపంట వచ్చే 5 లక్షల ఎకరాలుకూడ పై మొత్తంలోనే చేర్చబడ్డాయి.) ఇదిగాక యీ ప్రాజెక్టుద్వారా నేడు కృష్ణా, గోదావరి నదుల ఆయకట్టుకింద ఉన్న భూములలో 10 లక్షల ఎకరాలవరకూ రెండవపంటకు నీరు లభిస్తుంది.

ప్రథమంలో నిర్ణయించిన ప్రాజెక్టు ప్లానులు చాల వ్యయప్రయాసలతో కూడుకున్నవనే విమర్శకూడా ఉన్నది. డాము ఎత్తు 40-50 అడుగులకు పరిమితం చేయాలనే వాదంకూడా ఒకటి ఉంది. ఇలాగ నిర్మించినప్పుడుగూడ విశాఖ, గోదావరుల మెట్ట ప్రాంతాలకు నీరు సప్లయి చేయవచ్చును. ఈ ప్రణాళిక ప్రకారం 5 లక్షల ఎకరాలకు నీరు అందించవచ్చు. ఇదిగాక నేటి గోదావరి జిల్లాకు 1-2 లక్షల ఎకరాలవరకూ రెండవపంటకు గ్యారంటీగా నీరు సప్లయి చేయవచ్చు. ఈ పరిమితమైన ప్రణాళిక ప్రకారం ప్రాజెక్టు నిర్మించుటకు 25 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా వేయబడ్డది.

నందికొండ ప్రాజెక్టు

ఈ ప్రాజెక్టు ప్లాను ప్రకారం కృష్ణానదిపై నందికొండ వద్ద 375 అడుగుల ఎత్తుగల డాము నిర్మింపబడుతుంది. ఈ ప్రాజెక్టు రిజర్వాయరులో 92 లక్షల ఎకరపు అడుగుల ప్రమాణంగల నీరు నిల్వచేయబడుతుంది. ఈ రిజర్వాయరుకింద 35 లక్షల

ఎకరాలు సాగుచేయవచ్చు. ఇందులో 27 లక్షల ఎకరాలు ఆంధ్రప్రాంతంలోనూ, 8 లక్షల ఎకరాలు తెలంగాణాలోను సాగుకిందకు వస్తవి.

నందికొండ ప్రాజెక్టు నిర్మింపబడ్డప్పుడు అది ప్రపంచములోని గొప్ప ప్రాజెక్టులలో ఒకటిగా పేర్కొనబడుతుంది. ఆంధ్ర భాగపు నిర్మాణ ఖర్చు 80 కోట్ల రూపాయలుగా అంచనా వేయబడ్డది. కాని దశలవారీగా యీ ప్రాజెక్టును నిర్మించుకొనవచ్చు. నేటి కృష్ణా డెల్టాలో భూములకు యీ ప్రాజెక్టు నిర్మాణంద్వారా రెండవపంటకు నీరు చిక్కుతుంది. నేడు తరుచు కరువు కాటకాలకు లోనయ్యే కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు మెట్టప్రాంతాలకు నందికొండ నిర్మాణం ద్వారా సాగు సదుపాయాలు లభిస్తాయి.

### సిద్ధేశ్వరం

ఇదికూడా కృష్ణానదిపై నిర్మింపబడే ప్రాజెక్టే. 3,250 అడుగుల పొడవున కృష్ణా, తుంగభద్ర నదుల సంగమ స్థలానికి 10 మైళ్ళ దిగువున యీ ప్రాజెక్టు నిర్మింపబడుతుంది. ఈ ప్రాజెక్టు ఎత్తు 90-130 అడుగులమధ్య వుంటుంది. ఇంతకు మించి ఎత్తుపెట్టినట్లయితే కర్నూలు పట్టణమే మునిగే ప్రమాదం ఉన్నది.

సిద్ధేశ్వరం ప్రాజక్టు నిర్మాణంద్వారా నేటి కడప - కర్నూలు కాల్వ క్రిందనున్న ఆయకట్టును కల్పుకొని 5-5½ లక్షల ఎకరములవరకూ సాగుచేయవచ్చు. 2-2½ లక్షల ఎకరములు కడప-కర్నూలు ఆయకట్టుగా తీసివేస్తే, మిగిలిన 3 లక్షల ఎకరములలో 1/3 భాగం మాగాణిసాగుకు, 2/3 భాగం కాల్వనీటి సదుపాయంతో పండించే మెట్టపంటల సాగుకు సరిపోతుందని నిపుణుల అంచనా.

సిద్ధేశ్వరం ప్రాజెక్టు నిర్మాణంద్వారా పెన్నానదిలోనికి నీటిని పంపి నేటి పెన్నా డెల్టాక్రింద అదనపు భూమిని సాగుకిందకు తేవచ్చు. అలాగే గండికోటకు కూడ నీటిని కొనిపోయి లక్షా-లక్షన్నర ఎకరములవరకూ కరువుప్రాంతాలలో నీటిని సప్లయి చేయవచ్చు. ఈ ప్రాజక్టు నిర్మాణం ప్రధానంగా క్షామపీడిత ప్రాంతాలకు తోడ్పడుతుంది.

### పులిచింతల

కృష్ణానదిపై పులిచింతలవద్ద 150 అడుగులఎత్తున డామ్ నిర్మింపబడుతుంది. దీని జలప్రమాణ పరిమితి 37½ లక్షల ఎకరపుటడుగులు. నందికొండ ప్రాజక్టునకు దిగువనఉన్న నీటిని నిల్వజేయుటయే యీ ప్రాజక్టు నిర్మాణంలోని ప్రధాన ఆశయం. ఈ ప్రాజక్టుద్వారా 8 లక్షల ఎకరములకు నీటిని సప్లయి చెయ్యవచ్చు. ఇదిగాక అదనంగా 2-3 లక్షల ఎకరములకు రెండవపంటకు నీరు లభిస్తుంది. కాని నందికొండ ప్రాజక్టు నిర్మించినట్లయితే పులిచింతల ప్రాజెక్టుక్రింద నీరు అందే ప్రాంతాలన్నిటికీ నీరు లభిస్తుంది. అయినా యీ భాగములకు పులిచింతలద్వారానే నీటిని సప్లయి

చేయుటద్వారా, నందికొండ నీటిని వాగీ గుంటూరు నదికొన్ని గొప్ప ప్రదేశాలకు అందించే అవకాశం ఉంటుంది.

## రెండవ గ్రూపు

### వంశధారా ప్రాజక్టు

మదనపురంవద్ద 65 అడుగుల ఎత్తున వంశధారపై యీ ప్రాజక్టు నిర్మింపబడుతుంది. 4 లక్షల ఎకరపుటడుగుల నీరు యీ రిజర్వాయరులో నిల్వ చేయబడుతుంది. ఈ ప్రాజక్టు నిర్మాణంద్వారా 2-2½ లక్షల ఎకరములకు శ్రీకాకుళం జిల్లాలో నీరు లభ్యమవుతుంది. ఇదిగాక 50 వేల ఎకరములకు రెండవపంటకు నీటినీ, నేడుసాగులో ఉన్న 50 వేల ఎకరములకు సక్రమ నీటి సప్లయినీ గ్యారంటీ చేయడానికి యీ ప్రాజక్టు తోడ్పడుతుంది.

### శబరి ప్రాజక్టు

100 అడుగుల ఎత్తున శబరినదిపై చింతూరు అన్నచోట యీ ప్రాజక్టు నిర్మించబడుతుంది. దీనిద్వారా నేటి గోదావరి జిల్లాలో రెండవపంట సమృద్ధిగా పండించవచ్చు. దీని నిర్మాణపు ఖర్చు 6-9 కోట్ల రూపాయలు ఉంటుందని అంచనా.

### తుంగభద్ర హైలెవెల్ కాల్వ

తుంగభద్ర హైలెవెల్ కాల్వ నిర్మాణంద్వారా కరువుప్రాంతాలలో 2-3 లక్షల ఎకరములవరకు సాగులోకి తీసుకొనిరావచ్చు. 4 వేల క్యూసెక్కుల ప్రమాణము గలిగిన నీటిని పంపగల్గిన స్లూయిసులతో డామును నిర్మించినట్లయితే గుంతకల్లు, తాడిపత్రి, పులివెందల మున్నగు ప్రాంతాలకు నీరు లభిస్తుంది. దిగువను చిన్న చిన్న అడ్డకట్టలు కట్టి యీ నీటిని ఉరవకొండ ప్రాంతానికి కూడ పంపవచ్చు.

హైలెవెల్ కాల్వ నిర్మాణం జరిగినట్లయితే తుంగభద్ర నీటిని గండికోట ప్రాజెక్టుకు కూడ సప్లయిచెయ్యవచ్చు.

## మూడవ గ్రూపు

### కృష్ణా రెగ్యులేటరు

నేటి కృష్ణ ఆనకట్టకు 100-150 అడుగుల ముందు రెగ్యులేటరును నిర్మిస్తే, ఆనకట్టపైనుండి పొర్లిపోయి వ్యర్థం అవుతున్న నీటిని సద్వినియోగం చెయ్యవచ్చు. బలహీనత పడిఉన్న ఆనకట్టను దిట్టపర్చడానికి యీ రెగ్యులేటరు తోడ్పడుతుంది. పైగా నేటి కృష్ణకాల్వలలో నీరు సమృద్ధిగా పారాలంటే ఆనకట్టపై 7½ అడుగుల నీరు ఉండాలి. కాని ప్రస్తుతపు షట్టర్ల ఎత్తు 6 అడుగులు మాత్రమే.

ఒకవైపు చేత కొల్లిపర్రలంకా నిర్మించాలని అనికట్టుపైనుండి కూడ కిందపారుదలవరకూ నీటి మట్టమును పెంచడం కలుగుతున్నది. దీనిద్వారా ఎంతో నీరు వృథా అవుతున్నది.

రెగ్యులేటరు నిర్మాణంద్వారా యీ వృథాను అరికట్టవచ్చు. నీటి నిల్వ మట్టమును పెంచవచ్చు. ఇందుమూలంగా కొంత అదనపు భూమినికూడ ఆయకట్టులో కల్పుకొనవచ్చు. రెగ్యులేటరుతోపాటు రోడ్డుబ్రిడ్జిని కూడ నిర్మించవచ్చును. కృష్ణా-గుంటూరు మండలాల మధ్య రాకపోకలకు యీ వంతెన ఎంతో సహాయకారి. దీని నిర్మాణవ్యయం వంతెనతోసహా 2½ కోట్లు.

### కడప - కర్నూలుకాల్వ వెడల్పుచేస్తే...

కడప - కర్నూలు కాల్వను వెడల్పు చేయుటద్వారా కడప, కర్నూలు జిల్లాలకు లక్ష - లక్షన్నర ఎకరాల సాగుకు తక్షణసౌకర్యం ఏర్పర్చవచ్చు. ఆదిలో 2½ లక్షల ఎకరముల సాగుకని యీ కాల్వ నిర్మించబడిందేకాని లక్ష ఎకరములు దాటి యీకాల్వక్రింద ఎప్పుడూ సాగుకాలేదు. కాల్వలో విపరీతమైన పూడిక చేరుటయే దీనికి ప్రధానకారణం. ఈ కాల్వను సరిచేయుటద్వారా గండికోట ప్రాజెక్టుక్రింద మేలుపొందు కొన్ని ప్రాంతాలకు కూడ నీటిని సప్లయిచేయవచ్చు.

### గండికోట ప్రాజెక్టు

పెన్నానదిపై జమ్మలమడుగు సమీపంలో యీ ప్రాజెక్టు నిర్మించబడుతుంది. 55 అడుగుల యీ ప్రాజెక్టు 15 లక్షల ఎకరపుటడుగుల నీటిని నిల్వచేస్తుంది. కడప జిల్లాలోని జమ్మలమడుగు, దాని పరిసర క్షామప్రాంతాలలో లక్షన్నర ఎకరములవరకూ సాగుచేయడానికిది తోడ్పడుతుంది. గండికోటకు కావలసిన నీరు ఇటు సిద్ధేశ్వరం ప్రాజెక్టు కాల్వలనుండా గాని, లేక తుంగభద్ర హైలెవెల్ కాల్వ నుండి గాని తీసుకొనవచ్చును. రాయలసీమలోని క్షామప్రాంతాల తక్షణ అవసరాల దృష్ట్యా దీనిని వెంటనే నిర్మించటం అత్యవసరం.

## నాల్గవ గ్రూపు

కోటిరూపాయలలోపు - 10 లక్షల రూపాయలపైన వ్యయంతో నిర్మించడానికి వీలయిన చిన్నప్రాజక్టులు మనకు 25 వరకూ ఉన్నవి. వీనిలో శ్రీకాకుళం, విశాఖజిల్లాలలోనివి ముఖ్యమైనవి. అక్కడ సమృద్ధిగా ఉన్న నీటివనరుల దృష్ట్యా ఇవి చాలా లాభదాయకమైనవికూడ.

మనకు మొత్తంగా ఉన్న నీటివనరుల పరిస్థితి-అవి మనకు చేకూర్చగల్గిన లాభం-వాటిపై ప్రాజక్టుల నిర్మాణమునకు స్థూలంగా అయ్యేఖర్చు ప్రక్కపేజీలోని పట్టిక తెలియజేస్తుంది.

| వివరణ | ప్రాజక్టుల సంఖ్య | నిర్మాణపుఖర్చు - కోట్లరూపాయలలో | అదనంగా సాగయ్యే భూమి (లక్షల ఎకరాలలో) |
|---|---|---|---|
| మొదటిగ్రూపు పెద్దప్రాజక్టులు | 4 | 140 | 50 |
| రెండవగ్రూపు మధ్యతరగతి ప్రాజక్టులు | 4 | 35 | 13 |
| మూడు, నాల్గవగ్రూపులు చిన్నప్రాజక్టులు | 35 | 25 | 6 |
| మొత్తం | 43 | 200 | 69 |

అనగా రెండువందలకోట్ల రూపాయలు ఖర్చుపెట్టినట్లయితే 70 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలను కల్గించవచ్చు. ఇంకా పరిశీలన గాకుండా మిగిలి ఉన్న ఆంధ్రదేశపు నీటి వనరులను గూడ లెక్కించినట్లయితే 100 లక్షల ఎకరాల వరకూ సాగుచేయగల్గిన నీళ్లు ఆంధ్రదేశంలో ఉన్నట్లు ఎంచబడుతున్నది.

ఇదికాక 5 లక్షల కిలోవాట్లుల విద్యుత్‌నుకూడా యీ ప్రాజక్టుల నిర్మాణంద్వారా పొందవచ్చు. (వివరాలకు విద్యుచ్ఛక్తి అధ్యాయం చూడుడు) ఈ విద్యుచ్ఛక్తి సాయంతో, మన లోహసంపదల వినియోగించుకొన గల్గిన పక్షంలో భారీ పరిశ్రమలను ఎన్నింటినో ప్రారంభించుకొనవచ్చు.

ప్రాజక్టుల నిర్మాణంద్వారా ఆంధ్రదేశ స్వభావాన్నే మార్చివేయవచ్చు. నేడు ఎటుచూచినా కన్పించే నిరుద్యోగం, తిండి కరువులను రూపుమాపవచ్చు. ఇతర రాష్ట్రములకు ఎంతో ఎగుమతి చేయవచ్చు. ఆంధ్రదేశాన్ని భారతదేశ ధాన్యాగారంగా మార్చవచ్చు.

ఢిల్లీ ఆంధ్రసమితి అధ్వర్యాన జరిగిన "ఆంధ్ర సమ్మేళనం"లో డాక్టరు కె. యల్. రావుగారిచే చదువబడ్డ వ్యాసంలోని అంచనాలు, వివరణ యీ అధ్యాయానికి తీసుకొన్న ఆధారాల్లో ప్రధానమైనవి.

# ఆంధ్రరాష్ట్రం

## సాగుబడి వివరాలు

బళ్ళారిజిల్లా సంఖ్యలు మొత్తం యివ్వబడ్డాయి.

ఉ

ప ⟵ ⟶ తూ

ద



# ఆంధ్ర నదులు - వాటి వివరములు

| నదిపేరు | పొడవు (మైళ్ళలో) | గరిష్ట ప్రవాహ పరిమితి క్యూసెక్కులలో |
|---|---|---|
| **ఉభయ విశాఖలు** | | |
| బాహుద | 65 | 73,190 |
| ఉత్తర మహేంద్రతనయ | 25 | 24,500 |
| బెండిగడ్డ | 15 | 18,300 |
| వరహాలుగడ్డ | 15 | 13,500 |
| గరిబులుగడ్డ | 14 | 22,500 |
| వంశధార | 140 | 2,20,000 |
| నాగావళి | 90 | 1,28,100 |
| పెద్దగెడ్డ | 22 | 16,500 |
| కందివలస | 23 | 11,000 |
| నెల్లిమర్ల | 65 | 89,990 |
| గోస్తని | 60 | 32,350 |
| గంభీరాంగడ్డ | 15 | 16,000 |
| నారవగడ్డ | 24 | 24,500 |
| కర్జపుగడ్డ | 14 | 11,000 |
| శారద | 60 | 51,100 |
| వరహ | 44 | 32,200 |
| తాండవ | 46 | 32,350 |
| **తూర్పుగోదావరి** | | |
| పంప | 32 | 20,000 |
| ఏలేరు | 65 | 49,000 |
| గోదావరి | 937 | 21,07,660 |
| **పశ్చిమగోదావరి** | | |
| ఎర్రకాల్వ | 60 | 36,000 |
| **కృష్ణా** | | |
| ఉప్పుటేరు | 30 | 32,000 |
| (ఎ) తమ్మిలేరు | 68 | |
| (బి) బుడమేరు | 35 | 27,760 |

| నది పేరు | పొడవు (మైళ్ళలో) | గరిష్ఠ ప్రవాహ పరిమాణం క్యూసెక్కులలో |
|---|---|---|
| కృష్ణ | 775 | 11,94,000 |
| నక్కవాగు | 52 | 9,400 |
| వగరువాగు | 65 | 8,700 |
| రొంపేరు (మురుగు) | 55 | 16,600 |
| **గుంటూరు** | | |
| గుండ్లకమ్మ | 145 | 1,20,000 |
| మూసీ | 70 | 52,050 |
| **నెల్లూరు** | | |
| పాలేరు | 68 | 55,850 |
| మన్నేరు | 75 | 69,880 |
| పిల్లి వాగు | 26 | 12,400 |
| పైడేరు | 20 | 11,000 |
| పెన్న | 370 | 4,47,000 |
| ఉప్పుటేరు | 55 | 16,000 |
| స్వర్ణముఖి | 99 | 27,000 |
| కళంగి | 40 | 11,600 |

# ఆంధ్రలోని ముఖ్య ఆయకట్లు

| జిల్లా | ఆయకట్టు పేరు | 1947-48 వరకు పెట్టిన ఖర్చు (రూ॥లలో) |
| --- | --- | --- |
| ఉత్తరవిశాఖ | నాగావళి | 18,01,983 |
| ,, | చికాకోల్ మైనర్ సిస్టం | 2,89,226 |
| తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా | గోదావరి డెల్టా | 2,40,44,629 |
| తూర్పుగోదావరి | పోలవరం ప్రాజక్టు | 17,05,823 |
| పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు | కృష్ణా డెల్టా | 3,04,44,519 |
| కృష్ణ | మునేరు సిస్టం | 6,09,728 |
| నెల్లూరు | పెన్నా డెల్టా | 70,70,841 |
| కడప | సగిలేరు ప్రాజక్టు | 4,64,727 |
| నెల్లూరు | మోపాడు రిజర్వాయరు | 24,36,991 |
| బళ్ళారి | తుంగభద్ర ప్రాజక్టు | |
| నెల్లూరు | రాళ్ళపాడు ప్రాజక్టు | |
| కర్నూలు | సిద్దాపురం | 8,04,486 |
| ,, | కర్నూలు-కడప కాల్వ | 2,34,13,208 |

# ఆంధ్రలో నిర్మాణానికి వీలయిన ప్రాజక్టులు

| నెం. (1) | ప్రాజక్టు పేరు (2) | లాభంపొందే జిల్లాలు (3) | నూతనంగా సాగుక్రిందకు తెచ్చే భూమి (4) |
|---|---|---|---|
| | I గ్రూపు – పదికోట్ల రూపాల పైబడి ఖర్చుఅగునవి. | | |
| 1. | రామపాదసాగరం (ప్రథమస్టేజి) | గోదావరి | 8,00,000 |
| 2. | పులిచింతల | కృష్ణా, గుంటూరు | 8,00,000 (రెండవ పంటతోసహా) |
| 3. | నందికొండ | గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు | 26,00,000 (ఆంధ్ర భాగం) |
| 4. | సిద్ధేశ్వరం డామ్ – 870 అడుగుల వరకూ – కాల్వలు, సొరంగాలు | కడప, కర్నూలు, నెల్లూరు, చిత్తూరు | 8,00,000 |
| | II గ్రూపు – 5–10 కోట్లమధ్య ఖర్చు అయ్యేవి. | | |
| 5. | వంశధార | శ్రీకాకుళం | 2,50,000 మొదటిపంట 50,000 రెండవపంట 50,000 నేటి ఆయకట్టుకు గ్యారంటీ సప్లై |
| 6. | చింతూరు డామ్ (శబరినదిపై) | తూర్పు, పశ్చిమ గోదావరులు | 5,00,000 మొదటిపంట 3,00,000 రెండవపంట |
| 7. | సోమశిల | నెల్లూరు | 2,00,000 రెండవపంట |
| 8. | తుంగభద్ర హైలెవెల్ కాల్వ | అనంతపురం, కడప | 3,00,000 |
| | III గ్రూపు–1 కోటీ–5కోట్ల మధ్య ఖర్చు అయ్యేవి. | | |
| 9. | ఏలేరు రిజర్వాయరు | తూర్పు, పశ్చిమ గోదావరులు | 36,000 (రెండవపంట) 80 వేల ఎకరాలకు–15 వేలఎకరాల రెండవ పంట భూమి కలుపుకొని గ్యారంటీ సప్లై |

| ప్రాజెక్టు పేరు (౨) | లాభం పొందే జిల్లాలు (౩) | కొత్తగా సాగు చేయబడే ఎకరాల సంఖ్య (౪) | |
|---|---|---|---|
| ఎర్రకాల్వపై అప్పలరాజును గూడెంవద్ద రిజర్వాయరు | తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి | 48,000<br>8,000 నేటి ఆయకట్టుకు గ్యారంటీ సప్లై | |
| విజయవాడవద్ద కృష్ణానదిపై రెగ్యులేటరు. | కృష్ణా | 50,000 | |
| తంగిరాలవద్ద గుండ్లకమ్మపై రిజర్వాయరు | గుంటూరు | 30,000 | |
| కడప – కర్నూలు కాల్వ మరమ్మతు | కర్నూలు–కడప | 1,50,000<br>1,00,000 నేటి ఆయకట్టుకు గ్యారంటీ సప్లై. | |
| గండికోట (ప్రథమస్టేజి) | కడప | 50,000 | |
| IV గ్రూపు–1కోటి–10లక్షల మధ్య ఖర్చు అగునవి. | | | |
| సంచివాడవద్ద నాగావళిపై ఆనకట్ట. | శ్రీకాకుళం | 14,000<br>6,000 నేటి ఆయకట్టుకు గ్యారంటీ సప్లై | |
| నాగావళి కుడికాల్వ – తోటపల్లి వద్ద. | ,, | 6,000 | |
| | | కొత్తసాగు | పాతసాగుకు గ్యారంటీ సప్లయి |
| జట్టిగడ్డపై రిజర్వాయరు | విశాఖపట్నం శ్రీకాకుళం | 7,000 | 3,000 |
| జంఝావతిపై రిజర్వాయరు | ,, | 14,000 | 15,000 |
| కందివలసవద్ద వేగావతిస్కీము ఆనకట్ట | ,, | 1,500 | 4,000 |
| మామిడిపల్లి గెడ్డపై ఆనకట్ట | ,, | 5,000 | 2,000 |
| తాటపూడివద్ద గోస్తని నదిపై రిజర్వాయరు | ,, | 7,000 | 6,000 |

| నెం. (1) | ప్రాజక్టు పేరు (2) | లాభంపొందే జిల్లాలు (3) | నూతనంగా సాగుక్రిందకు తెచ్చే భూమి (4) | |
|---|---|---|---|---|
| | | | క్రొత్తసాగు | పాతసాగుకు గ్యారంటి సప్లయి |
| 22. | బోయపాలెంవద్ద రిజర్వాయరు | విశాఖపట్నం శ్రీకాకుళం | 1,000 | 400 |
| 23. | తాండవపై రిజర్వాయరు గోడిగూమివద్ద | ,, | 3,000 | 70 |
| 24. | ,, గంటవవద్ద | ,, | 4,500 | — |
| 25. | తుని రైల్వేవంతెనవద్ద రిజర్వాయరు (తాండవపై) | ,, | 10,000 | 15,000 |
| 26. | రైవాడ వద్ద రిజర్వాయరు (శారదపై) | ,, | 6,000 | 6,000 |
| 27. | సురపాడువద్ద అడ్డరుగడ్డపై ఆనకట్ట | ,, | 1,500 | 300 |
| 28. | శీతానగరంవద్ద ఆనకట్ట (నాగావళి – స్వర్ణముఖి) | ,, ,, | 2,300 | 1,700 |
| 29. | బైనేరుపై రిజర్వాయరు | తూ॥ ప॥గోదావరులు | 7,700 | — |
| 30. | రాజవరంవద్దఎర్రకాల్వపైఆనకట్ట | ,, | 3,000 | — |
| 31. | పాంప రిజర్వాయరు | ,, | 2,000 (1వ పంట) 1,000 (2వ పంట) | 8,000 |
| 32. | తాండవ రిజర్వాయరు | ,, | 10,000 (1వ పంట) 4,000 (2వ పంట) | 15,000 |
| 33. | తొర్రిగడ్డ పంపింగ్‌స్కీము | ,, | 13,000 | — |
| 34. | గోదావరి ఆనకట్ట షట్టర్ల ఎత్తు ఇంకా 3-5 అ. పెంచిన | ,, | 75,000 | — |
| 35. | బుడమేరు ప్రాజెక్టు | కృష్ణా | 15,000 | — |
| 36. | ఉప్పుటేరు అభివృద్ధి | ,, | 25,000 | — |
| 37. | తమ్మిలేరు ప్రాజెక్టు | కృష్ణా | 10 నుండి 20,000 | — |

| నెం. (1) | ప్రాజెక్టు పేరు (2) | లాభం పొందే జిల్లాలు (3) | నూతనంగా సాగుక్రిందకు తెచ్చే భూమి (4) |
|---|---|---|---|
| 38. | గాజులదిన్నె ప్రాజెక్టు | కర్నూలు | 5,000 (మొదటిపంట)<br>3,000 (రెండవపంట) |
| 39. | దిగువసగిలం ప్రాజెక్టు | కడప | 3,000 |
| 40. | కల్యాణి రిజర్వాయరు | చిత్తూరు | 200 (మొదటిపంట)<br>800 (రెండవపంట) |
| 41. | చెన్నరాయమిగుడి రిజర్వాయరు | అనంతపురం | 1,200 (మొదటిపంట)<br>400 (రెండవపంట) |
| 42. | ఎగువ పెన్నారు | ,, | 6,000 |
| 43. | భైరవానితిప్ప | ,, | 8,000 |

నోటు:—ఈ అధ్యాయపు చివర యిచ్చిన పట్టికలు డాక్టరు కె. యల్. రావుగారు ఢిల్లీలో జరిగిన "ఆంధ్ర సమ్మేళనం" సందర్భంలో సమర్పించిన వ్యాసంనుండి స్వీకరించబడ్డవి.

# ఆహార పంటలు

ఆంధ్ర దేశంలో 1,35,58,376 ఎకరాలలో ఆహార పంటలు పండించ బడుతున్నాయి. వరి, సజ్జ, జొన్న, రాగులు, కొఱ్ఱలు, వరిగెలు మొదలైనవి మన ప్రధాన ఆహార ధాన్యాలు. ఈ పంటల విలువ (సంవత్సర సగటు) సుమారు రు 133½ కోట్లని ప్రభుత్వ అంచనా.

ఆహార ధాన్యాల విషయంలో ఆంధ్రరాష్ట్రం తన అవసరాలు తీరగా ఇతర ప్రదేశాలకు ఎగుమతి చేయగల స్థితిలోఉన్నది. 1951 జనాభా లెక్కల ప్రకారం, పెద్దలకు తల 1కి దినానికి 12 ఔన్సులు, పిల్లలకు తల 1కి 6 ఔన్సుల చొప్పున ఆహారధాన్యాలుసప్లయిచేస్తే సంవత్సరానికి 10½లక్షల టన్నులు మిగులుంటుంది. పెద్దలకు తల 1 కి 16 ఔన్సులు, పిల్లలకు8 ఔన్సుల చొప్పున లెక్కవేసినా సుమారు 4½ లక్షల టన్నుల ఆహార ధాన్యాలు మిగులుంటాయి.

పంటలవారీ వివరాలు క్రింద పరిశీలిద్దాం !

ఆంధ్రదేశ ప్రధాన పంట వరి. ఏటా 43½ లక్షల ఎకరాలలో సుమారు 28,26,000 టన్నులు పండించబడుతున్నది. ఆంధ్ర జిల్లాలలోకల్లా, పశ్చిమ గోదావరి జిల్లాలో హెచ్చుభాగం పండించబడుతున్నది. గోదావరి, కృష్ణ, పెన్న ఆయకట్టు క్రిందఉన్న సుమారు 24 లక్షల ఎకరాలలోనే సుమారు 20½ లక్షల టన్నులు పండించబడుతున్నది. ఎకరసగటు ఉత్పత్తి 1,631 పౌనులుగా అంచనా వేయబడు తున్నది.

నీటికి వర్షమువైననే ఆధారపడే చెరువులు, బావుల నీటి పారుదలతో సాగు చేయబడే భూమి ఎకర సగటు ఉత్పత్తి 1,153 పౌనులుగా అంచనా వేయ బడుతున్నది. అత్యధికభాగంలో ఒకేపంటపండిస్తారు.

తర్వాత ముఖ్యమైన పంట జొన్న. రాష్ట్రం మొత్తంమీద 30,27,000 ఎకరాలలో 4,72 వేల టన్నులు పండించబడుతున్నది.

ఆంధ్రజిల్లాలలో పండే మొత్తం జొన్నపంటలో ఒక్క కర్నూలు జిల్లాలోనే 5వ వంతు పండించబడుతున్నది. కర్నూలు, గుంటూరు, నెల్లూరు–ఈ మూడు జిల్లాలూ మొత్తం రాష్ట్రంలో పండేపంటలో దాదాపు సగభాగాన్ని పండిస్తున్నాయి.

మూడవ ప్రధానమైన ఆహారపంట కొర్రలు. రాష్ట్రంలో 15,20 వేల ఎకరాలు కొర్రపంట క్రిందవున్నది. సంవత్సర ఉత్పత్తి 1,87 వేల టన్నులు. అత్యధిక భాగం కడప, కర్నూలు, అనంతపురం, గుంటూరు జిల్లాలలో పండించబడుతున్నది.

రాష్ట్రంలో 3,40 వేల ఎకరాలలో వరిగె పండించబడుతున్నది. సంవత్సర సగటు ఉత్పత్తి 68 వేల టన్నులు. ఈ పంట ప్రధానంగా కర్నూలు, నెల్లూరు జిల్లాలలో పండించబడుతున్నది. అంటే మూడింట రెండువంతుల పంట ఈ రెండు జిల్లాలలోనే పండించబడుతున్నది.

తరువాత ఎన్నదగిన పంట రాగి (చోడి, తైద). రాష్ట్రం మొత్తంమీద 5,66 వేల ఎకరాలలో 2,70 వేల టన్నులు పండించబడుతున్నది. నెల్లూరు, చిత్తూరు, అనంతపురం, కడప ఈ పంట పండించే ముఖ్యజిల్లాలు.

సజ్జ పంట 11,50 వేల ఎకరాలలో పండించబడుతున్నది. సంవత్సర సగటు ఉత్పత్తి 2,57 వేల టన్నులు. ఈ పంట పండించడంలో 44½ వేల టన్నులు ఉత్పత్తి చేసి, గుంటూరుజిల్లా ఆంధ్రదేశంలో అగ్రస్థానం వహిస్తున్నది. అనంతపురం, కడప, నెల్లూరు, చిత్తూరు ప్రధానంగా పండించే ఇతర జిల్లాలు.

మదరాసు ప్రభుత్వ ఆర్థిక సలహాదారు లెక్కల ప్రకారం (1944-'45) ఆంధ్రదేశంలో మెట్టధాన్యాల సగటు ఉత్పత్తి 13,42 వేల టన్నులు. ప్రజావసరాలకు సంవత్సరానికి సగటున, 12,94 వేల టన్నుల మెట్టధాన్యం కావాలని, ఈ లెక్కల ప్రకారం సుమారు 48 వేల టన్నుల మెట్టధాన్యం ఆంధ్ర రాష్ట్రంలో మిగులుంటుందని అంచనా వేయబడుతున్నది.

పప్పు దినుసులు 17 లక్షల ఎకరాలలో పండించబడుతున్నాయి. వీటిలో ఉలవలు, మినుములు, పెసలు, కందులు, శెనగల పరిమాణం అధికం.

ఉలవలు 8½ లక్షల ఎకరాలలో, 70 వేల టన్నుల పైబడి పండించబడుతున్నాయి. దీనిలో 3 వ వంతు ఒక్క అనంతపురం, గుంటూరు జిల్లాలలోనే పండించబడుతున్నది.

తరువాత ఎన్నదగిన పంట పెసలు. 3,30 వేల ఎకరాలలో 36½ వేల టన్నులు ఉత్పత్తి చేయబడుతున్నది. కృష్ణా, గుంటూరు, కర్నూలు, తూర్పు గోదావరి జిల్లాలు ఈ పంటలో అత్యధిక భాగం పండించుతున్నాయి. మొత్తం పంటలో 4 వ వంతు ఒక్క కర్నూలు జిల్లాలోనే పండించబడుతున్నది.

# నీటిసప్లయి సౌకర్య వివరాలు (1950-51)

| జిల్లా పేరు | ప్రభుత్వ కాలువల ద్వారా నీటి సప్లయి | ప్రైవేటు కాలువల ద్వారా నీటి సప్లయి | చెరువుల ద్వారా నీటి సప్లయి | బావుల ద్వారా నీటి సప్లయి | మొత్తం సాగయ్యే భూమి (Total area) | జిల్లా విస్తీర్ణంలో సాగయ్యే భూమి 100 కి ఎన్ని పాళ్లు | రెండు పంటలు పండించే భూమి | మొత్తం సేద్యం చేయబడే భూమిలోని మొత్తం సాగు (Gross area) 100కి ఎన్నిపాళ్ళు |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. శ్రీకాకుళం | 1,33,831 | 18,266 | 2,11,448 | 64,488 | 4,19,185 | 50.6 | 52,144 | 44.6 |
| 2. విశాఖ | 96,387 | 24,620 | 1,47,567 | 64,241 | 3,09,855 | 37.4 | 83,313 | 35.7 |
| 3. తూర్పుగోదావరి | 4,05,713 | — | 1,27,953 | 36,402 | 5,69,852 | 54.3 | 1,45,843 | 53.7 |
| 4. పశ్చిమగోదావరి | 6,69,457 | — | 1,08,048 | 24,201 | 8,01,806 | 89.9 | — | 71.2 |
| 5. కృష్ణా | 6,77,400 | — | 11,900 | 36,000 | 7,25,300 | 58.1 | 6,066 | 52.1 |
| 6. గుంటూరు | 4,17,690 | — | 25,905 | 16,908 | 4,59,154 | 21.6 | — | 19.2 |
| 7. కర్నూలు | 42,291 | 25 | 40,251 | 25,186 | 1,06,401 | 5.0 | 16,592 | 5.6 |
| 8. అనంతపురం | 39,398 | 656 | 1,05,137 | 72,217 | 2,14,650 | 9.6 | 46,098 | 11.4 |
| 9. కడప | 55,794 | 304 | 60,920 | 1,34,216 | 2,43,061 | 23.0 | — | 21.5 |
| 10. నెల్లూరు | 1,56,341 | 116 | 2,25,068 | 1,64,680 | 5,04,673 | 39.3 | 36,533 | 38.7 |
| 11. చిత్తూరు | 12,525 | 1,598 | 1,14,926 | 1,07,190 | 2,25,651 | 27.0 | 10,588 | 26.7 |
| 12. బళ్ళారి | 29,375 | 15 | 23,640 | 8,645 | 61,378 | 2.5 | 297 | 2.4 |

— Season and Crop Report of Madras State 1950–'51, P. 50

# ఆంధ్రరాష్ట్రం

## ఆహార పంటలు

బళ్ళారిజిల్లా మొత్తం వివరాలు యివ్వబడ్డాయి.
శ్రీకాకుళం, విశాఖ జిల్లాల మొత్తం కలిపి
యివ్వబడ్డాయి.




ఒరిస్సా
మధ్యప్రదేశ్
శ్రీకాకుళం
విశాఖపట్నం
హైద్రాబాద్
తూ.గోదావరి
ప.గోదావరి
కృష్ణా
గుంటూరు
కర్నూలు
బంగాళాఖాతం
బళ్ళారి
అనంతపూర్
కడప
నెల్లూరు
మైసూరు
చిత్తూరు
మద్రాసు

**సూచిక**

జిల్లాల సరిహద్దులు

వరి

జొన్న

పప్పుదినుసులు

(అంకెలు : వేల టన్నులలో ఉత్పత్తి.)

రెండు లక్షల ఐదువేల ఎకరాలలో 20½ వేల టన్నుల కందులు పండించబడుతున్నాయి. గుంటూరు, కర్నూలు, అనంతపురం ప్రధానంగా ఈ పంట పండించే జిల్లాలు. ఈ మూడు జిల్లాలోనే, రాష్ట్ర ఉత్పత్తిలో సగానికిపైగా పండించబడుతున్నది.

మినుములు 1,35 వేల ఎకరాలలో 16 వేల టన్నులు పండుతున్నాయి. శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో ప్రధానంగా ఈ పంట పండించబడుతున్నది. ఒక్క కృష్ణా జిల్లాయే, మొత్తం పంటలో మూడవ వంతు పండిస్తున్నది.

సగటున ప్రతి సంవత్సరం సుమారు తొంభై వేల ఎకరాలలో 18 వేల టన్నుల శనగలు పండించబడుతున్నాయి. 7,260 టన్నుల శనగ, ఒక్క కర్నూలు జిల్లాలోనే పండించబడుతున్నది.

# ఆహారపంటల వివరాలు (1)

| జిల్లా (1) | వరి (2) | | జొన్న (3) | | మొక్కజొన్న (4) | |
|---|---|---|---|---|---|---|
| | పండించబడిన ఎకరాలు | పండించబడినపంట టన్నుల్లో | పండించ బడిన ఎకరాలు | పండించబడిన పంట టన్నుల్లో | పండించబడిన ఎకరాలు | పండించబడిన పంట టన్నుల్లో |
| 1. శ్రీకాకుళం | | | | *3,740 | | |
| 2. విశాఖ | 7,72,000 | 4,09,280 | 54,200 | *9,140 | 3,200 | 1,410 |
| 3. తూర్పుగోదావరి | 6,99,000 | 5,01,920 | 73,600 | *5,550 | 3,350 | 1,310 |
| 4. పశ్చిమగోదావరి | 7,34,600 | 5,64,310 | 53,260 | *10,980 | 1,700 | 670 |
| 5. కృష్ణా | 6,71,890 | 4,57,790 | 2,15,900 | *45,070 | 6,750 | 2,900 |
| 6. గుంటూరు | 4,69,000 | 3,19,830 | 4,62,000 | *88,000 | 19,900 | 8,630 |
| 7. కర్నూలు | 96,210 | 53,730 | 5,86,000 | *90,040 | 3,230 | 1,260 |
| 8. అనంతపురం | 1,28,480 | 72,370 | 2,80,400 | *48,090 | 100 | 34 |
| 9. కడప | 1,21,100 | 73,440 | 2,65,500 | *39,170 | 60 | 20 |
| 10. నెల్లూరు | 4,17,080 | 2,29,870 | 3,37,000 | *73,750 | 120 | 45 |
| 11. చిత్తూరు | 2,09,750 | 1,24,080 | 32,060 | * 6,480 | 10 | *10 |
| 12. బళ్ళారి (మొత్తం) | 35,910 | 19,940 | 6,67,000 | *62,280 | 140 | 150 |
| మొత్తం | 43,55,020 | 28,26,560 | 30,26,920 | 4,82,290 | 28,560 | 16,490 |

నోటు: బళ్ళారిజిల్లా మొత్తంగా చేర్చబడినది. మిగిలిన అంచనాలన్నీ సంవత్సరాల సగటు అంచనాలు. *Current A 1950 - M. Production.

## ఆహారపంటల వివరాలు (2)

| జిల్లా | కంబు (5) | | రాగి (6) | | జొన్న (7) | |
|---|---|---|---|---|---|---|
| | పండించబడిన ఎకరాలు | పండిన పంట టన్నుల్లో | పండించబడిన ఎకరాలు | పండిన పంట టన్నుల్లో | పండించబడిన ఎకరాలు | పండిన పంట టన్నుల్లో |
| 1. శ్రీకాకుళం<br>2. విశాఖ | 1,72,000 | 58,770 | 1,07,400 | 66,870 | 9,910 | 2,240 |
| 3. తూర్పుగోదావరి | 45,200 | 10,790 | 15,300 | 4,910 | 3,300 | 900 |
| 4. పశ్చిమగోదావరి | 7,800 | 1,870 | 4,600 | 1,470 | 570 | 160 |
| 5. కృష్ణా | 14,900 | 3,580 | 3,540 | 1,110 | 970 | 260 |
| 6. గుంటూరు | 1,81,000 | 44,400 | 14,100 | 7,350 | 70,900 | 16,520 |
| 7. కర్నూలు | 66,600 | 16,600 | 20,200 | 10,360 | 4,21,000 | 56,290 |
| 8. అనంతపురం | 1,75,000 | 21,670 | 94,100 | 44,340 | 3,43,000 | 36,680 |
| 9. కడప | 98,900 | 27,710 | 55,700 | 31,240 | 1,08,000 | 13,740 |
| 10. నెల్లూరు | 1,13,000 | 21,090 | 90,200 | 49,720 | 32,300 | 7,570 |
| 11. చిత్తూరు | 1,28,000 | 26,780 | 1,37,000 | 47,780 | 2,020 | 380 |
| 12. బళ్ళారి (మొత్తం) | 1,48,000 | 23,690 | 24,100 | 5,000 | 5,28,000 | 32,950 |
| మొత్తం | 11,50,400 | 2,56,950 | 5,66,240 | 2,70,150 | 15,19,970 | 1,87,690 |

# ఆహార పంటల వివరాలు (3)

| జిల్లా | వరిగ (8) | | మొత్తము ఆహార ధాన్యాలు (9) | శనగలు (10) | | పెసలు (11) | |
|---|---|---|---|---|---|---|---|
| | పండించబడిన ఎకరాలు | పండిన పంట టన్నుల్లో | | పండించబడిన ఎకరాలు | పండిన పంట టన్నుల్లో | పండించబడిన ఎకరాలు | పండినపంట టన్నుల్లో |
| 1. శ్రీకాకుళం } 2. విశాఖ } | 10,000 | 2,530 | 12,06,010 | 1,740 | 300 | 1,20,000 | 10,780 |
| 3. తూర్పుగోదావరి | 2,210 | 660 | 8,50,190 | 4,330 | 1,250 | 43,900 | 4,550 |
| 4. పశ్చిమగోదావరి | 1,910 | 570 | 8,08,030 | 3,820 | 730 | 2,780 | 270 |
| 5. కృష్ణా | 3,420 | 990 | 9,17,890 | 4,100 | 810 | 50,200 | 5,210 |
| 6. గుంటూరు | 14,500 | 3,580 | 14,99,260 | 9,940 | 1,910 | 51,700 | 4,110 |
| 7. కర్నూలు | 1,01,000 | 19,020 | 13,09,510 | 35,400 | 7,260 | 7,060 | 8,010 |
| 8. అనంతపురం | 40,100 | 6,550 | 11,35,480 | 11,700 | 1,980 | 7,140 | 270 |
| 9. కడప | 33,900 | 6,810 | 6,97,460 | 6,070 | 1,090 | 4,640 | 410 |
| 10. నెల్లూరు | 1,19,000 | 24,330 | 11,34,900 | 490 | 80 | 21,800 | 2,030 |
| 11. చిత్తూరు | 13,700 | 2,840 | 5,35,120 | 20 | 10 | 580 | 40 |
| 12. బళ్లారి (మొత్తం) | 650 | 110 | 15,512 | 12,700 | 2,420 | 20,000 | 810 |
| మొత్తం | 3,40,390 | 67,990 | 1,01,09,362 | 90,310 | 17,840 | 3,29,800 | 36,490 |

## ఆహారపంటల వివరాలు (4)

| జిల్లా | కందులు (12) | | మినుములు (13) | | ఉలవలు (14) | |
|---|---|---|---|---|---|---|
| | పండించబడిన ఎకరాలు | పండినపంట టన్నుల్లో | పండించబడిన ఎకరాలు | పండినపంట టన్నుల్లో | పండించబడిన ఎకరాలు | పండిన పంట టన్నుల్లో |
| 1. శ్రీకాకుళం } 2. విశాఖ } | 16,700 | 2,050 | 21,400 | 2,020 | 1,27,000 | 9,220 |
| 3. తూర్పుగోదావరి | 9,910 | 1,240 | 36,300 | 3,620 | 66,800 | 5,920 |
| 4. పశ్చిమగోదావరి | 6,640 | 920 | 3,270 | 340 | 56,400 | 4,530 |
| 5. కృష్ణా | 5,970 | 930 | 33,400 | 4,910 | 30,100 | 2,330 |
| 6. గుంటూరు | 23,400 | 2,990 | 34,700 | 4,180 | 31,600 | 12,430 |
| 7. కర్నూలు | 36,400 | 3,440 | 3,080 | 460 | 75,200 | 5,900 |
| 8. అనంతపురం | 55,000 | 4,480 | 100 | 10 | 2,20,000 | 14,290 |
| 9. కడప | 8,150 | 870 | 190 | 20 | 41,900 | 2,640 |
| 10. నెల్లూరు | 4,360 | 320 | 1,720 | 140 | 83,300 | 5,480 |
| 11. చిత్తూరు | 5,520 | 890 | 420 | 40 | 26,800 | 1,580 |
| 12. బళ్ళారి (మొత్తం) | 33,800 | 2,410 | 360 | 20 | 93,000 | 6,850 |
| మొత్తం | 2,05,850 | 20,540 | 1,34,940 | 15,760 | 8,52,700 | 70,270 |

## ఆహారపంటల వివరాలు (5)

| జిల్లా | ఇతర పప్పుధాన్యాలు (15) | | మొత్తం పప్పుధాన్యాలు (16) | | పండ్లు, కూరగాయలు (17) | ఆహార పదార్థాలు (18) |
|---|---|---|---|---|---|---|
| | పండించబడిన ఎకరాలు | పండిన పంట టన్నుల్లో | పండించబడిన ఎకరాలు | పండిన పంట టన్నుల్లో | పండించబడిన ఎకరాలు | పండించబడిన ఎకరాలు మొత్తం |
| 1. శ్రీకాకుళం<br>2. విశాఖ | 18,970 | ... | 3,05,810 | ... | 50,050 | 16,01,690 |
| 3. తూర్పుగోదావరి | 3,240 | ... | 1,64,480 | ... | 44,360 | 10,75,050 |
| 4. పశ్చిమగోదావరి | 4,350 | ... | 77,260 | ... | 24,940 | 9,18,830 |
| 5. కృష్ణా | 13,870 | ... | 1,37,640 | ... | 19,900 | 10,81,240 |
| 6. గుంటూరు | 6,020 | ... | 1,57,360 | ... | 10,090 | 16,72,390 |
| 7. కర్నూలు | 4,790 | ... | 1,61,930 | ... | 7,840 | 14,80,530 |
| 8. అనంతపురం | 4,380 | ... | 2,98,320 | ... | 9,820 | 14,56,090 |
| 9. కడప | 840 | ... | 61,790 | ... | 31,710 | 7,93,550 |
| 10. నెల్లూరు | 7,730 | ... | 1,19,900 | ... | 9,110 | 12,65,830 |
| 11. చిత్తూరు | 2,960 | ... | 36,300 | ... | 30,580 | 6,21,050 |
| 12. బళ్లారి (మొత్తం) | 21,130 | ... | 1,80,990 | ... | 6,290 | 16,21,120 |
| మొత్తం | 88,280 | | 17,01,780 | | 2,44,690 | 1,35,89,370 |

— Source : Season and crop report of the Madras state 1950 - '51 లో ఇవ్వబడిన అంచనాల ఆధారంతో ఈపట్టీ తయారు చేయబడింది.

# వ్యాపార పంటలు

భారతదేశ వ్యాపార పంటల ఉత్పత్తిలో ఆంధ్రదేశం ప్రముఖ స్థానాన్ని వహిస్తున్నది. ఏటా సుమారు 47,45,130 ఎకరాలలో వ్యాపార పంటలు పండించ బడుతున్నాయి. వేరుశెనగ, పత్తి, పొగాకు, మిర్చి, నువ్వులు, పసుపు, ఉల్లిపాయలు మొదలయినవి మన ప్రధాన వ్యాపార పంటలు. ఈ పంటల సంవత్సర సగటు విలువ రు. 11,69,55,000 లని అంచనా వేయబడుతున్నది.

భారతదేశంలో పొగాకు, నూనెగింజలు పండించటంలో ఆంధ్రరాష్ట్రం వరుసగా ప్రథమ ద్వితీయ స్థానాల నాక్రమిస్తున్నది.

ఏటా పొగాకు 2,78 వేల ఎకరాలలో, 92,780 టన్నులు పండించబడు తున్నది. మొత్తం రాష్ట్రపు ఉత్పత్తిలో మూడింట రెండుపాళ్ళు, ఒక్క గుంటూరు జిల్లాలోనే పండించబడుతున్నది. తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, కర్నూలు జిల్లాలలోకూడా పొగాకు పెద్దఎత్తున పండించబడుతున్నది.

1949-50 లెక్కల ప్రకారం, ఆంధ్రదేశంలో 1,33 వేల ఎకరాలలో 10,40 లక్షల పౌనుల వర్జీనియా పొగాకు పండించబడినది. ఇది భారతదేశ ఉత్పత్తిలో నూటికి 90 పాళ్ళు.

1949-'50 సంవత్సరంలో కొన్ని ముఖ్యజిల్లాలు పండించిన వర్జీనియా పొగాకుపంట ఈ విధంగా వుంది.

| జిల్లా | | పంట పండించబడిన భూమి (ఎకరాల్లో) | ఉత్పత్తి టన్నులలో |
|---|---|---|---|
| గుంటూరు | ... | 83,518 | 23,770 |
| కృష్ణా | ... | 15,652 | 4,450 |
| పశ్చిమ గోదావరి | ... | 19,244 | 5,480 |
| తూర్పు గోదావరి | ... | 12,201 | 2,860 |
| | మొత్తం | 1,30,615 | 36,560 |
| మొత్తం మదరాసు రాజధాని : | | 1,32,703 | 37,140 |

(Commercial Directory 1952 — P. 181)

వివిధ జిల్లాలలో 1949-'50 లో వర్జీనియా మినహా, మిగతా పొగాకు పంట వివరాలు :

| జిల్లా | | పండించబడిన పొలం (ఎకరాల్లో) | పండించిన పంట (టన్నులలో) |
|---|---|---|---|
| గుంటూరు | ... | 1,01,986 | 38,700 |
| పశ్చిమ గోదావరి | ... | 12,625 | 4,790 |
| తూర్పు గోదావరి | ... | 19,162 | 5,990 |
| విశాఖపట్నం | ... | 9,436 | 3,160 |
| కర్నూలు | ... | 9,911 | 2,590 |
| | | 1,53,120 | 55,230 |
| మొత్తం మదరాసు రాజధాని : | | 2,12,641 | 1,23,830 |

(Commercial Directory 1952—P. 181.)

ఎగుమతి చేయబడుతున్నది. మన రాష్ట్రంలో, పెద్ద ఎత్తున సిగరెట్టు పొగాకు (వర్జీనియా) పండించబడుతున్నా సిగరెట్ పరిశ్రమ ఏ మాత్రమూ లేకపోవడం గమనించవలసిన విషయం.

1947-'48 సంవత్సరంలో రు 455లక్షల విలువచేసే 4,35 లక్షల పౌనులు, 1948 - '49 సంవత్సరంలో రు. 521 లక్షలు విలువచేసే 4,31 లక్షల పౌనులు, 1949 - '50 సంవత్సరంలో రు. 975 లక్షలు విలువచేసే 7,23 లక్షల పౌనుల పొగాకు విదేశాలకు ఎగుమతి చేయబడింది.

దేశాలవారీగా మన ఎగుమతులు ఈ క్రింది విధంగా ఉన్నాయి:

| దేశం | | 1947 - '48 (విలువ లక్షల రూ. లలో) | 1948 - '49 (విలువ లక్షల రూల. లో) | 1949 - '50 (విలువ లక్షల రూ. లలో) |
|---|---|---|---|---|
| ఇంగ్లండు | ... | 273.64 | 369.27 | 752.03 |
| సోవియట్ | ... | 25.14 | — | 8.24 |
| నెదర్లాండ్సు | ... | 46.65 | 19.54 | 26.05 |
| బెల్జియం | ... | 35.53 | 29.20 | 18.34 |
| ఈజిప్టు | ... | 17.32 | 36.55 | 26.28 |
| స్వీడన్ | ... | ? .5 | 25.75 | 20.62 |

Source: Commercial directory 1952—P. 102

1946-'47 సంవత్సరంలో సోవియట్ యూనియనుకు ఇంగ్లండుకు పంపి నంత సరుకు (పరిమాణంలో) ఎగుమతి చేయబడింది.

1949-'50 సంవత్సరంలో గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరులలో 8,100 టన్నుల పొగనూనె ఉత్పత్తి చేయబడింది. దీనిని వర్జీనియా పొగాకు గింజల నుండి తీస్తారు (ఈ నూనె రంగులు, తినుబండారాల తయారీకి ఉపయోగపడుతుంది). రాష్ట్రంలో ఉత్పత్తి చేయబడిన నూనె అంతా విదేశాలకు ఎగుమతి చేయబడింది.

పత్తి :

1950-'51 లెక్కల ప్రకారం ఆంధ్రదేశంలో, పత్తిపంట సుమారు 5 లక్షల ఎకరాలలో 64,300 బేళ్ళు పండించబడింది. రాష్ట్రపు మొత్తము ఉత్పత్తిలో దాదాపు 3 వ వంతు బళ్ళారి జిల్లాలోని మూడు తెలుగు తాలూకాలు, మూడింట రెండువంతులు కర్నూలు, అనంతపురం, బళ్లారిలోని మూడు తెలుగు తాలూకాలు పండిస్తున్నాయి.

రాయలసీమ జిల్లాలలో పండించబడుతున్న పత్తిలో అత్యధిక భాగం, పొట్టి పింజపత్తి (Short staple cotton) రాయలసీమలోని నల్ల రేగడిభూములు పత్తికి అత్యుత్తమమైనవైనా, పొడవు పింజ పత్తి (Long staple cotton) సేద్య సదుపాయాలు లేనందున ఉత్పత్తి చేయలేకపోవడం జరుగుతున్నది.

మన రాష్ట్రంలో 22,51 వేల ఎకరాలలో, 8,92 వేల టన్నుల వేరుశనగ పండించబడుచున్నది. భారతదేశంలో, వేరుశనగ ఎక్కువగా ఉత్పత్తి చేసే రాష్ట్రాలలో ఆంధ్ర రెండవది.

కర్నూలు, అనంతపురం జిల్లాలు రాష్ట్రపు మొత్తం పంటలో 3వ వంతుకు పైగా పండించుచున్నవి. కడప, చిత్తూరు, బళ్ళారి, గుంటూరు ఈ పంటను పండించే ఇతర ముఖ్య జిల్లాలు.

వేరుశనగ పంటలో సుమారు సగభాగం, రాష్ట్రంలోని వివిధఫ్యాక్టరీలలో వనస్పతి నేయి (డాల్డా) చేయుటకు ఉపయోగించబడుతున్నది. నూనె తీయగా మిగిలిన వేరుశనగ పిట్టు పొలములకు ఎరువుగా ఉపయోగించబడుతున్నది.

3,31 వేల ఎకరాలలో 40 వేల టన్నుల నువ్వులు పండించబడుతున్నవి. ఇందులో తూర్పు, పశ్చిమ గోదావరి, శ్రీకాకుళం, విశాఖ జిల్లాలలో రాష్ట్రి ఉత్పత్తిలో నూటికి 75 పాళ్ళు పండించబడుతున్నది.

మిర్చి సుమారు 2,20 వేల ఎకరాలలో 87 వేల టన్నులు పండించ బడుతున్నది. గుంటూరుజిల్లా ఒక్కటే, దాదాపు మొత్తం పంటలో 4 వ వంతు పండించుతున్నది. తూర్పుగోదావరి, కర్నూలు, అనంతపురం, గుంటూరు జిల్లాలు ఇతర ప్రధాన ఉత్పత్తి ప్రాంతాలు.

# ఆంధ్రరాష్ట్రం

## ఆహారేతర పంటలు

బళ్ళారిజిల్లా సంఖ్యలు మొత్తం యివ్వబడ్డాయి.
శ్రీకాకుళం-విశాఖ జిల్లాల సంఖ్యలు మొత్తం కలిపి యివ్వబడ్డాయి.




సూచిక

పంచదార ఫ్యాక్టరీలు

—ప్రత్తి (వేల బేళ్ళలో)

చెరకు (వేల ఎకరాలలో)

—పొగాకు (వేల టన్నులలో)

వేరుశనగ (వేల టన్నులలో)
(జిల్లాఉత్పత్తి పంటగుర్తుక్రింద సంఖ్యలో యివ్వబడ్డాయి.)

పసుపు పంట మన రాష్ట్రంలో, సుమారు 22 వేల ఎకరాలలో పండించ బడుతున్నది. ఒక్క గుంటూరుజిల్లా మొత్తం రాష్ట్ర ఉత్పత్తిలో 3 వ వంతుకు పైగా పండిస్తున్నది. దీనికి నీరు సమృద్ధిగా వుండాలి. అందుచేతనే కృష్ణా, గోదావరి డెల్టా ప్రాంతాలలోను, కడప జిల్లాలో కర్నూలు – కడప కాలువకిందను పండించ బడుతున్నది. పంటలో చాలభాగం, పాకిస్థాన్‌కు ఎగుమతి చేయబడుతున్నది. గుంటూరు జిల్లాలోని దుగ్గిరాల ప్రధాన పసుపు వ్యాపార కేంద్రము.

మన రాష్ట్రంలో, 1,34 వేల టన్నుల ఉల్లిపాయలు పండించ బడుతున్నాయి. కర్నూలు, కడప, గుంటూరు, పశ్చిమగోదావరి, శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలలో ఈ పంట యెక్కువ.

సుమారు లక్షా పదిహేడు వేల ఎకరాలలో, చెరకు పండించబడుతున్నది. ఇందులో సుమారు మూడవ వంతు ఒక్క విశాఖజిల్లాలోనే పండించబడుతున్నది.

శ్రీకాకుళం, తూర్పు గోదావరి, చిత్తూరు, కృష్ణా, పశ్చిమగోదావరి, అనంతపురం చెరకు పండించే యితర ప్రధాన జిల్లాలు.

శ్రీకాకుళం, విశాఖజిల్లాలలో జనపనార పంట అభివృద్ధి చేయబడుతున్నది. శ్రీకాకుళం జిల్లాలోను, విశాఖజిల్లాలోని కొన్ని తాలూకాలలోనూ జనపనార విరివిగా పండించబడుతున్నది.

విశాఖజిల్లాలోని నెల్లిమర్ల, చిట్టివలస జూట్‌మిల్లుల అవసరాలకు యీ పంట సరిపోవుటయే గాక కలకత్తాకు విరివిగా ఎగుమతి చేయబడుతున్నది. విశాఖ, శ్రీకాకుళం జిల్లాలకు ఉండే సమృద్ధి అయిన వర్షాలదృష్ట్యా తగిన ప్రోత్సాహ మిచ్చిన, యీ పంట విరివిగా అభివృద్ధిచెందే సూచనలు ఉన్నాయి.

శ్రీకాకుళం జిల్లాలో జీడితోటలు విరివిగా పెంచబడి, జీడిపప్పును వ్యాపా రపుపంటగా పరిగణించడం జరుగుతున్నది. ఉద్దానం దీనికి కేంద్రం. పలాసా పప్పు బట్టీలకు కేంద్రం. ఇచ్ఛాపురం నుంచి జీడిపప్పు ప్రధానంగా ఉత్తరరాష్ట్రాలకు ఎగుమతి చేయబడుతున్నది.

| జిల్లా (1) | ప్రత్తి | | వేరుశనగ | | నువ్వులు | | పొగాకు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | పండించబడిన ఎకరాలు (2) | పండినపంట బేళ్ళల్లో (3) | పండించబడిన ఎకరాలు (4) | పండినపంట టన్నుల్లో (5) | పండించబడిన ఎకరాలు (6) | పండినపంట టన్నుల్లో (7) | పండించబడిన ఎకరాలు (8) | పండినపంట టన్నుల్లో (9) |
| శ్రీకాకుళం } | 4,320 | 380 } | 2,28,000 | 95,510 | 1,07,000 | 14,310 | 16,300 | 5,370 |
| విశాఖపట్నం } | | 190 } | | | | | | |
| తూర్పుగోదావరి | 3,220 | 570 | 5,250 | 2,380 | 74,040 | 9,810 | 24,400 | 7,320 |
| పశ్చిమగోదావరి | 190 | 30 | 25,900 | 11,080 | 67,900 | 9,270 | 26,500 | 8,520 |
| కృష్ణా | 1,010 | 160 | 1,45,000 | 61,760 | 6,400 | 850 | 19,500 | 6,290 |
| గుంటూరు | 40,330 | 6,890 | 2,03,000 | 83,580 | 2,580 | 300 | 1,71,000 | 58,100 |
| కర్నూలు | 1,13,40 | 13,740 | 4,51,000 | 1,88,060 | 1,330 | 110 | 11,600 | 3,090 |
| అనంతపురం | 96,320 | 10,390 | 4,13,000 | 1,48,530 | 35,200 | 2,420 | 3,070 | 950 |
| కడప | 33,140 | 3,740 | 2,14,000 | 79,210 | 5,070 | 270 | 1,340 | 850 |
| నెల్లూరు | 27,090 | 4,340 | 14,500 | 5,830 | 9,580 | 1,010 | 2,280 | 1,100 |
| చిత్తూరు | 20 | 10 | 1,94,000 | 77,820 | 4,280 | 400 | 340 | 130 |
| బళ్లారి (3 తాలూకాలు) | *2,07,288 | 23,890 | 3,58,000 | 1,38,770 | 17,700 | 1,410 | 2,340 | 560 |
| మొత్తం | 5,26,568 | 64,330 | 22,51,650 | 8,92,530 | 3,31,080 | 40,160 | 2,78,670 | 92,780 |

*బళ్లారిజిల్లా 1950-'51 ప్రత్తి ఉత్పత్తి, విస్తీర్ణం లెఖ్ఖలను 1940-'41 తాలూకావారీ ఉత్పత్తిదామాషాతో మూడు తెలుగు తాలూకాలకు లెఖ్ఖగట్టి యివ్వబడ్డది.

| జిల్లా | మిరప | | పసుపు | | ఉల్లిపాయలు పంట టన్నుల్లో (14) | చెరకు పండించబడిన ఎకరాలు (15) | మొత్తం ఆహారేతర పంటలు పండించబడిన ఎకరాలు (16) |
|---|---|---|---|---|---|---|---|
| | పండించబడిన ఎకరాలు (10) | పండినపంట టన్నుల్లో (11) | పండించబడిన ఎకరాలు (12) | పండినపంట టన్నుల్లో (13) | | | |
| శ్రీకాకుళం } విశాఖపట్నం | 13,060 | 9,670 | 890 | ... | 24,710 | 19,766 | 4,28,790 |
| | | | | | | 38,417 | |
| తూర్పుగోదావరి | 22,200 | 10,050 | 2,150 | ... | 11,850 | 17,651 | 2,36,320 |
| పశ్చిమగోదావరి | 12,200 | 3,480 | 2,190 | ... | 15,430 | 6,031 | 1,77,510 |
| కృష్ణా | 13,600 | 6,420 | 3,450 | ... | 2,100 | 5,896 | 2,96,080 |
| గుంటూరు | 72,500 | 20,770 | 8,600 | ... | 18,570 | 298 | 7,38,400 |
| కర్నూలు | 35,000 | 11,450 | 540 | ... | 11,030 | 297 | 6,61,800 |
| అనంతపురం | 12,400 | 8,970 | 90 | ... | 13,740 | 8,972 | 6,42,520 |
| కడప | 6,280 | 4,250 | 4,090 | ... | 24,800 | 825 | 2,88,650 |
| నెల్లూరు | 12,100 | 4,340 | 250 | ... | 770 | 91 | 1,61,010 |
| చిత్తూరు | 5,930 | 1,570 | 110 | ... | 1,550 | 15,695 | 2,22,680 |
| బళ్లారి (3తాలు) | 15,100 | 6,150 | 10 | ... | 10,040 | 3,597 | 8,91,390 |
| మొత్తం | 2,20,310 | 87,120 | 22,370 | ... | 1,34,590 | 1,17,536 | 47,45,150 |

Source : Season and Crop report of the Madras state 1950-'51 లోని అంచనాల ఆధారంతో [illegible].

# పశుసంపద

పశువుల సంఖ్యలో ఆంధ్ర దేశము, భారత దేశంలో ప్రధాన స్థానాన్ని వహిస్తున్నది. 2,35,85,478 పశువులు 1950-'51 సంవత్సరంలో ఉన్నట్లు ప్రభుత్వ లెక్కలు తెలియ చేస్తున్నాయి. మన పశువులు సంఖ్యలో హెచ్చయినా - ఒక్క ఒంగోలు జాతి మినహా - నాణ్యంలో హీనమైనవి.

మన ఒంగోలుజాతి పశువులు, భారత దేశంలోని వివిధ పశు జాతులకు తలమానికమువంటివి. భారత దేశములోని వివిధ రాష్ట్రాలేగాక, విదేశాలవారుకూడా మన ఒంగోలు జాతి పశువులను కొనిపోయి, వీటి సంతతిని అభివృద్ధి చేస్తున్నారు.

మొత్తం మదరాసు రాజధానిలోని పశు సంతతిలో, ఆంధ్ర పశు సంతతి 35.41% ఉన్నది. ఆంధ్ర రాష్ట్రంలో సాగుచేయబడే ప్రతి వంద ఎకరాలకు 39.7 ఎద్దులు - ఆవులు ఉన్నాయి. బొంబాయి రాష్ట్రంలో సాగుచేయబడే ప్రతి వంద ఎకరాలకు 25 ఎద్దులు-ఆవులు; అవిభాజ్య పంజాబులో 33 వుండేవి.

మొత్తం మదరాసు రాష్ట్రంలో ఉత్పత్తి అయ్యే వెన్న, పాలు, మీగడ మొదలైనవాటి (Dairy products) ఉత్పత్తిలో సగానికిపైగా ఆంధ్రదేశం ఉత్పత్తి చేస్తూన్నది.

ప్రక్కపేజీలోని పట్టిక పరిశీలించినట్లయితే భారతదేశ పశువులఉత్పత్తిశక్తి చాలాహీనంగా ఉన్నదని స్పష్టమవుతుంది. కాని యీ లోపం మన పశుజాతిదికాదు. మన ఒంగోలు జాతిపశువులు నేటికీ అమెరికా, బ్రిటన్ మున్నగు దేశాలలో ఆదర్శ జాతి పశువులుగా పెంచబడుతున్నాయి. కాని యిట్టి అగ్రజాతి పశువులకు పుట్టినిల్లయిన ఆంధ్రభూమిలో రైతాంగం బక్కచిక్కి పశువుల పోషణపై దృష్టిచూపే పరిస్థితి లేకుండా పోయింది. రైతుకే డొక్కాడడం సమస్యగా ఉంది. కనుక రైతువలే పశుసంతతికూడ క్రమంగా నీరసించ ప్రారంభించింది.

సుమారు 77 లక్షల కోడెలు – ఆవులు (cattle) 1950 – '51 సంవత్సరంలో ఆంధ్ర దేశంలో వున్నాయి. చిత్తూరు జిల్లాలోనే 10.83 లక్షల కోడెలు – ఆవులు వున్నాయి.

| దేశం | | ఒక్క ఈతకాలంలో ఇచ్చే పాలు (పౌనులలో) |
|---|---|---|
| నెదర్‌లాండ్సు | ... | 5,559 |
| డెన్మార్కు | ... | 7,005 |
| ఇంగ్లండు | ... | 5,576 |
| జపాన్ | ... | 5,857 |
| ఆస్ట్రేలియా | ... | 3,463 |
| ఇండియా | ... | 753 |

50 లక్షల బర్రెలు, 1,27 లక్షల దున్నపోతులు మన రాష్ట్రంలో వున్నాయి. నెల్లూరు, గుంటూరు, చిత్తూరు జిల్లాలలో, జిల్లాకు 13 లక్షలకు పైబడి దున్నపోతులున్నాయి. గుంటూరు, నెల్లూరు, కృష్ణా జిల్లాల్లో అధిక సంఖ్యలో బర్రెలున్నాయి.

రాష్ట్రంలో 71 లక్షల గొర్రెలు, 29 లక్షల మేకలు వున్నాయి. ఇందులో అత్యధిక భాగం చిత్తూరు, నెల్లూరు, అనంతపురం, గుంటూరు జిల్లాల్లో వున్నాయి. ఆంధ్ర దేశంలో, సాగు చేయబడే ప్రతి వంద ఎకరాలకు సగటున 16.2 మేకలున్నట్లు అంచనా వేయబడింది.

78లక్షలకోళ్లు, 2,67వేల బాతులు మనరాష్ట్రంలో 1950–'51 సం॥రంలో పెంచబడుతున్నట్లు అంచనా వేయబడింది. కోళ్ళ పెంపకం విశాఖ, చిత్తూరు జిల్లాల్లో అత్యధికంగా జరుగుతున్నది. తూర్పు గోదావరి, గుంటూరు, నెల్లూరు జిల్లాలుకూడ ముఖ్యమైన కోళ్ళ పెంపకపు కేంద్రాలు. బాతుల పెంపకంలో పశ్చిమ గోదావరిజిల్లా ప్రథమస్థానాన్ని వహిస్తున్నది. శ్రీకాకుళం, విశాఖ, తూర్పు గోదావరి, కృష్ణా, నెల్లూరు జిల్లాలలో విరివిగా బాతులు పెంచబడుతున్నాయి.

---

నోటు : జిల్లావారీ వివరాలకు ప్రక్కపేజీ చూడండి.

# ఆంధ్రరాష్ట్రం

## పశుసంపద

బళ్ళారిజిల్లా మొత్తం వివరాలు యివ్వబడ్డాయి.




హైదరాబాద్
బళ్ళారి
కర్నూలు
అనంతపురం
కడప
నెల్లూరు
చిత్తూరు
మైసూరు
మద్రాసు
గుంటూరు
కృష్ణా
ప.గోదావరి
తూ.గోదావరి
మధ్యప్రదేశ్
ఒరిస్సా
బంగాళాఖాతం

### సూచిక

కోడెలు - ఆవులు

గేదెలు - దున్నలు

కోళ్ళు

పశువుల ఆసుపత్రి

పశువుల పరిశోధనా కేంద్రం

(జిల్లాలలోని పశువుల సంఖ్య ఆ మార్కు క్రింద లక్షలలో యివ్వబడింది.)

# ఆంధ్రదేశ పశు సంపద 1951-'52 (1)

| జిల్లా (1) | | కోడెలు-ఆవులు (2) | బర్రెలు (3) | దున్నపోతులు (4) | గొర్రెలు (5) | మేకలు (6) | గుర్రాలు (7) |
|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం ... | 7,97,588 | 4,15,385 | 12,12,973 | 5,55,220 | 2,33,766 | 3,962 |
| 2. | విశాఖపట్నం ... | 5,57,320 | 3,70,638 | 9,27,958 | 3,70,98[illegible] | 2,77,644 | 3,92[illegible] |
| 3. | తూర్పుగోదావరి ... | 7,82,042 | 4,26,479 | 12,08,521 | 1,17,447 | 1,57,875 | 6,30[illegible] |
| 4. | పశ్చిమగోదావరి ... | 6,16,279 | 4,48,722 | 10,65,001 | 1,63,5[illegible] | 1,21,166 | 5,106 |
| 5. | కృష్ణా ... | 5,48,118 | 6,23,209 | 11,71,397 | 2,72,634 | 1,46,034 | 3,530 |
| 6. | గుంటూరు ... | 5,45,594 | 7,89,046 | 13,34,640 | 7,09,351 | 2,18,656 | 4,9[illegible] |
| 7. | కర్నూలు ... | 4,47,398 | 3,55,216 | 8,02,614 | 6,57,205 | 2,60,531 | 4,395 |
| 8. | అనంతపురం ... | 6,44,315 | 2,24,293 | 8,68,608 | 11,67,787 | 3,30,074 | 2,84[illegible] |
| 9. | కడప ... | 4,07,762 | 3,69,366 | 7,77,128 | 7,07,761 | 2,50,806 | 2,26[illegible] |
| 10. | నెల్లూరు ... | 7,52,768 | 6,02,038 | 13,54,806 | 10,25,758 | 3,66,616 | 4,08[illegible] |
| 11. | చిత్తూరు ... | 10,86,903 | 2,41,519 | 13,28,422 | 10,02,797 | 4,22,664 | 716 |
| 12. | బళ్లారి * ... | 5,01,038 | 1,71,855 | 6,72,893 | 3,85,153 | 1,73,816 | 3,13[illegible] |
| | మొత్తం | 76,87,125 | 50,37,766 | 1,27,24,961 | 71,35,681 | 29,68,648 | 45,[illegible] |

* బళ్లారిజిల్లా మొత్తంగా చేర్చబడినది

## ఆంధ్రదేశ పశుసంపద 1951-'52 (2)

| జిల్లా | గాడిదలు (8) | పందులు (9) | పశుసంపద మొత్తం (10) | కోళ్ళు (11) | బాతులు (12) | వీటి మొత్తం (13) |
|---|---|---|---|---|---|---|
| 1. శ్రీకాకుళం | 6,162 | 50,893 | 20,63,019 | 8,75,931 | 40,190 | 9,16,121 |
| 2. విశాఖ | 8,406 | 61,346 | 16,50,281 | 12,42,287 | 36,870 | 12,79,157 |
| 3. తూర్పుగోదావరి | 4,632 | 57,208 | 15,52,132 | 7,06,216 | 35,509 | 7,41,725 |
| 4. పశ్చిమగోదావరి | 1,623 | 64,141 | 14,24,089 | 5,13,799 | 64,983 | 5,78,782 |
| 5. కృష్ణా | 2,165 | 63,074 | 16,58,898 | 6,45,581 | 36,381 | 6,81,962 |
| 6. గుంటూరు | 5,361 | 1,16,648 | 23,89,603 | 7,34,760 | 12,895 | 7,47,655 |
| 7. కర్నూలు | 20,196 | 25,064 | 17,76,019 | 3,57,703 | 2,550 | 3,60,250 |
| 8. అనంతపురం | 23,243 | 26,359 | 24,18,914 | 4,06,017 | 2,757 | 4,08,774 |
| 9. కడప | 20,842 | 19,436 | 17,78,235 | 5,78,761 | 4,045 | 5,82,806 |
| 10. నెల్లూరు | 12,309 | 40,372 | 28,03,976 | 7,70,613 | 25,459 | 7,97,072 |
| 11. చిత్తూరు | 9,584 | 49,580 | 28,13,769 | 9,20,371 | 5,341 | 9,25,712 |
| 12. బళ్ళారి* | 9,952 | 11,552 | 12,56,543 | 1,20,212 | 548 | 1,20,760 |
| మొత్తం | 1,24,482 | 5,85,765 | 2,35,85,478 | 78,72,251 | 2,67,528 | 81,40,776 |

Source : Season and crop report of the Madras state (1950-51) P. 86-87

* బళ్ళారి జిల్లా మొత్తంగా చేర్చబడ్డది.

## అడవులు

ఆంధ్రదేశంలో 1947-'48 సంవత్సర లెక్కలప్రకారం, 72,49 వేల ఎకరాలు అడవులక్రింద ఉన్నవి. మొత్తం ఆంధ్రదేశ వైశాల్యంలో అడవులున్న విస్తీర్ణం 18.29%. 1950-'51 సంవత్సరంలో ప్రభుత్వ లెక్కల ప్రకారం అడవుల వైశాల్యం 82,92,916 ఎకరాలు. ఇందులో 66,23 వేల ఎకరాలు ప్రభుత్వాధీనంలో ఉన్న రిజర్వు ఫారెస్టు.

రాష్ట్రంలో వివిధ ఫారెస్టు డివిజన్లక్రింద ఉన్న రిజర్వు ఫారెస్టు ఈ విధంగా ఉంది :

రిజర్వు అడవులు : డివిజన్‌వారీ వైశాల్యం. (1950-51)

| డివిజన్ | | వైశాల్యం చదరపు మైళ్ళలో |
|---|---|---|
| 1. విశాఖపట్నం | ... | 581 |
| 2. ఎగువ గోదావరి | ... | 886 |
| 3. దిగువ గోదావరి | ... | 612 |
| 4. గుంటూరు | ... | 1,164 |
| 5. తూర్పు కర్నూలు | ... | 1,072 |
| 6. పశ్చిమ కర్నూలు | ... | 876 |
| 7. అనంతపురం | ... | 905 |
| 8. బళ్లారి | ... | 951 |
| 9. చిత్తూరు | ... | 781 |
| 10. ఉత్తరకడప | ... | 867 |
| 11. దక్షిణకడప | ... | 930 |
| 12. నెల్లూరు | ... | 729 |
| | మొత్తం | 10,357 |

—1951 సంవత్సరం "ఫారెస్టు శాఖ నిర్వహణ రిపోర్టు" నుండి-32-33 పేజీలు

ఏజన్సీ (మన్యం), నల్లమల అడవులు మన ప్రధాన అటవీప్రాంతాలు. ఉభయవిశాఖలు, ఉభయ గోదావరి జిల్లాలలో ఏజన్సీ (మన్యం) అడవులు, కర్నూలు కడప ప్రాంతాలలో నల్లమల అడవులు ప్రధాన భాగాలుగా ఉన్నాయి.

ప్రభుత్వం మన అడవుల అభివృద్ధికి నిర్మాణాత్మక చర్యలు తీసుకోక పోయినా, ప్రభుత్వానికి ప్రతి సంవత్సరం, ఫారెస్టు డిపార్టుమెంటు ఖర్చులుపోను రు. 25 లక్షల పైబడి ఆదాయం వస్తున్నది. డివిజన్‌వారీ 1950-'51 సంవత్సరపు ఆదాయ వ్యయాలు, ఫారెస్టుశాఖ అడ్మినిస్ట్రేషన్ రిపోర్టు లెక్కలప్రకారం ఇలా ఉన్నాయి:

| డివిజన్ | ఆదాయం (రూపాయల్లో) | వ్యయం (రూపాయల్లో) |
|---|---|---|
| విశాఖపట్నం ... | 2,98,595 | 1,30,084 |
| ఎగువ గోదావరి ... | 5,43,099 | 1,52,897 |
| దిగువ గోదావరి ... | 8,34,235 | 1,77,199 |
| గుంటూరు ... | 2,99,185 | 2,05,026 |
| తూర్పు కర్నూలు ... | 2,50,453 | 1,50,971 |
| పశ్చిమ కర్నూలు ... | 7,91,254 | 1,59,707 |
| అనంతపురం ... | 2,93,055 | 1,73,205 |
| బళ్ళారి ... | 2,03,789 | 1,88,241 |
| చిత్తూరు ... | 2,27,967 | 1,74,424 |
| ఉత్తర కడప ... | 2,07,673 | 1,42,421 |
| దక్షిణ కడప ... | 3,87,166 | 1,57,426 |
| నెల్లూరు ... | 5,71,965 | 3,97,911 |
| మొత్తం | 49,08,436 | 22,09,512 |

నోటు:—ఈ ఆదాయంలో, ఒక్క అటవీ సంపద అమ్మకం మూలంగా వచ్చే ఆదాయమేగాక, కేంద్రప్రభుత్వ సబ్సిడీలవంటి కొన్ని మొత్తాలు చేర్చబడినవి. ఖచ్చితంగా అటవీ సంపద అమ్మకంవల్ల 1950-'51 సంవత్సరంలో వచ్చిన ఆదాయం రు. 42,12,249. (1951 సం॥రం ఫారెస్టుశాఖ నిర్వహణ రిపోర్టునుండి 121 పేజీ)

అటవీశాఖకు వచ్చే మొత్తం ఆదాయంలో రు. 17,31 వేలలో, సుమారు సగంభాగం వంట చెరకు, బొగ్గు అమ్మకాలద్వారానే వస్తున్నది. దిగువ గోదావరి, గుంటూరు, ఉత్తరకడప, దక్షిణకడప, నెల్లూరు, చిత్తూరు డివిజన్లు ఈ ఆదాయంలో అధికభాగం తెస్తున్నాయి.

తరువాత అధిక ఆదాయాన్ని తెచ్చేది వెదురు. వెదురు అమ్మకంద్వారా రు. 9,71 వేలు ఆదాయం వస్తున్నది. ఒక్క ఎగువ గోదావరి, దిగువ గోదావరి డివిజన్లే, సుమారు నాలుగు లక్షల రూపాయల ఆదాయాన్ని తెస్తున్నాయి. ఏజన్సీ అడవులు, పశ్చిమ కర్నూలులలోనే వెదురు విస్తారంగా లభిస్తున్నది.

కలప అమ్మకంద్వారా రు. 6,64 వేల ఆదాయం తేయబడుతున్నది. దిగువ గోదావరి, పశ్చిమ కర్నూలు డివిజన్లు రు. 4,70 వేల పైబడిన ఆదాయాన్ని తెస్తున్నాయి.

మన అడవులలో "పెంచబడుతున్న" గంధపు "తోపులే", ఇంత విశాలమైన అటవీభాగం ఉన్నా, వీటి అభివృద్ధికి ఎట్టి శ్రద్ధ తీసికొనబడటం లేదనటానికి, చక్కటి నిదర్శనం. 1950-'51 సంవత్సరంలో గంధపుచెక్క అమ్మకంక్రింద రు 1254 మాత్రమే ఆదాయం వచ్చింది.

మన అడవులపై ప్రభుత్వం ఏ మాత్రం శ్రద్ధ వహించినా, ఇప్పటి ఆదాయాన్ని ఎన్నో రెట్లు పెంచవచ్చును.

నోటు:—జిల్లా వారి వివరాలకు ప్రక్క పేజీలోని పట్టీ చూడండి.

# డివిజన్లవారీ ఆదాయ వివరాలు (1950-'51)

| డివిజన్లు (1) | గంధపుచెక్క అమ్మకం ద్వారా (రూపాయల్లో) (2) | కలప అమ్మకం ద్వారా (రూపాయల్లో) (3) | బొగ్గు, వంటచెరకు అమ్మకం ద్వారా (రూపాయల్లో) (4) | వెదురు అమ్మకం ద్వారా (రూపాయల్లో) (5) | పశువులు మేసినందుకు, పచ్చిక అమ్మకం ద్వారా (రూపాయల్లో) (6) | చిల్లర అమ్మకం ద్వారా (రూపాయల్లో) (7) | దొంగఅమ్మకాల నిరోధం ద్వారా (రూపాయల్లో) (8) | మొత్తం డివిజన్ వారీ ఆదాయం (రూపాయల్లో) (9) |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. విశాపట్టణం | 834 | 16,903 | 46,788 | 1,68,543 | 6,077 | 31,613 | 652 | 2,71,410 |
| 2. ఎగువగోదావరి | 162 | 2,36,360 | 10,328 | 2,04,380 | 4,308 | 68,142 | 4,288 | 5,27,968 |
| 3. దిగువగోదావరి | 20 | 59,497 | 4,96,211 | 2,15,615 | 8,412 | 22,876 | 10,514 | 8,13,145 |
| 4. గుంటూరు | ... | 5,275 | 1,19,316 | 6,054 | 44,336 | 34,679 | 388 | 2,10,048 |
| 5. తూర్పుకర్నూలు | ... | 71,378 | 38,517 | 56,200 | 31,360 | 34,018 | 2,239 | 2,33,712 |
| 6. పశ్చిమకర్నూలు | 72 | 2,48,786 | 1,30,750 | 2,68,719 | 19,341 | 57,380 | 28,327 | 7,53,375 |
| 7. అనంతపురం | 44 | 10 | 9,738 | 1,730 | 21,430 | 73,401 | 430 | 1,06,783 |
| 8. బళ్ళారి* | 113 | 15,765 | 34,709 | 1,829 | 40,450 | 47,683 | 65 | 1,40,614 |
| 9. చిత్తూరు | ... | 6,342 | 1,17,751 | 12,906 | 20,954 | 29,423 | 346 | 1,88,222 |
| 10. ఉత్తర కడప | 7 | ... | 1,21,183 | 15,911 | 26,299 | 5,594 | 1,371 | 1,70,365 |
| 11. దక్షిణ కడప | 2 | 4,438 | 2,33,395 | 18,990 | 17,181 | 85,780 | 1,856 | 3,62,642 |
| 12. నెల్లూరు | ... | 103 | 3,72,437 | ... | 33,226 | 34,194 | 1,714 | 4,31,671 |
| మొత్తం ఆదాయం అయిటంవారీ (రూ||ల్లో) | 1,254 | 6,64,857 | 17,31,123 | 9,71,477 | 2,63,365 | 5,24,783 | 55,390 | 42,12,249 |

Source: Administration Report of the Forest Department of the Madras State-(For the year ending 31st March 1951.) Pages 103-104

నోటు: ఇందులో జిల్లాలుగా ఉదహరించబడిన డివిజనులు, ఆయాజిల్లాల రెవిన్యూ డివిజన్ల సరిహద్దులకు పరిమితమైలేవు-ఫారెస్టు శాఖవారు పరిపాలనాసౌలభ్యంకోసం ఏర్పరచిన డివిజన్లుగా మాత్రమే పరిగణించాలి.

*బళ్లారి డివిజన్ మొత్తంగా తీసుకోబడింది. ఆంధ్ర - ఆంధ్రేతర భేదం పాటించబడలేదు.

# ఖనిజసంపద

ఆంధ్రదేశంలో ఇతర సహజ సంపదలతోపాటు ఖనిజ సంపదకూడా అపారం. మైకా, మాంగనీసు, క్రోమైట్, ముడిఇనుము, రాగి, ఆస్‌బెస్టాస్, బెరైటిస్ మున్నగు ఖనిజాలు మన రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో దొరుకుతాయి.

ఆస్‌బెస్టాస్ :

దీనినే "రాతినార" అంటారు. గుడ్డ, కాగితము తయారుచేయుటకు, ఉష్ణ నిరోధక వస్తువుల తయారీకి, సిమెంటుతో కలిపి గొట్టాలను, రేకులను తయారు చేయుటకు ఉపయోగిస్తారు.

కడప జిల్లాలోని వేంపల్లి ప్రాంతంలో మేలురకం రాతినార దొరుకుతుంది. కర్నూలు జిల్లాలోని మల్కాపురం ప్రాంతంలోను, అనంతపురంలోని వెంగన్నపల్లి ప్రాంతంలోనూ దొరుకుతుంది.

కడప జిల్లాలో 1946లో 18 టన్నుల రాతినార తీయబడింది. దీని విలువ రు. 20,041 లని అంచనా వేయబడింది. ఇదే సంవత్సరంలో భారత దేశంలో (విభజనకు పూర్వం) తీయబడిన 307 టన్నుల రాతినార రు. 48,000 లకు అమ్మబడింది. ఇందులో ఒక్క కడపజిల్లా సరుకు 18 టన్నులే రు. 20,000 లకు అమ్మబడిందంటే, మన రాతినార దేశంలోకల్లా ఎంత మేలురకమో గ్రహించవచ్చు.

బెరైటిస్ :

దీనినే తెలుగులో "ముగ్గురాయి" అంటారు. రంగులు తయారు చేయుటకు దీన్ని ఉపయోగిస్తారు. ఇందులోని నాసి రకమును నూనె బావులు తవ్వటంలో వినియోగిస్తారు.

మన ముగ్గురాతి ఖనిజ సంపద భారతదేశంలోని ఇతర ప్రాంతాలకంటే చాలా ఎక్కువ. అనంతపురం, కడప, కర్నూలు జిల్లాల్లో ఈఖనిజం దొరుకుతున్నది.

1946వ సంవత్సరంలో భారతదేశ ఉత్పత్తి 29,091 టన్నులు (విలువ రు. 3,68,680). ఇందులో పై మూడు జిల్లాల ఉత్పత్తి 28,874 టన్నులు (విలువ రు. 3,64,330).

మన రాష్ట్రంలో తీయబడుతున్న ఖనిజం, ఉత్తర హిందూదేశపు రంగుల పరిశ్రమకు, నూనెబావుల త్రవ్వకానికి ప్రస్తుతం ఎగుమతి చేయబడుతున్నది. మన రాష్ట్రంలో ఇది ఏ పరిశ్రమకూ వుపయోగపడటంలేదు. స్థానికంగా "బేరియం"రసాయనాల ఉత్పత్తిని, రంగుల పరిశ్రమను ప్రారంభించినట్లయితే మన ఈ ఖనిజ సంపద నంతటినీ మనమే ఉపయోగించవచ్చు.

బాక్సైట్ (Bauxite) :

ఇది గోధుమ, రాగి, తెలుపు రంగులలో (Brown or Gray or white) ముద్దగాగాని, పొడిగాగాని దొరకుతూంది.

నిత్య జీవితంలో ఉపయోగపడే అల్యూమినియం, బాక్సైట్ (Bauxite) నుండే తీయబడుతున్నది. అతి హెచ్చు ఉష్ణోగ్రతకు ఆగగలిగిన ఇటుకలు తయారు చేయుటకు, నూనెలను పరిశుద్ధిచేయుటకు, నూనె రంగును మార్చుటకు ఈ ఖనిజం ఉపయోగపడుతుంది.

విశాఖపట్నం, గోదావరి జిల్లాలలోని తూర్పు కనుమల ప్రాంతంలో ఈ లోహం దొరుకుతుంది. ఇంతవరకు దీని త్రవ్వకం విషయంలో తగిన శ్రద్ధ తీసుకొనబడలేదు.

కట్టుబడిరాయి (Building Stone) :

రాష్ట్రమంతటా కట్టుబడిరాయి సమృద్ధిగా దొరుకుతున్నది. సామాన్య కట్టుబడులకేగాక, తిరుపతి, అమరావతి, నాగార్జునకొండ, హంపి మున్నగు చోట్ల శిల్పాలు చెక్కుట కుపయోగించబడిన నాణ్యపురాయి మనకు సమృద్ధిగా ఉంది.

కర్నూలు, కడప, అనంతపురం, గుంటూరు జిల్లాలలో నాపరాయి విస్తారంగా దొరుకుతున్నది. నేలమీద పరచుటకు, ఇండ్ల కప్పులకు దీన్ని ఉపయోగిస్తారు.

నెల్లూరు–కర్నూలు జిల్లాల సరిహద్దులలో ఉన్న కంభం, మార్కాపురం లలో పలకరాళ్లు (Slates) విస్తారంగా ఉన్నాయి. ఇచ్చట పలకల తయారీ జరుగుతున్నది.

గుంటూరు జిల్లాలోని రెంటచింతల, పిడుగురాళ్ళ, దాచేపల్లి ప్రాంతాలలోను; విశాఖ, తూర్పుగోదావరి జిల్లాలలోని కొండ ప్రాంతాలలోను; ముఖ్యంగా అనంతగిరి సమీపంలోనున్న "బొర్ర" ప్రాంతంలోను, అత్యుత్తమమైన చలువరాయి దొరుకుతుంది.

ఒక్క గుంటూరు జిల్లాలోని రెంటచింతలలో మాత్రమే ప్రస్తుతం ఈ చలువరాతి పరిశ్రమ ఉన్నది.

రాష్ట్రంలోని అనేక ప్రాంతాలలో రోడ్ల నిర్మాణానికి, ఇండ్ల కట్టుబడికి, మైలురాళ్ళకు పనికివచ్చే రాయి వివిధ క్వారీలలో తీయబడుతున్నది.

క్రోమైట్ (Chromite):

ఇది నలుపు గోధుమచాయలు కలిగి ఉంటుంది. దీనిని ఇతర లోహాలతో కలిపి తుప్పుబట్టని ఉక్కు (Stainless steel) చేయుటకు ఉపయోగిస్తారు. నాసిరకం క్రోమైట్ కలసిన ఉక్కును ఆయుధాల పూతకు (Armour plating) ఉపయోగిస్తారు.

వివిధ పరిశ్రమలలో అధిక ఉష్ణోగ్రతలో పని చేయవలసిన యంత్ర భాగాలను, ఎక్కువపాళ్లు క్రోమియమ్ కలిపిన లోహముతో చేస్తారు. దీనిని విద్యుత్ పరికరాల ఉత్పత్తిలోకూడా ఉష్ణనిరోధకముక్రింద వాడుతారు.

కృష్ణాజిల్లాలో కొండపల్లి పరిసరాలలో క్రోమైట్ కనుగొనబడినది. ఈ ప్రాంతంలోని "కడిం పోతవరం"వద్ద (రిజర్వు ఫారెస్టు సరిహద్దున) కనుకొనబడిన గని, ఆ పరిసర ప్రాంతాలలో దొరికే లోహంకంటె మేలురకంగా ఎంచబడుతున్నది.

1942–'43 సంవత్సరాలలో సంవత్సరానికి సుమారు 500 టన్నుల క్రోమైట్ ఇచ్చట తీయబడినది. 1946 సంవత్సరంలో 274 టన్నులు మాత్రమే తీయబడినది. ఇదివరలో పనిచేస్తూవచ్చిన రాయల్ మైనింగ్ సిండికేట్ – గుంటూరు, రాజేంద్ర మైనింగ్ సిండికేట్–గుంటూరు కొన్ని సంవత్సరాలుగా పనిచేయడంలేదు. బెన్నీ కంపెనీ (Benny & Co.) మదరాసు, ప్రస్తుతం ఇచ్చట పని కొనసాగిస్తున్నది.

పింగాణీ మట్టి (CLAY)

పింగాణీ పరిశ్రమకు పనికివచ్చే వివిధ రకాల మట్టి వివిధజిల్లాలలో విరివిగా దొరుకుతుంది. ఇందులోని తెల్లమట్టి బట్టలపరిశ్రమలోను, కాగితపు ఉత్పత్తికిని వాడుతారు. కుండలు, ఇటుకలులాంటి నిత్య జీవితావసరాల నెన్నింటినో చేయుటకు ఇది ఉపయోగపడుతుంది.

తెల్లమట్టి విశాఖపట్నం జిల్లాలోని చోడవరానికి ఆరుమైళ్ళ దూరాన ఉన్న బెన్నవోలు కొండలలోను, భోగాపురంలోను, విజయనగరం సమీపంలోని దాసన్న పేటలోను, తూర్పుగోదావరి జిల్లాలోని కొత్తబొమ్మూరు (రాజమండ్రి సమీపంలో) లోను, కర్నూలు జిల్లాలోని బేతంచర్ల రైల్వేస్టేషన్ సమీపంలోని రామల్లకోట ప్రాంతంలోను, ప్రేమగ్రామ సమీపంలోను, అనంతపురం జిల్లాలోని బాలాపురం, ఉరవకొండ ప్రాంతాలలోను, గుంటూరు జిల్లాలోని మాచర్లలోను, మరికొన్ని ఇతర ప్రాంతాలలోను విశేషంగా దొరుకుతున్నది.

విశాఖజిల్లాలోని వరహానది ఒడ్డుననున్న పాకలపాడు ప్రాంతంలోను, విజయనగరం సమీపమునఉన్న దాసన్న పేటలోను, విశాఖపట్టణంలోని హార్బరు సమీ

పింగాణీ ఉన్న గవర్నమెంటు స్థలంలోను, తూర్పుగోదావరి జిల్లాలోని కొత్తమున్నూరు లోను, కడపజిల్లాలోని సత్తిగుంట, ముష్టివేరు నదిలోను, చిన్నపరంపాలెంలోను, కర్నూలుజిల్లాలోని అంబాపురంలోను, నెల్లూరులోని నాగకమ్మపేట చెరువు కాలువ లోను, రంగుమట్టి విశేషంగా దొరుకుతున్నది. ఈ మట్టి వివిధరంగులలో ఉన్నది.

గూడూరు, బేతంచర్ల, కొండాపలలో మాత్రమే కొద్దిపాటి పింగాణీ పరిశ్రమ కొనసాగుతున్నది. మన పింగాణీ మట్టిని సద్వినియోగం చేసేందుకు ఈ పరిశ్రమను అభివృద్ధి చేయవలసి ఉన్నది.

### రాక్షసి బొగ్గు:

ఆవిరి యంత్రాలను పని చేయించుటకు రాక్షసిబొగ్గును వాడుతారు. బొగ్గులోని కొన్ని పదార్థాలను తొలగించి "కోక్"ను తయారుచేస్తారు. లోహ పరిశ్రమకు అవసరమైన అత్యంత ఉష్ణోగ్రతను సృష్టించడానికి ఈ "కోక్"ను వాడుతారు. బొగ్గునుండి బెంజాల్, అమ్మోనియా, నాఫ్తలీన్ (కలరా ఉండలు), తారు మున్నగు ఉప పదార్థములను (By-products) తయారు చేస్తారు.

ఆంధ్ర రాష్ట్రంలో ఇంతవరకు ఎచ్చటా రాక్షసి బొగ్గును తీయుటలేదు. ఇంతవరకు జరిగిన పరిశోధనలమూలంగా గోదావరీ నదికి ఇరుప్రక్కల బొగ్గు నిల్వలు ఉన్నట్లు తేలింది. తూర్పు గోదావరిజిల్లా ముమ్మడివరం ప్రాంతంలో బొగ్గు నిల్వ లున్నట్లు భారత భూగర్భశాఖ 1944 లో జరిపిన పరిశోధనలో బైటబడింది. భద్రా చలానికి సమీపముననున్న గౌరీదేవిపేట సమీపంలోకూడా బొగ్గు నిల్వలున్నట్లు కనుగొన్నారు. తోటపల్లి ప్రాంతంలో 1870–'71 సంవత్సరంలో గొట్టాలను దించి పరిశీలన కొనసాగించారు. 10 అడుగుల ఆరు అంగుళాలనుండి, 18 అడుగుల మందము వరకు బొగ్గు ఉన్నట్టు పరిశోధనవల్ల తేలింది.

1890–'95 సంవత్సరాలమధ్య గోదావరి కోల్ కంపెనీ ఈ ప్రాంతంలో నాణ్యమైన రాక్షసి బొగ్గును 3,657 టన్నులను త్రవ్వింది. ఈ ప్రాంతంలో మేలురకం బొగ్గు విరివిగా దొరకవచ్చునని, అందుకు అవసరమైన పరిశోధనలు కొనసాగించ వలయునని, భారత భూగర్భ శాఖా పరిశోధకులు అభిప్రాయ పడుతున్నారు.

పశ్చిమ గోదావరి జిల్లాలోని బెడదనూరు (పోలవరం ఏజన్సీ) ప్రాంతంలో బొగ్గు గనులున్నట్లు నిర్ణయించబడింది. 1922 – '23 సంవత్సరంలో హైదరాబాదు కంపెనీచేత స్వర్ణ వారిగూడెం పక్కన (ఇది బెడదనూరుకు ఎనిమిది మైళ్ళు) మూడు గొట్టాలు దింపబడినవి. వీనిలో 10 అ॥ 6 అం॥ మందమువరకు బొగ్గు తగిలింది. కాని ఈ బొగ్గు చాల నాసిరకం.

కొవ్వూరు తాలూకా (పశ్చిమ గోదావరి) లోని ఎర్రగూడెం ప్రాంతంలోకూడా బొగ్గు నిల్వలున్నట్లు పరిశోధకులు భావిస్తున్నారు. జంగారెడ్డిగూడెం

ప్రాంతంలో గొట్టాలు దింపినా ఎక్కువ బొగ్గు నిల్వలు తగలలేదు. కాని భూగర్భంలో ఉన్న కొండపొరలు తొలిచి పరిశోధనలు మరింత లోతువరకు కొనసాగించినట్లయితే రాక్షసిబొగ్గు దొరకవచ్చునని భూగర్భ పరిశోధనలు తెలియచేస్తున్నాయి.

పరిశ్రమాభివృద్ధికి రాక్షసిబొగ్గు అవసరం దృష్ట్యా, గోదావరి లోయలో విరివిగా పరిశోధనలు జరపటం అత్యావసరం.

రాగి :

మానవుడు విరివిగా ఉపయోగించే లోహాలలో రాగి ఒకటి.

విద్యుత్ పరిశ్రమలోను, మోటార్ల నిర్మాణంలోను, స్విచ్‌ల తయారీకి, డైనమో భాగాలకు, విద్యుత్ ప్రవాహానికి అవసరమైన తీగలకు, టెలిఫోన్, టెలిగ్రాఫ్ పరికరాలకు రాగిని ఉపయోగించుతారు. గృహ అవసరాలకే గాకుండా, రైళ్ళు, ఓడలు, విమానాల తయారీలోకూడా దీనిని ఉపయోగిస్తారు. కంచు, ఇత్తడి మొదలైన లోహాలను తయారుచేయుటకుకూడా ఉపయోగించుతారు.

నెల్లూరు, కర్నూలు జిల్లాలలో 19 వ శతాబ్దంలో ఈ ఖనిజాన్ని త్రవ్వటం ప్రారంభించారు. అనంతపురం జిల్లాలోని మదిగుబ్బ ప్రాంతంలో రాగి త్రవ్వకానికి కొద్దికాలంక్రితం ప్రభుత్వం లైసెన్సు ఇచ్చింది. ఇది మినహా ప్రస్తుతం మరెచ్చటా ఈ పరిశ్రమ కొనసాగటంలేదు. 1926 వ సంవత్సరంలో నెల్లూరు జిల్లానుండి 14 టన్నులు, 1932 సంవత్సరంలో 365 టన్నులు ముడిరాగి తీయబడింది.

నెల్లూరుజిల్లాలోని గరిమినపెంట ప్రాంతంలోని ముడిరాగి పరిశోధనకిని పంపగా అందులో నూటికి 70 వంతుల రాగి ఉన్నట్లు తేలింది. 1933 వ సంవత్సరంలో జర్మన్ నిపుణులు జరిపిన పరిశోధనలలో "గరిమినపెంట" ప్రాంతంలో విరివైన రాగి గనులున్నట్లు బైటపడింది. ఈ ప్రాంతంలో ఏడు గ్రూపులుగా లోహమున్నట్లు తెలుస్తున్నది. వీనిలోకల్లా నిలగాని, సాలిగిరి గనులు ఎక్కువ ఖనిజాన్ని ఇవ్వగలవని అంచనా వేయబడింది. ఉదయగిరి తాలూకాలోని నరసింహాపురం, కాళహస్తి జమీందారీలోని పామూరు, గోగులపల్లి ప్రాంతాలలో కూడా రాగి దొరుకు సూచనలు ఉన్నవి.

వినుకొండ తాలూకాలో ఉత్తరంగా ఉన్న గుంట్లపాలెం, లేక అగ్నిగుంటల ప్రాంతంలోను, కర్నూలుజిల్లాలోని గని ప్రాంతంలోను, కడపజిల్లాలోని జంగంరాజులపల్లి ప్రాంతంలోను రాగి లభించవచ్చునని పరిశోధకుల అభిప్రాయం.

వజ్రాలు :

ఇవి ఆభరణాలకేగాక, యంత్రాలకుకూడా ఉపయోగిస్తారు. మొత్తం ప్రపంచ ఉత్పత్తిలో నూటికి 20 పాళ్ళపైబడి పారిశ్రామిక అవసరాలకు వజ్రాలు ఉపయోగపడుతున్నాయి. గట్టివస్తువులను కోయటానికి ఉపయోగించే 'డ్రిల్లు'ల లోనూ, అతిసున్నితమైన తీగెల తయారీకి వీటిని ఉపయోగిస్తారు.

శతాబ్దాల తరబడి ఆంధ్రదేశం వజ్రవైఢూర్యాలకు పేరు మోసినది. బ్రిటిష్ రాణి కిరీటంలోని ప్రసిద్ధిచెందిన కోహినూరు వజ్రము, గుంటూరుజిల్లాలోని కొల్లూరు ప్రాంతపు వజ్రపు గనులలోనిదని డా॥ బాల్ అనే భూగర్భశాస్త్రజ్ఞుని అభిప్రాయం. దీని తూకము 787½ కారెట్లు (కారెట్ = .2 గ్రాములు) ఉండేది. ఇది తరువాత 280 కారెట్లకు తగ్గించబడింది. రాయలసీమ జిల్లాలు ఈ సంపదకు ప్రసిద్ధికెక్కినవి.

అనంతపురం జిల్లాలోని వజ్రకరూరు ప్రాంతంలో నేటికీ వజ్ర సంపద అధికంగా ఉన్నదని పరిశీలకుల అభిప్రాయం. ఇచ్చట వజ్రోత్పత్తినిబట్టే దీనికి ఈపేరు వచ్చినదని చెపుతారు. ఇది గుంటకల్ రైల్వే కేంద్రానికి ఎనిమిదిమైళ్ళ దూరం. గత 12 సంవత్సరాలలో వజ్రకరూరులోను, దాని పరిసరాలలోను కొన్ని విలువైన రాళ్ళు దొరికినట్లు తెలుస్తున్నది. మంచి వర్షం కురిసిన తర్వాత జాగ్రత్తగా పరిశీలించితే ఇటువంటివి దొరుకుతూ వచ్చాయనియు, కనుక ఇచ్చట విలువయిన వజ్ర సంపద ఉన్నదనియు పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు.

అనంతపురంజిల్లాలోని లత్తవరం, గడ్డిహొత్తూరు (పెద్దహొత్తూరు), గంజికుంట, బడిసినపల్లి, తంగనపల్లి, ములకలపెంట, పుప్పరపల్లి, పొన్నగిరి, గుడిఅనంతపురం, పెరవలి, గిరికట్ల, తుగలి మున్నగు ప్రాంతాలలో వజ్రాలు దొరకవచ్చునని, ఈ ప్రాంతంలో విరివిగా పరిశోధనలు జరిపిన పింగళి వెంకయ్యగారి అభిప్రాయం.

గుంటూరుజిల్లాలోని మద్దెంపుగ్గ ప్రాంతంలోను, తూర్పుగోదావరిలోని భద్రాచలం సమీపానవున్న సవిటిగడ్డనను, కర్నూలుజిల్లాలోని రామల్లకోట ప్రాంతంలోను దొరికే అవకాశం వున్నదని భూగర్భ పరిశోధకుల అభిప్రాయం.

కృష్ణాజిల్లాలోని కొండపల్లి ప్రాంతంలోను, విశాఖజిల్లాలోని, తూర్పు కనుమలలోను, నెల్లూరులోని సైదాపురం ప్రాంతంలోను, రాజమండ్రి ప్రాంతంలోని గోదావరి తీరుప్రక్కలను, విలువైన రాళ్ళు దొరుకుతాయని భూగర్భ పరిశోధనలు తెలియజేస్తున్నాయి.

బంగారము :

విలువైన లోహాలలో ఇది ఒకటి. ఆంధ్ర రాష్ట్రాలలో విరివిగా దొరకక పోయినా, అనంతపురం, చిత్తూరు జిల్లాలలో బంగారపు నిల్వలున్నట్లు అభిప్రాయపడుతున్నారు.

1905 వ సంవత్సరంలో అనంతపురం గోల్డు ఫీల్డు లిమిటెడ్ అనే కంపెనీ, రామగిరి ప్రాంతంలో పరిశోధనలు కొనసాగించింది. తరువాత కొంతకాలానికి ఇదే ప్రాంతంలో నార్తు అనంతపురం గోల్డు మైన్సు లిమిటెడ్ అనే సంస్థకూడా పరిశోధనలు చేసింది. 1910 వ సంవత్సరంనుండి 1927 వ సంవత్సరంవరకూ, ఈ ప్రాంతంలో పై రెండుకంపెనీలు బంగారాన్ని త్రవ్వుతూవచ్చాయి. 1910_27 సంవత్సరాల మధ్య 1,82,315 ఔన్సుల బంగారం తీయబడింది. ప్రస్తుతం త్రవ్వకం కొనసాగటంలేదు.

ఇంత విలువయిన లోహము ఉన్నా, ఇంతవరకు విలువలను నిర్ణయించ డానికి సరియైన పరిశోధనలు కొనసాగింపబడలేదు.

**గ్రాఫైట్ (Graphite) :**

ఇది బొగ్గుయొక్క స్ఫటికము (crystal). ఇది పొరలక్రింద, చిన్న చిన్న ముక్కలక్రింద దొరుకుతుంది. నల్లగా, మెత్తగా ఉంటుంది. తాకితే చేతులకు రంగంటుతూ వుంటుంది.

దీనిని లోహాలు కరగింపటానికి అవసరమయ్యే మూసల తయారీకి, అతి వేగంతో తిరిగే యంత్రభాగాలలో వేడిని తగ్గించుటకు కందెనగాను (lubricant), పెన్సిళ్ల ములికలతయారీ మున్నగువాటికి ఉపయోగిస్తారు.

విశాఖజిల్లాలోని తడిపాలుగ్రామంలో (నర్సీపట్నంకు కొద్దిదూరంలో) నాణ్యమైన గ్రాఫైట్ ఖనిజమున్నది. ఇదేజిల్లాలోని సాలూరు, కాశీపురం, కీసర, మునిపల్లి, వేమువిలాస్‌లోకూడా దొరుకుతుంది.

తూర్పుగోదావరి జిల్లాలోని సీతపల్లి, గొల్లగూడెం, రామన్నపాలెంలో (చోడవరం డివిజన్) కొంతకాలం గ్రాఫైట్ త్రవ్వబడింది. యల్లవరం ప్రాంతంలోని కోదాడలో మేలురకము ఖనిజం ఉన్నట్లు కనుగొనబడింది. భద్రాచలం ప్రాంతంలోని వూట్ల, వేటకొండలలో ఇది త్రవ్వబడుతున్నది.

పశ్చిమగోదావరిలోని బెడనూరు ప్రాంతంలోను, సామల్‌కొండలోను, కృష్ణాజిల్లాలోని పెద్దంపూరు ప్రాంతంలో కూడా ఇది దొరుకుతుంది.

**జిప్సం (Gypsum) :**

సిమెంటు తయారీలోను, తెల్లసిమెంటు ఉత్పత్తికి, ప్లాస్టర్ ఆఫ్ పారిస్ తయారుచేయుటకు 'జిప్సం' ఉపయోగబడుతుంది. రంగుకాగిత పరిశ్రమలోను, గాజు సామానుకు మెరుగుపెట్టుటకుకూడ దీనిని వాడుతారు.

నెల్లూరుజిల్లాలోని సూళ్లూరుపేటకు తూర్పునవున్న పులికాటుసరస్సు పరిసరాల్లో వంద చదరపుమైళ్ళ ప్రాంతంలో ఇది విరివిగా దొరుకుతుంది. పరిశోధనచేసిన 20 చదరపు మైళ్ళలోను, ప్రతి అడుగులోతుకు మైలు 1కి 10 వేల టన్నుల "జిప్సం" దొరుకుతుందని అంచనావేయబడింది. గుంటూరుజిల్లాలోని సంతరావూరు, కొత్తపట్నం సమీప ప్రాంతాలలోకూడా ఇది విరివిగా దొరుకుతుంది. సూళ్ళూరు పేటలో తీస్తున్న బహుకొద్ది మొత్తం మినహా, దీనినింతవరకు త్రవ్వి తీయటంలేదనే చెప్పాలి.

**ఇనుము :**

భూగర్భంలో విరివిగా దొరికే ఖనిజాలలో ఇనుము ఒకటి. వంటలాడి ఖనిజాలలో ఇనుము ఏదో కొన్ని పాళ్ళలో దొరుకుతూనే ఉంటుంది. కాని దీనిని విస్తృత అవసరాన్ని బట్టి అత్యధిక భాగం ముడి ఇనుము దొరికే పదార్థాలకొరకే పరిశోధనలు జరుగుతున్నాయి.

కర్నూలుజిల్లాలోని చాగోలు కొండల ప్రాంతంలో ముడిఇనుము విరివిగా దొరుకుతుందని 1943 లో జరిగిన పరిశోధనలు తెలియచేస్తున్నాయి. ఇచ్చట దొరికే ముడిఇనుములో సుమారు 65% ఇనుము, 5% సిలికా మున్నగునవి ఉన్నట్లు రుజువయింది.

విశాఖపట్నంలోని చింత్రి ప్రాంతంలోను, మోహనపురంలోను, నరసీపట్నం సమీపంలోను, పశ్చిమగోదావరిలోని పోలవరం, కృష్ణాలోని గొల్లపల్లి, తూర్పు గోదావరిలోని రాజమండ్రి సమీప ఇసుక భూముల్లో ఇనుము దొరుకునని ఊహించబడుతున్నది. కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేట పరిసరాలలో నూతనంగా అనేక నిల్వలు కనుగొనబడ్డాయి. త్రవ్వకం కూడ ఇప్పుడు కొనసాగిస్తున్నారు.

కర్నూలుజిల్లాలోని వెలుదుర్తి, రామల్లకోటలో మేలురకం ఇనుము నూటికి 20 పాళ్ళు దొరుకునని అంచనా వేయబడింది. ఒక్క కర్నూలుజిల్లాలోనే ఇనుముదొరికే పది ప్రదేశాల్లో 37,14,000 టన్నుల శ్రేష్ఠమైన ఇనుము దొరుకుతుందని అంచనా వేయబడుతున్నది. ఇచ్చట సామాన్యతరగతికి చెందిన ఇనుము అనేక లక్షల టన్నులలో దొరుకుతుంది.

గుంటూరుజిల్లాలోని సింగరాయకొండ ప్రాంతంలోని కొణిజేడు కొండల్లో నాలుగుగనులు కనుగొనబడినవి. ఒంగోలుకు ఆగ్నేయదిశగా ఉన్న గుట్టల్లోను, పెద్ద మొట్టగుట్టల్లోను, చుండ్లకమ్మ ప్రాంతంలోను ఇనుము ఉన్నట్లు నిర్ణయించబడింది.

**సీసము :**

ఇది మెత్తగా ఉంటుంది. కాని ద్రావకంలో వేసినా కరగదు.

పరిశ్రమలలో, ముఖ్యంగా ముద్రణ పరిశ్రమలోను, రంగుల తయారీలోను, వివిధ లోహాల తయారీకి విరివిగా ఉపయోగపడుతుంది. సీస మిశ్రిత లోహాలు విషపూరితములు.

గుంటూరు, రాయలసీమ జిల్లాలలో ఇది దొరుకుతుంది. ఈ ప్రదేశాల్లో ఇదివరలో ఈ లోహం కొంతకాలం త్రవ్వబడింది.

కడప పట్నానికి సమీపంలో వున్న కొట్లగాపు ప్రాంతంలోను, కడప – బద్వేలు రోడ్డుమీదఉన్న నాగసానిపల్లి సమీపమునవున్న కొండలలోను, నల్లమల కొండలలోని జంగమరాజుపల్లి ప్రాంతంలోను, కోయిలకుంట్లలోను, కర్నూలుజిల్లాలోని బసవపురం, చిత్యాల, గుంటూరుజిల్లాలోని కారెంపూడిలోను ఈ లోహం దొరుకుతుందని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

కడపజిల్లాలోని నాగసానిపల్లెవద్ద తవ్విన ప్రతి గజానికి 19హండ్రెడ్ వైట్ల సీసము బయటపడుతుందని అంచనా వేయబడింది. ఇచ్చట ముడిపదార్థంనుండి 70% నుండి 76% వరకు సీసము దిగుబడి అయినది. ఈ ఖనిజపు ఉపయోగము, విలువను బట్టి నూతన పరిశోధనలు కొనసాగించటం అత్యవసరం!

సున్నపురాయి :

ఇది మన జిల్లాలలో విశేషంగా దొరుకుతున్నది. ఖనిజాలు కరిగించే టప్పుడు వాటి కరిగే ఉష్ణోగ్రతను తగ్గించటానికీ, లోహఖనిజాలలోని మలినాలను తొలగించటానికీ, మెగ్నీషియం, ఇనుము బహుస్వల్ప పాళ్లలో ఉన్న సున్నపురాతిని సిమెంటు తయారీకికూడా వినియోగిస్తారు. నీళ్ళను శుభ్రపరచుటకు, కొన్ని రాసాయనిక, పంచదార, గాజుపరిశ్రమలలోను, తోళ్లను శుభ్రపరచుటకు సున్నపురాతిని, సున్నమును వినియోగిస్తారు.

సున్నపు రాతిక్వారీలు, విశాఖజిల్లాలోని బోర్రా, అనంతగిరి సమీపం లోనూ, రామగిరికి పశ్చిమంగా ఉన్న అరగుడాలోను విరివిగా ఉన్నాయి.

గోదావరి జిల్లాలోని చెర్లవద్ద, భూమన్నలంక, కొవ్వూరుతాలూకాలోని లింగకొండవద్ద, రాజమండ్రి పట్టణానికి ఉత్తరంగాను దొరుకుతుంది.

కృష్ణా, గుంటూరుజిల్లాలలోని కృష్ణానదికి ఇరుప్రక్కలనున్న కొండల లోను,జగ్గయ్యపేట, ముక్త్యాల ప్రదేశాలలోను, పల్నాడులోని పిడుగురాళ్ళ మొదలైన ప్రాంతాలలోనూ దొరుకుతుంది.

శ్రేష్ఠమయిన సున్నపురాయి గుంటూరుజిల్లాలోని దాచేపల్లిలో లభిస్తున్నది.

నెల్లూరు జిల్లాలోని, పెద్దలలవందల, దర్శి, బట్టువారిపల్లెలోను, కడప జిల్లాలోని, వేంపల్లి, పులివెందుల, పర్నపల్లి ప్రాంతాలలోను, అనంతపురం జిల్లాలోని కొండవుప్పలపాడు, దాడితోల మున్నగు ప్రాంతాలలోను విరివిగా దొరుకుతుంది.

మాంగనీసు :

ఇనుము, ఉక్కు పరిశ్రమకు అవసరమయిన ముఖ్య ఉప లోహాల్లో (Subsidairy metals) మాంగనీసు ఒకటి. మాంగనీసు, ముడి ఇనుముతో మిళిత మయ్యే గనులలోనుండి తీయబడుతున్నది. ముడి పదార్థంలో నూటికి 30-35 పాళ్లు మాంగనీసు ఉన్నదానిని మాంగనీసు ఖనిజముగాను, అంతకు తక్కువ మాంగనీసు ఉంటే మాంగనీసుకలసివున్న ఇనుముగాను పరిగణిస్తారు.

మాంగనీసులోని కొద్ది భాగం స్టెయిన్ లెస్ స్టీల్, రాగి-నికిల్ సంయోగానికి, కంచు మున్నగు లోహాల తయారీలోను వాడుతారు. ఉక్కుతో మాంగనీసును కలిపి అత్యంత బలవత్తరమైన లోహాన్ని తయారు చేస్తారు. ఈ లోహాన్ని యుద్ధ శకటాలకు, భారీవస్తువుల నిర్మాణానికి ఉపయోగిస్తారు.

విశాఖజిల్లాలోని విజయనగరం, భీమునిపట్నం ప్రాంతాలలో ఈ ఖనిజం కలదని 1855 లో కనుగొనబడినది. శ్రీకాకుళంజిల్లాలోని చీపురుపల్లి ప్రాంతంలో ఉత్తమతరగతికి చెందిన మాంగనీసు దొరుకుతుంది.

ఈ ప్రాంతంలోని "గర్భాం" మాంగనీసుగనులు భారతదేశంలోకల్లా పెద్దవిగా అంచనా వేయబడుతున్నవి. వీనినుండి 1896—1913 సంవత్సరాలమధ్య 7,36,000 టన్నుల మాంగనీసు త్రవ్వబడింది. 1905వ సంవత్సరంలో జరిగిన పరిశోధనలలో శ్రీకాకుళంజిల్లాలోని సాలూరు, చీపురుపల్లి తాలూకాలలో మొత్తం 24 ప్రదేశాలలో ఈ ఖనిజసంపద ఉన్నట్లు కనుగొనబడింది. 1908లో జరిపిన పరిశోధనలలో మరొక 25 చోట్ల ఈ లోహమున్నట్లు కనుగొనబడింది. బిర్లాకింపెనీవారు ప్రస్తుతం ఈ ఖనిజాన్ని త్రవ్వేభూముల కొన్నింటిని కౌలుకుతీసుకొన ఆలోచనలో ఉన్నట్లు తెలుస్తున్నది.

మొత్తం భారతదేశ మాంగనీసు ఉత్పత్తిలో ఒక్క శ్రీకాకుళం జిల్లాలోనే నూటికి 40 పాళ్ళవరకు లభ్యమవుతున్నది. ఈ మొత్తం సరుకు అతి స్వల్ప ధరకు విదేశాలకు, ముఖ్యంగా అమెరికాకు ఎగుమతి చేయబడుతున్నది.

పొటాసియం పర్‌మాంగనేట్ మొదలైన రాసాయనిక పదార్థాల ఉత్పత్తికి అవసరమయ్యే బహుకొద్దిమొత్తాన్నితప్ప, భారతదేశం ఈ విలువయిన ఖనిజాన్ని ఇంతవరకు వినియోగించుకొనలేకపోతున్నది.

## మైకా (అభ్రకం)

ఆంధ్రదేశంలో విరివిగా దొరికే ఖనిజాలలో మైకా ఒకటి. భారతదేశ మైకా ఉత్పత్తిలో ఆంధ్రదేశము మూడవ స్థానాన్ని ఆక్రమిస్తున్నది.

కండక్టర్ల తయారీలోను, మోటారుకారుల భాగాలలోను, విమానాల తయారీలోనూ, వైర్‌లెస్ ఇంజనీరింగుకు, విద్యుత్ ప్రవాహ నిరోధకంగాను, డైనమో మోటారు భాగాలలోను, టెలిఫోనులు, ప్లగ్‌ల నిర్మాణం ఇత్యాది అనేక పనులకు ఈ ఖనిజము ఉపయోగపడుతుంది.

ఇందులో ఒకరకం మైకాను రబ్బరు, రంగులు, పెంకులు ఉత్పత్తికి; వాల్ పేపరు తయారీకి ఉపయోగిస్తారు.

ఈ ఖనిజం, నెల్లూరుజిల్లాలో ప్రధానంగా దొరుకుతున్నది. ఈ జిల్లాలోని గూడూరు, రాపూరుతాలూకాలు మైకా దొరికే ప్రధానకేంద్రాలు. ఆంధ్రదేశ ఉత్పత్తిలో నూటికి 98 పాళ్ళు ఈ జిల్లాలోనే తీయబడుతున్నది.

విశాఖజిల్లాలోని కుడియ, మాజిగూడెం ప్రాంతంలోను, కృష్ణాజిల్లాలోని తిరువూరు, గొర్లమడ్ల, కుమ్మరకుంట్ల, గోనవీడు సమీపాల్లోను, పశ్చిమగోదావరి జిల్లాలోని కొర్వరపాడు ప్రాంతంలోను ఈ ఖనిజము దొరుకుతున్నది.

పైన మనకున్న ప్రధాన ఖనిజసంపద మాత్రమే పేర్కొనబడింది. ఇవి కాక కొద్దిమొత్తంలో దొరికే ఖనిజాలు మరెన్నో మన జిల్లాల్లోవున్నాయి.

# ఆంధ్రరాష్ట్రం

## ఖనిజ సంపద




ఒరిస్సా

మధ్యప్రదేశ్

హైదరాబాద్

మైసూరు

మద్రాసు

### సూచిక

| | |
|---|---|
| ఇనుము | బెరిల్ |
| క్యానైట్ | బొగ్గు |
| కొరండం | మాంగనీసు |
| కొలంబైట్‌టాంటలైట్ | రాగి |
| క్రోమైట్ | రాతినార |
| గాజు | ఉప్పు |
| గ్రాఫైట్ | వజ్రాలు |
| గార్నెట్ | సమర్‌స్కైట్ |
| జిప్సం | సీసం |
| పింగాణీమన్ను | సున్నపురాయి |
| పైరైట్ | స్టైటైట్ |
| ఫాస్ఫేట్ | బలపపురాయి |
| ఫెల్డ్‌స్పార్ | అభ్రకం |
| బంకమన్ను | బారైటీస్ |
| బంగారం | బాక్సైట్ |

ఇంత ఖనిజ సంపద ఉన్నా, దీన్ని త్రవ్వి తీసి సద్వినియోగం చేసుకోవడం లేదు. తవ్వుతున్న మైకా, మాంగనీసులాంటి ఖనిజాల విషయంలోకూడా అతి పురాతన పద్ధతులతో తవ్వి, ఎగుమతి చేయడం మినహా, స్థానిక పరిశ్రమాభివృద్ధికి వినియోగించడంలేదు. మన ఖనిజసంపదను వినియోగించుకొని, ఆంధ్రదేశంలో బ్రహ్మాండమైన భారీపరిశ్రమలను నిర్మించుటకు ఎన్నో అవకాశా లున్నాయి.

# పరిశ్రమలు

సహజ సంపదలు అపారంగా ఉన్నా, ఆంధ్ర దేశంలో చెప్పుకోదగ్గ పరిశ్రమలేవీ అభివృద్ధి చేయబడలేదు. నెల్లూరు, విశాఖపట్నం జిల్లాలలో మైకా, మాంగనీసులు, కృష్ణాజిల్లాలో ముడిఇనుము విరివిగా త్రవ్వబడుతున్నా, వీటికి సంబంధించిన పరిశ్రమలేవీ అభివృద్ధి చెందలేదు. కనీసం ముడిసరుకుల శుభ్రపరచే యంత్రాగారాలయినా లేవు. భారతదేశంలోకల్లా హెచ్చు వర్జీనియా పొగాకు ఒక్క గుంటూరు జిల్లాలోనే పండుతున్నా ఇచ్చట మచ్చుకయినా ఒక్క సిగరెట్టు ఫ్యాక్టరీ లేదు. పొగాకు క్యూరింగ్, గ్రేడింగ్ షెడ్‌లే మనకున్న పొగాకు "పరిశ్రమ". మన పారిశ్రామిక దీనస్థితికి ఇట్టి ఉదాహరణల నెన్నయినా ఇవ్వవచ్చు.

1949 సం॥లో మద్రాసుప్రభుత్వం ప్రకటించిన లెక్కలప్రకారం ఆంధ్ర ప్రాంతంలో (11 జిల్లాల మూడుతాలూకాలకు మాత్రం) ఫ్యాక్టరీ చట్టంక్రిందకువచ్చే ఫ్యాక్టరీలు 1814 ఉన్నాయి. కాని 1949 సం॥ తర్వాత మద్రాసు రాష్ట్రంలోని మొత్తం ఫ్యాక్టరీలసంఖ్యను ప్రభుత్వంప్రకటిస్తూ వచ్చిందేకాని, జిల్లావారీ వివరాలను ప్రకటించలేదు. కనుక నేడు ఆంధ్రలోని మొత్తం ఫ్యాక్టరీలసంఖ్యను స్థూలంగా మాత్రమే లెక్కించడం సాధ్యం.

1949 సం॥ లో మొత్తం మద్రాసురాష్ట్రంలో ఉన్న ఫ్యాక్టరీల సంఖ్య 1951 వ సంవత్సరాంతానికి రెట్టింపుకు పెరిగింది. రాష్ట్రంఅంతటిలోనూ ఫ్యాక్టరీల సంఖ్య ఒకే ప్రమాణంలో పెరిగాయని అంచనావేస్తే ఆంధ్రలోని ఫ్యాక్టరీలసంఖ్య 1951 సం॥ ఆఖరుకు 36_37 వందలు ఉంటాయని భావించవచ్చు.

ఇక యీ ఫ్యాక్టరీలలోపనిచేసే మొత్తం కార్మికులసంఖ్యను నిర్ణయించడానికి మరింత "ఊహాగానం" చెయ్యవలసి వస్తున్నది. ప్రతిసంవత్సరం కార్మికసంస్థల పనిపాటలను ప్రభుత్వంచే ప్రకటించే రిపోర్టులలోగాని, మరొకచోటగాని జిల్లావారీగా గాని, పరిశ్రమ వరుసలోగాని కార్మికుల సంఖ్య ప్రకటింపబడలేదు. కనుక ఆంధ్ర రాష్ట్రంలోని మొత్తంకార్మికులసంఖ్య ఇంతని నేడుతేల్చిచెప్పడానికిఒకప్రమాణంలేదు.

1949 సం॥లో పరిశ్రమలవారీ మద్రాసు ప్రభుత్వం ప్రకటించిన ఫ్యాక్టరీల జాబితానుండి లెక్కలుతీస్తే ఆంధ్రజిల్లాలలో 68,500 మంది కార్మికులు ఫ్యాక్టరీ

ఆక్టుక్రిందకువచ్చే సంస్థలలో పనిచేస్తూ ఉన్నట్లు తేలింది. అప్పటి జాబితాలో ప్రకటించబడని కొన్ని ఫ్యాక్టరీలలోని కార్మికుల దిగుబాటును 32,000 గా ఎంచుకొన్నా, 1949 లో ఒక లక్షమంది ఆంధ్రలో ఫ్యాక్టరీ ఆక్టుక్రిందకు వచ్చే కార్మికులు ఉన్నట్లు స్థూలంగా భావించవచ్చు. 1949-'51 సం॥లో ఫ్యాక్టరీల సంఖ్య రెట్టింపుకు పెరిగింది. గనుక 1951 సం॥లో మనరాష్ట్రంలో షుమారు 2 లక్షలమంది పారిశ్రామిక కార్మికులు (Industrial labourers) ఉన్నట్లు భావించవచ్చు. అనగా మన జనాభాలోని ప్రతి 100 మందిలో ఒక్కరు మాత్రమే 1951 సం॥కు పారిశ్రామిక కార్మికుడుగా ఉన్నట్లు ఎంచవచ్చు.

మరొక అంచనాకు 1951 సం॥ జనాభా లెక్కలను తీసుకొని పరిశీలిద్దాం. ఈ జనాభా లెక్కలప్రకారం, 1951 సం॥లో ఆంధ్రజిల్లాలలో సుమారు 15 లక్షల మంది ఉద్యోగులుగా, కార్మికులుగా నమోదయ్యారు. వీరంతా ఫ్యాక్టరీ చట్టంక్రింద వచ్చే సంస్థలలో పనిచేసేవారు మాత్రంకారు. ప్రభుత్వ కార్యాలయాలలోని ఉద్యోగస్తులనుండి గ్రామాలలో వ్యక్తిగతంగా వ్యవసాయేతర వృత్తిపై జీవించేవారి వరకూ యీ చిత్తాలో మిళితమై ఉన్నారు.

పై జాబితాలోనుండి ప్రభుత్వ శాఖలలో పనిచేసేవారిని ఇతర వృత్తుల వారిని తీసివేసి పరిశ్రమగా అభివృద్ధిచెందిన శాఖలలో పనిచేయువారినే లెక్కించితే యీ బాపతు వారి సంఖ్య షుమారు ఎనిమిది లక్షలవరకూ తేలుతుంది. అయితే ఇందులోకూడ వ్యక్తిగతంగా ఆయావృత్తులపై ఆధారపడి జీవించేవారు లేకపోలేదు. ఉదాహరణకు 1951 జనాభా లెక్కల ప్రకారం 30,500 మంది కుట్టుపరిశ్రమపై జీవిస్తున్నట్లు అంచనా వేయబడింది. కాని యీ సంఖ్యలో నూటికి 80 వంతులవరకూ వ్యక్తిగతంగా కృషిచేసి జీవించేవారే. వారు ఏ ఫ్యాక్టరీక్రిందా పనిచేస్తున్నట్లురారు. కనుక యిదేలోపం 1951 సం॥ జనాభా లెక్కలలో ప్రతి పరిశ్రమలో పనిచేసే కార్మికులను ఎంచటంలోనూ ఉంటుంది.

ఇక మూడవ అంచనా - రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌వారిది. వీరివద్ద నిర్ణీతమైన, అధికారపూర్వక వివరాలులేవు. కాని ఆయా పరిశ్రమల్లో పనిచేసే కార్మికనాయకుల అంచనాలే వీరికి ఆధారం. వీరి లెక్కలప్రకారం 16 లక్షల 38 వేలమంది కార్మికులు ఉన్నట్లు తేలుతుంది. వీరిలో పదిలక్షలమంది గీత పనివారు, మూడులక్షలమంది చేనేత పారిశ్రామికులు, వీరిని వదలివేస్తే మిగిలిన మూడులక్షల, 38 వేలమంది కార్మికులు ఆంధ్రలోని వివిధపారిశ్రామిక సంస్థలలో పనిచేస్తూ ఉన్నట్లు ఎంచబడుతున్నది.

ఆంధ్రలోని పారిశ్రామిక కార్మికుల సంఖ్యపై అందరూ అంగీకరించే ఒక అంచనా లేకపోవడంచేత, పాఠకుల సౌలభ్యంకోసం ముఖ్యపరిశ్రమలలో పనిచేసే కార్మికుల సంఖ్యకు సంబంధించిన పై మూడు అంచనాలను తెలియజేసేపట్టిక యిచ్చుట పొందుపర్చబడింది.

## వివిధ పరిశ్రమలు - పనిచేసే కార్మికులు

| పరిశ్రమ పేరు | ఫ్యాక్టరీల సంఖ్య 1949 | పనిచేసే కార్మికులు | | |
|---|---|---|---|---|
| | | 1951 జనాభా అంకెలు | 1949 సం॥పు మద్రాసు ప్రభుత్వలెక్కలు | ట్రేడ్ యూనియన్ అంచనాలు |
| పంచదార ... | 8 | 3,125 | 3,624 | 7,500 |
| వేరుశనగ ... | 122 | — | 2,740 | — |
| పత్తి - దూది - నూలుమిల్లులు ... | 109 | — | 4,008 | — |
| రేవులు (Dock yards) ... | 3 | — | 420 | 2,400 |
| విద్యుత్ ఉత్పత్తి ... | 8 | 2,800 | 378 | 3,500 |
| లోహపరిశ్రమ ... | 77 | 21,800 | 2,538 | — |
| అల్యూమినం ... | 32 | — | 215 | — |
| బియ్యపు మరలు ... | 647 | — | 12,624 | — |
| పొగాకు ... | 72 | 15,700 | 18,336 | 1,25,000 |
| నిల్వ ఆహారాలు ... | 13 | 3,312 | 365 | — |
| హోటల్సు ... | 189 | 19,500 | 2,002 | — |
| రసాయన పరిశ్రమలు ... | 22 | 1,500 | 806 | — |
| వడ్రంగం కార్ఖానాలు ... | 35 | 10,325 | 727 | — |
| పింగాణీ పరిశ్రమ ... | 2 | — | 136 | — |
| బట్టలు - అల్లిక ... | 8 | *1,25,000 | 640 | *3,00,000 |
| జనపనార ... | 4 | 14,000 | 7,408 | 8,000 |
| ఇంజనీరింగు ... | 102 | 3,200 | 2,633 | 5,000 |
| పెట్రోలు కేంద్రాలు ... | 3 | 110 | 90 | — |
| కుట్టు పరిశ్రమ (Ready Made) | 25 | 30,500 | 454 | — |
| ముద్రణాలయాలు ... | 64 | 3,028 | 786 | 2,000 |
| నూనెమిల్లులు ... | 151 | — | 3,553 | — |
| తోళ్ళు ... | 54 | 30,600 | 1,438 | 10,000 |
| నౌకా నిర్మాణం ... | — | — | — | 3,700 |
| గనికార్మికులు ... | — | — | — | 70,000 |
| సిమెంటు ... | — | — | — | 2,500 |
| నూలుమిల్లులు ... | — | — | — | 3,500 |
| ప్రత్తి, నూనె, బియ్యం మిల్లులు ... | — | — | — | 20,000 |
| మోటారువర్కర్లు ... | — | — | — | 20,000 |
| మ్యునిసిపల్ కార్మికులు ... | — | — | — | 10,000 |
| కల్లుగీతవారు ... | — | — | — | 10,00,000 |
| పి. డబ్లియు. డి ... | — | — | — | 5,500 |
| పోర్టులు ... | — | — | — | 10,000 |
| రైల్వే ... | — | — | — | 30,000 |

* చేనేతకూడ కల్పబడ్డది.

విశాఖపట్నం జిల్లాలోని చిట్టివలస జూట్‌మిల్లు ఒక్కటే 2,750 మంది కార్మికులతో పనిచేస్తున్నది. ఇదే ఆంధ్రదేశంలోకల్ల పెద్దమిల్లు. 500 మంది కార్మికులకు పైబడిఉన్న ఫ్యాక్టరీలు ఆంధ్రదేశం మొత్తంపై లెక్కకు 24-25 దాటవు. అత్యధిక ఫ్యాక్టరీలలో 20 లోపు కార్మికులే పనిచేస్తున్నారు. మన ఫ్యాక్టరీలు సగటున ఒక్కొక్క ఫ్యాక్టరీ 38 మంది కార్మికులతో మాత్రమే పనిచేస్తున్నది. అపార సహజ సంపదలున్న ఆంధ్రదేశ పారిశ్రామిక స్థితి నేడు ఇది!

పొగాకు:

ఇతర పరిశ్రమలకన్న పొగాకు గ్రేడింగ్, క్యూరింగు పరిశ్రమలో ఎక్కువ మంది కార్మికులు పనిచేస్తున్నారు. ప్రశస్తమయిన పొగాకును ఉత్పత్తిచేసే ఆంధ్రదేశంలో రీడ్రైయింగు ఫ్యాక్టరీలు (Re-drying factories) మాత్రమే పదనాల్గు - పదిహేను కలవు. సిగరెట్టు ఫ్యాక్టరీల విషయం చెప్పవలసిన అవసరమేలేదు.

విదేశ వ్యాపారానికి అవసరమయిన గ్రేడింగ్ పనులే ప్రధానంగా ఈ కంపెనీలలో జరుగుతున్నాయి. చౌకగా ఇచ్చటనుండి విదేశాలకు కొనిపోబడిన పొగాకు అచ్చటనుండి సిగరెట్ల రూపంలో అమిత ఖరీదులతో మనదేశానికి దిగుమతి చేయబడుతున్నది.

ఆంధ్రదేశంలోని వర్జీనియా పొగాకు వ్యాపారమంతా ఐ. యల్. టి. డి. కంపెనీ చేతిలో వున్నదని చెప్పవచ్చును. బ్రిటిష్ ఇండియా టుబాకో కంపెనీ, నేషనల్ టుబాకో కంపెనీ అనే మరిరెండు బ్రిటిష్ కంపెనీలుకూడా వ్యాపారం చేస్తున్నా, మొత్తం వర్జీనియా వ్యాపారంలో 100 కి 90 పాళ్లు ఐ. యల్. టి. డి. చేతుల్లోనే వున్నది. పై కంపెనీలు మన పొగాకును విరివిగా కొని, విదేశాలకు ఎగుమతిచేయటమేగాక, బొంబాయి, కలకత్తా, మాంఘీరు, బెంగుళూరు, సికిందరాబాదు మొదలగు కేంద్రాలలో సిగరెట్ ఫ్యాక్టరీలను పెట్టి అచ్చటి ఉత్పత్తికి ఈ పొగాకును తీసుకొనిపోతున్నారు.

పంచదార పరిశ్రమ:

7,500 మంది కార్మికులతో పది పంచదార ఫ్యాక్టరీలు శ్రీకాకుళం, విశాఖ, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణాజిల్లాలలో ఉన్నవి. ఇవి దినానికి 4,000 టన్నుల (Crushing capacity) చెరకును గానుగాడగలవు. ఇవిగాక ప్రస్తుతం రెండు ఫ్యాక్టరీలు - కృష్ణాజిల్లాలో ఒకటి, చిత్తూరుజిల్లాలో ఒకటి నిర్మాణంలో ఉన్నవి. ఇవి దినమునకు సుమారు 1000 టన్నుల చెరుకును గానుగాడగలవు.

1950-'51 లెక్కలప్రకారం 95,860 ఎకరాలలో చెరకు పండించబడింది.

పై పది ఫ్యాక్టరీలలోనూ ఉయ్యూరు, విశాఖపట్నం పంచదారమిల్లులలోనే సారాయి (Power alcohal) ఉత్పత్తి చేయబడుతున్నది. (దీనిని పంచదార

పరిశ్రమలో లభించే చెరకు పిప్పి మున్నగువాటినుండి తయారుచేస్తారు. దీనిని యంత్రాలు నడపడానికి (Motor fuel) ఉపయోగిస్తారు.) సామర్లకోట ఫ్యాక్టరీలో చాకులెట్లు, పిప్పరమెంట్లు మొదలగునవి తయారుచేయబడుతున్నాయి.

మనరాష్ట్రంలో మనిషి ఒక్కంటికి సంవత్సరానికి సగటున 3.4 పౌనుల చక్కెర 11.3 పౌనుల బెల్లం ఉపయోగిస్తున్నారు. భారతదేశ చక్కెర వినియయం దామాషా 7.1 పౌనులు; బెల్లం 13.2 పౌనులు.

సామర్లకోట పంచదార ఫ్యాక్టరీ "ప్యారీ అండ్ కంపెనీ" అనే బ్రిటిష్ కంపెనీ వారిది.

సి మెం టు :

విజయవాడలోని ఆంధ్రసిమెంటుకంపెనీ, గుంటూరుజిల్లా మంగళగిరిలోని కృష్ణా సిమెంటు కంపెనీ – ఈ రెండే ఆంధ్రదేశంలో సిమెంటు ఫ్యాక్టరీలు. ఆంధ్ర సిమెంటు కంపెనీ సంవత్సరానికి లక్ష టన్నులు, కృష్ణా సిమెంటు కంపెనీ 80 వేల టన్నులు ఉత్పత్తి శక్తిని గలిగివున్నాయి. ఈ రెండు ఫ్యాక్టరీలలోను సుమారు రెండువేలమంది కార్మికులు పనిచేస్తున్నారు.

ఈ ఫ్యాక్టరీలకు అనుబంధంగా కృష్ణా, గుంటూరు జిల్లాల్లో సిమెంటు రాయి క్వారీలు పనిచేస్తున్నాయి. కృష్ణా సిమెంటు ఫ్యాక్టరీకి పిడుగురాళ్ళ, దగ్గలి, శీతారాంపురం మైన్సు, ఆంధ్రసిమెంట్ కంపెనీకి జగ్గయ్యపేట, నడికూడె క్వారీలు రాయి సప్లయి చేస్తున్నాయి.

పై రెండు ఫ్యాక్టరీలలో విజయవాడలోని ఆంధ్ర సిమెంటు కంపెనీ ఆంధ్ర పెట్టుబడితో, ఆంధ్రుల యాజమాన్యాన నడుస్తున్నది. కృష్ణా సిమెంటు కంపెనీ గుజరాతీ – మార్వాడీ పెట్టుబడితో నడుపబడుతున్న అసోసియేటెడ్ సిమెంటు కంపెనీ (ఈ కంపెనీ యాజమాన్యాన భారతదేశంలో మొత్తం 13 ఫ్యాక్టరీలు నడుపబడుతున్నాయి.) చేతుల్లో ఉన్నది.

జ న ప నా ర .

మనకున్న కొద్దిపాటి పరిశ్రమలలో జనపనారకూడా ఒకటి. ఉన్న నాలుగు మిల్లుల్లో రెండు విశాఖజిల్లాలోను, (చిట్టివలస, నెల్లిమర్లలలోను) మిగతా రెంటిలో ఒకటి పశ్చిమగోదావరిజిల్లా ఏలూరులోను, మరొకటి గుంటూరులోను ఉన్నవి.

పై నాలుగు ఫ్యాక్టరీలలో సుమారు 8,000 మంది కార్మికులు పని చేస్తున్నారు. నాలుగుమిల్లులలో మొత్తం 1,042 మగ్గాలు, 26,761 కదుళ్ళుఉన్నాయి.

విశాఖజిల్లాలోని నెల్లిమర్ల, చిట్టివలస ఫ్యాక్టరీలు విదేశీకంపెనీల (బ్రిటిష్) యాజమాన్యమున నడుపబడుతున్నాయి. మార్వాడీ గుజరాతి పెట్టుబడికింద గుంటూరు ఫ్యాక్టరీ పనిచేస్తున్నది.

ఈ నాలుగు మిల్లులలో చిట్టివలస, నెల్లిమర్ల జూట్‌మిల్లులు పెద్దవి. రాష్ట్రంలోని మొత్తం జూట్‌మిల్లు కార్మికులు 8,000 మందిలో 5,500 మంది కార్మికులు ఈ రెండు ఫ్యాక్టరీలలోనే పనిచేస్తున్నారు.

కాగితము :

మనకున్న కాగితపుమిల్లు ఒక్కటే ఒక్కటి. అది రాజమండ్రి ఆంధ్రా పేపరుమిల్లు.

దీనిని 1948 సంవత్సరంలో 25 లక్షలకు ప్రభుత్వం కొన్నది.

ఈ ఫ్యాక్టరీలో సుమారు 500 మంది కార్మికులు పనిచేస్తున్నారు. ఈమిల్లు దినమునకు 10 టన్నుల కాగితం ఉత్పత్తి చేయగలదు. బాదామీ కాగితము, కవరు పేపరు, రేపరుపేపరు, తెల్లకాగితము మున్నగు రకముల కాగితము ఇక్కడ తయారు చేయబడుతున్నది.

ఇచ్చట తయారయ్యే కాగితం ప్రధానంగా ప్రభుత్వఅవసరాలకు ఉపయోగించబడుతున్నది. 1949-50 సంవత్సరంలో మొత్తము 784 టన్నుల కాగితం (వివిధ రకాలది) తయారుచేయబడింది.

ఈ మిల్లుకు కావలసిన ముడిసరుకు గోదావరిఏజన్సీ అడవులనుండి సప్లయి చేయబడుతున్నది. గోనెసంచులు, పాతగుడ్డలు, చెత్తకాగితముకూడా ఉత్పత్తిలో వాడబడుచున్నవి.

డాక్‌యార్డులు - నౌకా పరిశ్రమలు

భారతదేశంలో ఉన్న ఒకేఒక నౌకా నిర్మాణకేంద్రం మన విశాఖపట్నంలో ఉన్నది. ఇచ్చట ప్రకృతి సిద్ధమయిన డాక్‌యార్డు వున్నది.

ఈ పరిశ్రమ ప్రథమంలో గుజరాతీ-మర్వాడీ పెట్టుబడితో ప్రారంభించబడింది. తరువాత కొంతకాలానికి ఈ కంపెనీలో సగం వాటాను కేంద్ర ప్రభుత్వం కొన్నది. భారతదేశంలో ఓడల నిర్మాణం ఈ ఒక్కచోటే జరుగుతున్నా, ఈ పరిశ్రమపై కేంద్ర ప్రభుత్వము చూపుతున్న నిర్లక్ష్య వైఖరి ఫలితంగా ఇది అభివృద్ధి చెందటంలేదు. కనీసం, భారతదేశ వ్యాపారానైనా, భారతదేశపు ఓడలే జరపాలనే నిబంధనల విధించకపోవుటచేత మన నౌకా పరిశ్రమ అభివృద్ధి చెందక, జరుగుతున్న సరుకు రవాణాలో అధిక భాగం బ్రిటిష్ ఓడల చేతనే చేయబడుతున్నది. దీని ఫలితంగా పరిశ్రమ అభివృద్ధిగాకపోగా, ఉన్న కార్మికులే పనినుండి తొలగించబడుతున్నారు.

ఈ కర్మాగారంలో 14 - 16 వేల టన్నుల ప్రమాణము గలిగిన ఓడలను నిర్మిస్తారు. 550 అడుగులు పొడవుగలిగిన ఓడలవరకు నిర్మించుటకు ఇచ్చట అవకాశాలున్నాయి.

ఈ పరిశ్రమ 3,750 మందికి పని కల్పిస్తున్నది. ఇందులో [illegible] నిపుణులయిన కార్మికులు.

విశాఖపట్నం హార్బరు మినహా ఆంధ్రదేశంలో అభివృద్ధి అయిన హార్బర్లు మరేవీ లేవు. హార్బరు వర్క్‌షాపులక్రింద 408 మంది కార్మికులు పనిచేస్తున్నారు. కాకినాడ హార్బరు వర్క్‌షాపులో 14 మంది కార్మికులు పనిచేస్తున్నారు.

సుదీర్ఘమయిన సముద్రతీరము, అభివృద్ధిచేయు వీలున్న అనేక మైనరు రేవులు (పోర్టులు) ఉన్నా, ప్రభుత్వ ఉదాసీనత ఫలితంగా రేవుల అభివృద్ధిగాని, నౌకా పరిశ్రమ అభివృద్ధిగాని జరగలేదు.

వనస్పతి - నూనెమిల్లులు :

ఆంధ్రదేశంలో నూనెగింజలు సమృద్ధిగా పండించ బడుతున్నాయి. మన అవసరాలు తీరగా మిగిలిన సరుకు ఇతరప్రదేశాలకు ఎగుమతిచేయ బడుతున్నది.

నూనె పరిశ్రమ తగినంతగా అభివృద్ధి చెందలేదు. రాష్ట్రం మొత్తంలో 8 మాత్రమే వనస్పతి ఫ్యాక్టరీలు ఉన్నవి. వీనిలో పేర్కొన తగినవి సీతానగరం, గుంటూరు, తాడేపల్లి, చిత్తూరు, కర్నూలు ఫ్యాక్టరీలు. పై ఐదు ఫ్యాక్టరీలు కలిసి, దినమునకు 80 - 90 టన్నుల వరకు వనస్పతిని ఉత్పత్తి చేయగలవు. ఇందులో కర్నూలులోని బిర్లా ఫ్యాక్టరీ ఒక్కటే (తుంగభద్రా ఇండస్ట్రీస్) రోజుకు 30 - 40 టన్నుల డాల్డాను ఉత్పత్తి చేయగలదు.

రాష్ట్రం మొత్తంమీద సుమారు 225 - 250 నూనె మిల్లులున్నాయి. వీనిలో దాదాపు 5,000 మంది కార్మికులు పని చేస్తున్నారు.

నూలు మిల్లులు :

మనకు పత్తి అదనంగా పండుతున్నా బట్టలపరిశ్రమ అభివృద్ధి కాలేదు. ఉన్న బట్టల నూలుమిల్లులు:— తూర్పుగోదావరిజిల్లాలోని పందలపాకలో రెండు, గుంటూరుజిల్లాలోని పెదకాకానిలో ఒకటి, చిత్తూరుజిల్లాలోని కాళహస్తిలో ఒకటి, బళ్ళారి ఆంధ్రప్రాంతంలోని ఆదోనిలో ఒకటి. గుంతకల్లులో ఒకనూలుమిల్లు నిర్మాణంలోఉన్నది. వీటి ఉత్పత్తిశక్తికూడా బహుస్వల్పం.

ఈ మిల్లులలో పందలపాక మిల్లులలోతప్ప గుడ్డ ఎచ్చటా ఉత్పత్తి చేయ బడటంలేదు. అచ్చటకూడ ముతక సరుకునే తయారు చేస్తున్నారు. తక్కినమిల్లు లన్నింటిలోనూ నూలుఉత్పత్తిమాత్రమే జరుగుతున్నది. మనకు కావలసినంత పత్తి పండుతున్నా యీ పరిశ్రమ అభివృద్ధిచెందకపోవుటచేత మన ముడిసరుకు యితర ప్రదేశాలకు ఎగుమతి చేయబడుతున్నది. తిరిగి బట్టగా తయారయి మనకు దిగుమతి చేయబడుతున్నది.

**ఖనిజ పరిశ్రమ :**

రాష్ట్రంలోని ఖనిజసంపదను వినియోగించుకొని పారిశ్రామికాభివృద్ధికి పూనుకోవాలనిగాక, ఉన్న ముడిసరుకును చౌకగా కొనిపోవాలనే ఆతురతతో కొన్ని ఖనిజాలు త్రవ్వటం నేడు ఆంధ్రలో జరుగుతున్నది. నెల్లూరుజిల్లాలోని మైకా; కృష్ణాజిల్లాలోని ముడి ఇనుము, క్రోమైటు; శ్రీకాకుళం జిల్లాలోని మాంగనీసు వీటిలో ముఖ్యమయినవి. ఇవిగాక కడప, కర్నూలు జిల్లాలలోకూడ బైరైటిస్, రాతినార మున్నగువాటి త్రవ్వకం కొనసాగుతున్నది.

ఈ గనులలో రాష్ట్రంమొత్తంపై 70 వేల మంది పనిచేస్తున్నట్లు ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ వారి అంచనా. ఈ గనులలోనుండి త్రవ్వే ముడి పదార్థం దాదాపు అంతా ఇంగ్లండు, అమెరికా, జపాను మొదలైన దేశాలకు ఎగుమతి చేయబడుతున్నది.

కృష్ణా – గుంటూరుజిల్లాలలో ముడిఇనుము నిల్వలు సమృద్ధిగా ఉన్నాయి. దీనికి సమీపంలోనే సింగరేణిలో బొగ్గుకూడ కావలసినంత ఉన్నది. ఇనుము, ఉక్కు పరిశ్రమను కావలసిన యీ ప్రధాన సదుపాయం ఇచ్చట ఉన్నా, ఇచ్చట యీ పరిశ్రమను అభివృద్ధి చేయాలనే ఆలోచనే మన పారిశ్రామికులకుగాని, ప్రభుత్వానికిగాని కన్పించడంలేదు.

మైకా, మాంగనీసు, క్రోమైటుల విషయంలోకూడ యింతే జరుగుతున్నది. తుంగభద్రా, మాచిఖండు హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజక్టుల నిర్మాణంతో పారిశ్రామికాభివృద్ధికి అనువైన విద్యుత్తుకూడ చౌకగా లభ్యమవుతుంది. ముడిసరుకు కొల్లలుగా ఉన్నది. కనుక నేడు ముడిసరుకునే ఆంధ్రనుండి విరివిగా ఎగుమతిచేయు ఖనిజాలతో పరిశ్రమను స్థాపించడానికి ప్రభుత్వం చర్యలుతీసుకొనుటల్లు పూనుబడడం అత్యవసరం. ఈ ప్రాథమిక పరిశ్రమలు అభివృద్ధి చెందనిది రాష్ట్రం ఎన్నడూ పారిశ్రామికంగా పురోగమించదు.

**శాస్త్రవస్తు రసాయన పరిశ్రమ :**

గత యుద్ధకాలంలో విదేశవస్తువుల దిగుమతులకు అవకాశములు సన్నగిల్లుటచేత రాష్ట్రంలో అచ్చటచ్చటా యీ పరిశ్రమ ప్రారంభింపబడ్డది.

ఆంధ్రులచే స్థాపింపబడి, నిర్వహింపబడ్డ శాస్త్ర వస్తు ఉత్పత్తిసంస్థలలో బందరులోని ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ ప్రధానమైనది. శాస్త్రవస్తువుల ఉత్పత్తిలో భారతదేశములోని ముఖ్యకంపెనీలలో యిదీ ఒకటిగా ఎంచబడింది. వివిధ రాష్ట్రాలకు వ్యాపారసంబంధాలు వ్యాపించాయి.

రాసాయనిక ఉత్పత్తి సంస్థలలో ఆంధ్ర ఫార్మస్యూటికల్ వర్కుస్, శ్రీ కాళీపట్నం కొండయ్యగారిచే స్థాపింపబడ్డ విజ్ఞానం ఇండస్ట్రీస్ ముఖ్యమైనవి. ప్రస్తుతం

# ఆంధ్రరాష్ట్రం

## పరిశ్రమలు

బళ్ళారిజిల్లా మొత్తం వివరాలు యివ్వబడ్డాయి
శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాల రెండింటి వివరాలు
కలిపి యివ్వబడ్డాయి.






### సూచిక

| | |
|---|---|
| బట్టలు, అల్లిక మిల్లులు | తోళ్ళపరిశ్రమ |
| కలప, రాయి పరిశ్రమ | రసాయన ,, |
| ఇంజనీరింగు పరిశ్రమ | సిమెంటు ,, |
| దూదిప్రెస్సింగ్ మిల్లులు | అగ్గిపెట్టెలు ,, |

యీ లైనుతో పై రెండు కంపెనీలు మూతబడి యే ఉన్నాయి. విజయవాడలోని 'సౌత్ ఇండియన్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్' నేడు ఆంధ్రులచే నిర్వహించబడే ప్రధాన రాసాయనిక ఉత్పత్తి కేంద్రంగా యెంచవచ్చు.

శాస్త్ర, రసాయన పరిశ్రమలవలెనే గత యుద్ధకాలంలో ఆంధ్రలో అనేకం చిన్న చిన్న ఇంజనీరింగు కార్ఖానాలు, తిను బండారాలను ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీలు (Con fectionary) మున్నగునవి ఉద్భవించినవి కాని యుద్ధానంతరం ప్రారంభమయిన విదేశవస్తువుల తీవ్రమైన పోటీకి యివి తట్టుకోలేక మూతపడ్డాయి. భారతప్రభుత్వం దేశీయపరిశ్రమను పోషించడానికి అవసరమైన చర్యలను తీసుకోనక విదేశ కంపెనీలకు తలొగ్గుటచేత, స్వదేశ పరిశ్రమలకు యీ దౌర్భాగ్యదశ పట్టింది. దీని ఫలితంగా పారిశ్రామికంగా వెనుకబడిన ప్రాంతాలు మరింత అధిక నష్టానికి గురి కావలసి వచ్చింది.

ఇవిగాక అచ్చటచ్చట చిన్నచిన్న ఫ్యాక్టరీలు, నిర్మింపబడ్డ పరిశ్రమలు ఉన్నవి. వీటిలో పేర్కొనవలసినది విజయవాడవద్దనున్న పోరంకిలోని వసంత్ సబ్బు ఫ్యాక్టరీ. ఇది విశాలాంధ్రలో కెల్ల పెద్ద సబ్బు ఫ్యాక్టరీయేగాక - శాస్త్రపద్ధతులపై సబ్బును ఉత్పత్తి చేయుచున్న ఒకే ఒక ఫ్యాక్టరీ.

ఇక మిగిలినవి నూనె మిల్లులు, బియ్యంమరలు, దూదిమిల్లులు మున్నగునవి. ఇవి ఆయా పంటల ఉత్పత్తిదృష్ట్యా రాష్ట్రమంతటా విరివిగా ఉన్నవి. కాని రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధికి ఇవి మాత్రం చిహ్నాలుకావు. కనుక మన సిరిసంపదలను వినియోగించుకొని భారీ పరిశ్రమలను రాష్ట్రంలో నిర్మించడానికి పాటుపడటం రాష్ట్ర శ్రేయోభిలాషులందరి కర్తవ్యం.

# గ్రామీణ పరిశ్రమలు

ఆంధ్రదేశం వ్యావసాయిక దేశం. పారిశ్రామికంగా అభివృద్ధిచెందని కారణంగా, 20వ శతాబ్దంలోకూడా ప్రజల నిత్యజీవితావసరాలు సప్లయి చెయ్యటంలో ఆంధ్ర గ్రామీణ పరిశ్రమలు అత్యంత ప్రధాన పాత్రను నిర్వహిస్తున్నాయి.

మన గ్రామీణ పరిశ్రమలలో కొన్ని చాల పురాతనమైనవేగాక, అంతర్జాతీయఖ్యాతిని పొందినవి. పురాతన గ్రీసు, రోము చక్రవర్తుల కాలంనుండి, పారిశ్రామిక విప్లవం తర్వాత మిల్లుబట్టల పరిశ్రమ అభివృద్ధి చెందేవరకూ, పాశ్చాత్యులను సమ్మోహితుల జేసిన భారత చేనేతవస్త్రాల ఉత్పత్తిలో, ఆంధ్ర చేనేతపరిశ్రమ ఒక భాగస్వామిని. నాగార్జునకొండ, అమరావతీశిల్పాలు ఆంధ్రదేశంలోనే మలచబడ్డాయి. ఇప్పటికీ పాశ్చాత్యులు ఎగసెత్తుకపోయే కొయ్యచెక్కడములు ఆంధ్రదేశంలోనే చేయబడుతున్నాయి. భారతదేశం అంతటా పేరుమోసిన 'కళంకారీ' అద్దకం ఆంధ్రపరిశ్రమే. ఈ విధంగా అనాదిగా అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన గ్రామీణపరిశ్రమలకు ఆంధ్రదేశం ఆటపట్టు.

కాని ఈ పరిశ్రమలు అభివృద్ధి చెందకపోగా, ఆదరించే నాథుడులేక, శిల్పపరిశ్రమవంటివి నశించిపోయాయి. మరికొన్ని యంత్రోత్పత్తి సరకులతో పోటీకి తట్టుకోలేక నశించిపోతున్నాయి. జాతీయ జీవనంలో ప్రధానమయిన మరికొన్ని పరిశ్రమలు (చేనేతపరిశ్రమ, లోహపరిశ్రమలవంటివి) ఈ ఆటుపోటులకు గురిఅవుతూ, మొండిగా బ్రతుకుతున్నాయి.

చేనేత, ఖాదీపరిశ్రమ, లోహపరిశ్రమ, గాజుపరిశ్రమ, పట్టుపరిశ్రమ, కాగితపు పరిశ్రమ, బీడీపరిశ్రమ, తోళ్ళపరిశ్రమ మొదలయినవి నేడు చెప్పుకోదగిన కొన్ని పరిశ్రమలు.

## చేనేత పరిశ్రమ:

చాల పురాతనమై, వ్యవసాయం తర్వాత అత్యధికులకు జీవనోపాధి కల్పిస్తున్న పెద్ద గ్రామీణ పరిశ్రమ. ఆంధ్ర జాతీయ జీవనంలో ఈ పరిశ్రమ అత్యంత ప్రధానస్థాన మాక్రమిస్తున్నది.

ఒక్క మగ్గముకూడా లేని గ్రామం ఆంధ్రదేశంలో లేదని చెప్పడం అతిశయోక్తి కాదు. 1947 లో డా॥ బి. వి. నారాయణస్వామినాయుడు సేకరించిన లెక్కల ప్రకారం వివిధజిల్లాలలో ఉన్న మగ్గాల సంఖ్యను పరిశీలించితే ఈ విషయం స్పష్టమవుతుంది.

| జిల్లా | | మగ్గాల సంఖ్య |
|---|---|---|
| 1, ఉభయ విశాఖలు | ... | 29,783 |
| 2. తూర్పు గోదావరి | ... | 18,900 |
| 3. పశ్చిమ గోదావరి | ... | 8,094 |
| 4. కృష్ణా | ... | 8,465 |
| 5. గుంటూరు | ... | 10,398 |
| 6. కర్నూలు | ... | 18,796 |
| 7. కడప | ... | 23,913 |
| 8. అనంతపురం | ... | 13,685 |
| 9. నెల్లూరు | ... | 18,667 |
| 10. చిత్తూరు | ... | 16,620 |
| 11. బళ్ళారి (జిల్లా మొత్తం) | ... | 19,496 |
| | మొత్తం | 1,86,817 |

యుద్ధానంతరం, నూలు సప్లయి స్థితి కొంచెం అభివృద్ధి చెందడంతో, వివిధ జిల్లాలోను మగ్గాల సంఖ్య పెరిగింది. అందుచేత ప్రస్తుతం ఉన్న మగ్గాలు సుమారు 2,30—2,40 వేల మధ్య ఉండవచ్చని అంచనా వేయబడుతున్నది. ఇవి, సంవత్సరానికి సుమారు 25 కోట్ల గజాల గుడ్డను ఉత్పత్తి చేస్తున్నాయి.

ప్రస్తుతము దాదాపు పరిశ్రమ అంతా కొద్దిమంది మాస్టరువీవర్ల చేతిలో ఉన్నది. వీరు నూలు సప్లయిచేస్తే కార్మికులు తమ స్వంతమగ్గాలమీద నేయవలసి ఉన్నది. ఆ నేసిన బట్టకు దాని అమ్మకంతో పనిలేకుండా మాస్టరువీవరు కూలి యిస్తాడు. సామాన్యంగా కార్మికులంతా బీదవారు కనుక నూలు కొనలేరు. కొన్నా, అది అమ్ముడుపోయేవరకూ డబ్బు ఆడదు కనుక భుక్తి గడువదు. అందుచేత సామాన్య కార్మికుడు పెట్టుబడి పెట్టలేని స్థితిలో ఉన్నాడు. కో-ఆపరేటివు సంస్థలు కార్మికులకు, పరిశ్రమకు లాభదాయకమైనప్పటికి నేడు అవి కార్మికుల నందరినీ సమీకరించి, పరిశ్రమనంతటిని నడుపగలిగిన స్థితిలో లేవు. కనుక చేనేతకార్మికుడు మాస్టరువీవర్లపై ఆధారపడక తప్పడంలేదు. గ్రామాల్లో పేదరైతు ఎలా వడ్డీవ్యాపారస్థుని కోరల్లో

చిక్కుకుంటున్నారో, అలాగే చేనేత కార్మికులుకూడా, అడ్వాన్సు యిచ్చే మాస్టరు వీవరు కోరల్లో చిక్కుకున్న ఫలితంగా పరిశ్రమ నూటికి 75 పాళ్ళు మాస్టరువీవర్ల చేతిలోనే ఉన్నది.

ఒక్కొక్క మగ్గముమీద సగటున 5 గురు జనాభా ఉన్న కుటుంబం ఆధారపడుతున్నట్లు డా॥ నారాయణస్వామినాయుడు అంచనా వేశారు. ఈ లెక్క ప్రకారం ఆంధ్రదేశంలో ఈ పరిశ్రమ సుమారు 10 లక్షలమందికి జీవనోపాధిగా ఉన్నది.

మన రాష్ట్రంలో 20-60 నంబర్ల నూలు సామాన్యంగా నేయబడుతున్నది. నూటికి 5-6 మగ్గాలు మాత్రమే ఇంతకుమించిన నంబర్ల నూలుతో నగిషీ గుడ్డలను నేస్తున్నాయి.

రాష్ట్రంలోని ప్రధాన చేనేత కేంద్రాలు :

విశాఖపట్నంజిల్లా అనకాపల్లి; శ్రీకాకుళంజిల్లా పొందూరు శ్రీకాకుళం, బొంతాం, కోమూరు, చీపురుపల్లి; తూర్పు గోదావరి జిల్లా మండపేట, రాజమండ్రి పెద్దాపురం, ఉప్పాడ, జగ్గంపేట; పశ్చిమగోదావరిజిల్లా; పాలకొల్లు, భీమవరం; కృష్ణా జిల్లా నందిగామ, విజయవాడ, పెడన, బందరు; గుంటూరుజిల్లా చీరాల, వేటపాలెం' మంగళగిరి, పేటేరు, ఫిరంగిపురం; బళ్ళారిజిల్లా ఆదోని, రాయదుర్గం; కర్నూలుజిల్లా కోడుమూరు, కర్నూలు, పత్తికొండ, నంద్యాల; కడపజిల్లా జమ్మలమడుగు, పుల్లంపేట, ప్రొద్దుటూరు, మాధవరం; నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డిపాలెం, యల్లాయపాలెం, వెంకటగిరి; అనంతపురంజిల్లా ఉరవకొండ, తాడిపత్రి, ధర్మవరం, పెనుగొండ, మడకసిర, పమ్మిగనూరు; చిత్తూరుజిల్లా గ్రేమ్సుపేట, కాళహస్తి, మదనపల్లి, తిరుపతి, నగరి, నారాయణవరం మొదలగునవి.

చీరలు, ధోవతులు, చొక్కాగుడ్డలు, తుండుగుడ్డలు ముఖ్యంగా నేయబడుతున్నాయి.

గుడ్డ అమ్మకం దేశీయ, విదేశీయ మార్కెట్లపై ఆధారపడి ఉన్నది. విదేశీ మార్కెట్టులో ముఖ్యంగా ఆగ్నేయఆసియా మార్కెట్టులో జపాను పోటీరావడం - ఇటు దేశంలో ప్రజల కొనుగోలుశక్తి తగ్గిపోవటం - దేశీయ మిల్లుగుడ్డతో పోటీచేయలేక పోవడంతో, చేనేతగుడ్డ అమ్మకాలు పూర్తిగా పడిపోయాయి. కొన్ని కోట్ల గజాల చేనేతవస్త్రాలు నిల్వ ఉండిపోయాయి. తత్ఫలితంగా చేనేతపరిశ్రమ, తీవ్ర సంక్షోభంలో పడి కొట్టుమిట్టాడుతున్నది. లక్షలాది కార్మికులు నిరుద్యోగులయ్యారు. వేరేపని దొరకక జీవనం గడువక కుటుంబపస్తులు చూడలేక అనేకమంది కార్మికులు కుటుంబాలను వదలివేసి కానని కంతలకు పోతున్నారు. కొందరు ఆత్మహత్యలకు కూడ పాల్పడుతున్నారు.

ఒకప్పుడు అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన మన ప్రధాన పరిశ్రమ — 10 లక్షల కార్మికులకు జీవనోపాధి కల్పించిన పరిశ్రమ — ప్రస్తుతం ఇట్టి దీనస్థితిలో ఉన్నది.

**నూలు వడకుట:**

నూలు వడకుట తీరిక కాలంలో బీద రైతులు, వ్యవసాయకూలీలు పనిచేసే పరిశ్రమ. పనిచేసేవారు దాదాపు అంతా స్త్రీలే.

ఈ పరిశ్రమ ముఖ్యంగా గుంటూరు, నెల్లూరు, కృష్ణా, కర్నూలు జిల్లాలలో ఉన్నది.

8-40 నంబర్ల వరకు నూలు తీయబడుతున్నది. విశాఖ జిల్లా కొండూరు లోను, శ్రీకాకుళంజిల్లా శ్రీకాకుళంలోను సగపీనూలు తీయబడుచున్నది.

దాదాపు సమసిపోయిన యీ పరిశ్రమ జాతీయ ఉద్యమ అభివృద్ధితో (విదేశ వస్తు బహిష్కరణ) మళ్ళీ ప్రాణం పోసుకున్నది. ఖాదీసంఘాలు పెట్టబడ్డాయి. తర్వాత వచ్చిన కాంగ్రెసు మంత్రివర్గాలు వీటికి ధనసహాయం కొద్దో గొప్పో చేస్తూవచ్చాయి.

దీనికి దేశీయమార్కెట్టే శరణ్యం. మిల్లు నూలుతో పోటీకి తట్టుకోలేక, అభివృద్ధి చెందలేదు. త్వరితగతిని ఈ పరిశ్రమ క్షీణించి పోతున్నది.

**అద్దకపు పరిశ్రమ:**

చేనేత పరిశ్రమతో పుట్టి అద్దకపు పరిశ్రమకూడా అభివృద్ధి చెందుతూ వచ్చింది. రసాయన రంగులు రాకపూర్వం, పరిశ్రమకు కావలసిన రంగులు రావటానికి, వివిధ దేశవాళీ రంగులను నిర్ణీతపాళ్ళలో కలపడంలో ప్రత్యేక నిపుణత కావలసి ఉండేది. అందుచేత ఇది కొన్ని కులాలవారికి వారసత్వ వృత్తిగా ఉంటూ వచ్చింది. రసాయన రంగులు వచ్చిన తర్వాత, ఈ అద్దకంపని చాల సులువు అయిపోయింది. పరిశ్రమ అభివృద్ధిస్థాయిని బట్టి అనేకమంది ఈ వృత్తిని అవలంబించ ప్రారంభించారు.

అద్దకం రెండు విధాలు: ఒకటి, చెక్క అచ్చులతో అద్దటం రెండవది; కుంచెతో రంగు వెయ్యటం, లేక కలాలతో రంగులు వెయ్యటం. దీనినే "కళంకారీ" అద్దకం అంటారు.

ఈ చెక్క అచ్చు అద్దకం పరిశ్రమ ప్రధానంగా కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో ఉన్నది. చేనేత పరిశ్రమవలె ఈ పరిశ్రమకూడా అడ్వాన్సులు ఇవ్వగలిగిన మాస్టరు వీవర్లు, వ్యాపారస్తుల చేతుల్లో ఉన్నది.

కొన్ని జిల్లాలలో (కృష్ణ, పశ్చిమ గోదావరి) పనివారు వ్యాపారస్తుల వద్దనుండి, అద్దకపు ఆర్డర్లు తెచ్చుకుంటారు. వ్యాపారస్తులు అద్దకమునకు గుడ్డ ఇచ్చి గజానికి ఇంత అని కూలి (రంగు ఖర్చుతో కలిపి) ఇస్తారు.

మదరాసు చేనేత సహకారసంఘం వారిచేత ఆంధ్రలో నిర్వహించబడుతున్న రెండు అద్దకపు ఫ్యాక్టరీలలో ఒకటి చీరాలలోను, రెండవది రాజమండ్రిలోను ఉన్నవి. ఇవి చేనేత సహకారసంస్థలలో పనిచేసే కార్మికులకు రంగునూలు సప్లయిచేస్తున్నవి.

అద్దకంరంగులు ఇంగ్లాండు, అమెరికాలనుండి దిగుమతిచేయబడుతున్నాయి. మనకు కావలసిన రంగులలో చాలభాగం ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ అనే బ్రిటిష్ సంస్థ సప్లయిచేస్తున్నది. వీరి ఏజంట్లు గ్రామాలలోని కార్మికులకు రంగులు సప్లయిచేస్తున్నారు. రంగుల అద్దకానికి కావలసిన (Hydrosulphite of soda) 'హైడ్రో సల్ఫైట్ సోడా' తప్ప మిగిలిన పదార్థాల్లో కొన్ని మెట్టూరు కెమికల్ ఇండస్ట్రీస్ సప్లయి చేస్తున్నది.

అద్దకపు పరిశ్రమకు పెద్ద పరికరాలు ఏవీ అవసరం లేదు. రంగు వేయవలసిన గుడ్డను ఉడకపెట్టడానికి, రంగు వెయ్యడానికి తొట్టె మాత్రం చాలు. అద్దకానికి కొయ్య అచ్చులు చాలు. ఇవి ఆయా ప్రదేశాలలో చేయబడుతున్నాయి.

మిల్లు అద్దకాలు వచ్చినతర్వాత అద్దకపు పరిశ్రమ గట్టి దెబ్బ తిన్నది.

రెండవది, స్వదేశీ రంగులతో చేసే "కలంకారీ" అద్దకపు వస్త్రాలు అనాదిగా అంతర్జాతీయ ఖ్యాతి గాంచినవి.

ఒకప్పుడు ఈ పరిశ్రమ ప్రధానంగా కృష్ణాజిల్లాలోని మచిలీపట్నంలో ఉండేది. ఇపుడు ఇది ఒక పరిశ్రమగా మాత్రం లేదు. కొన్ని కుటుంబాలవారు మాత్రం ఈ వృత్తితో పొట్ట పోసుకుంటున్నారు.

లేసు అల్లిక:

పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు, నర్సాపురం తాలూకాలలోను, తూర్పుగోదావరిజిల్లా దుమ్ముగూడెంలోను, కృష్ణాజిల్లాలో కొన్ని ప్రాంతాలలోను ఈ పరిశ్రమ ఉన్నది. ఒక్క గోదావరి జిల్లాలోనే ఈ పరిశ్రమలో సుమారు రెండువేలమంది పనిచేస్తున్నారు. పనిచేసేవారందరూ స్త్రీలే!

కొందరు వ్యాపారస్తులు "డైమండ్" దారాన్ని కొని లేసుఅల్లిస్తున్నారు. దీనితో ముఖ్యంగా టేబిల్‌క్లాత్ అంచులు, కిటికీలతెరలు, ఇత్యాదులు తయారుచేయబడుతున్నవి. ఇచ్చట తయారయిన సరుకు అంతా అమెరికా, ఇంగ్లండు, ఆస్ట్రేలియా దేశాలకు ఎగుమతి చేయబడుతున్నది.

ప్రస్తుతం అల్లిక వస్తువులకు, దేశీయ మార్కెట్టులో డిమాండు అధికమవుతున్నది.

పట్టు పరిశ్రమ:

ఒకప్పుడు ఆంధ్రదేశం ఈ పరిశ్రమకు ప్రసిద్ధి చెందినది. కాని, నేడు పట్టు పరిశ్రమ ఒకటి, రెండు కేంద్రాలలో తప్ప ఒక పరిశ్రమగా మాత్రం లేదు.

పశ్చిమగోదావరిజిల్లా నర్సాపురం, పాలకొల్లు తాలూకాలలో ఈ పరిశ్రమ ఒకప్పుడు చాలా ఉచ్ఛదశలో ఉన్నదట. నేడు అచ్చట ఈ పరిశ్రమ పూర్తిగా అంతరించిపోయింది.

కృష్ణాజిల్లా జగ్గయ్యపేట, షేక్ మహ్మదుపేటలలో ప్రస్తుతం నామ మాత్రంగా ఉన్న పరిశ్రమ, ఆదరించే నాథుడు లేక అంతరించే స్థితికి వచ్చింది.

రాష్ట్ర మంతటిలోను, తూర్పుగోదావరిజిల్లా రాజమండ్రి, పెద్దాపురం లలో మాత్రం ఈ పరిశ్రమ ఉన్నది. ఇచ్చట ఉత్పత్తి అంతా దేశీయ మార్కెట్టు లోనే అమ్మబడుతున్నది. వెయ్యిమంది కార్మికులు పనిచేసే పెద్దాపురం సిల్కు ఫ్యాక్టరీలో తయారైన సరుకు అమ్ముడుపోక, నిల్వ వుండిపోయిన కారణంగా ప్రస్తుతం (సెప్టెంబరు '63) మూసివేయబడినది.

ప్రభుత్వం శ్రద్ధవహిస్తే ఈ పరిశ్రమను అభివృద్ధిచేయడానికి ఎంతో అవకాశం ఉన్నది.

## ఉన్ని పరిశ్రమ :

ఉన్నితో కంబళ్ళు, తివాసీలు నేయబడుతున్నాయి.

కంబళ్ళు ముఖ్యంగా అనంతపురం, బళ్ళారి, కర్నూలు, కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలలో నేయబడుతున్నాయి. పశ్చిమగోదావరిలోని తాడేపల్లి గూడెం; బళ్ళారిజిల్లాలోని హార్పనపల్లి, రాయదుర్గం, ఇసకపల్లి కొన్ని ముఖ్య కేంద్రాలు.

దానికి కావలసిన ఉన్నిని ఆయా ప్రాంతాలలోని గొర్రెకాపరుల దగ్గిరే కొంటారు. ఒక్కొక్క గొర్రెనుండి ప్రతిసారి సుమారు 8-12 ఔన్సులు, సంవత్స రానికి సుమారు 4-6 పౌనులు ఉన్ని తీయబడుతున్నట్లు అంచనా వేయబడింది.

కంబళ్ళనేత చాల పురాతన పద్ధతులలో జరుగుచున్నది. ఇవి మొరటుగా ఉండుటవలన, ఇతరదేశాలలో వీటికి మార్కెట్టులేదు.

ఇందులో రెండవది, తివాసీల నేత. ఇవి ముఖ్యంగా పశ్చిమగోదావరిజిల్లా లోని ఏలూరు, తాడేపల్లిగూడెం ప్రాంతపు గ్రామాలలోను, కృష్ణాజిల్లాలోని మచిలీపట్నంలోను నేయబడుతున్నవి. ఈ పరిశ్రమ ఒక నిర్మాణపద్ధతిలో నడుపబడు తున్నది.

వీటి నేతకు కావలసిన ముడిసరుకు కొంతభాగం స్థానికంగా కొనబడు తున్నది. కాన్పూరు, అంబూరులనుండికూడ మేలురకమయిన ఉన్ని దిగుమతిచేయ బడుతున్నది.

ఇవి రకరకాల డిజైనులలో తయారు చేయబడుతున్నాయి. మొగల్-పర్షియన్ డిజైనులనుండి, 20వ శతాబ్దపు పాశ్చాత్యుల అభిరుచులకు నచ్చేడి డిజైనులవరకు తయారు చేయబడుతున్నాయి.

ఇవి చాలభాగం, అమెరికా, ఆస్ట్రేలియా దేశాలకు ఎగుమతి చేయబడుతున్నాయి.

పశ్చిమగోదావరిజిల్లా ఏలూరులోఉన్న కో-ఆపరేటివ్ సొసైటీ, ఒక మదరాసు కంపెనీద్వారా విదేశీ ఆర్డర్లు బుక్ చేసి, తివాసీలు సప్లయి చేస్తున్నది.

ఈ పరిశ్రమ ఒక్క పశ్చిమగోదావరి జిల్లాలోనే. సుమారు వెయ్యిమందికి జీవనోపాధి కల్పిస్తున్నది. ఈ జిల్లాలో సుమారు 400 మగ్గాలు, కృష్ణాలో 100 మగ్గాలు ఉన్నట్లు మదరాసు ప్రభుత్వ కాన్సల్టెంటు యస్. వి. కృష్ణస్వామి అంచనా వేశారు.

పీచు పరిశ్రమ :

ఆంధ్రదేశంలో కొబ్బరిపీచు, తాటిపీచు పరిశ్రమలు ఉన్నాయి.

కొబ్బరిపీచు పరిశ్రమ తూర్పుగోదావరి, శ్రీకాకుళం జిల్లాలలో వున్నది.

ఇచ్చట తీయబడిన పీచు దాదాపు అంతా దేశీయ (రాష్ట్ర) మార్కెట్టులోనే అమ్మబడుతున్నది.

ఈ పీచుతో వ్యవసాయానికీ, ఇతర గృహోపకరణాలకు కావలసిన తాళ్లు వేస్తారు.

చెప్పదగిన పీచు పరిశ్రమ తాటిపీచు పరిశ్రమ. తాటిపీచు పశ్చిమగోదావరి, విశాఖజిల్లాల్లో పెద్దయెత్తున తీయబడుతున్నది. తూర్పుగోదావరి జిల్లాలో కాకినాడ, పెద్దాపురం తాలూకాల్లో కొద్దిగా తీయబడుతున్నది.

ముడి తాటినారనే వ్యాపారస్థులకు అమ్ముతారు. ఈ వ్యాపారస్థులు విదేశాలకు ఎగుమతి చేసే కంపెనీలకు, ఏజంట్లకు అమ్ముతారు.

ఈ పీచును శుభ్రపరచి, చిక్కుతీసి, రంగు వేయటం పెద్దపరిశ్రమగా కాకినాడ, ఎలమంచిలి, అనకాపల్లి పట్నాలలో వున్నది. ఈ విధంగా శుభ్రపరచిన పీచులో చాల భాగం విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నది. ఎగుమతి అయ్యే పీచు అంతా కాకినాడ రేవునుండి పోతున్నది.

ఈ పీచుతో ఎట్టి వస్తు నిర్మాణంగాని ఇచ్చట జరగటంలేదు.

చేతి కాగితము : (Hand-made Paper)

చేతి కాగిత పరిశ్రమ మొగలు చక్రవర్తులకాలంనుండి 19వ శతాబ్దం వరకూ చాల ఉచ్ఛస్థాయిలో ఉండేది. చైనా వారినుండి కాగితము చేయుటను నేర్చు కొన్న మొగలు యాత్రీకులు దీనిని భారత దేశంలో ప్రవేశపెట్టారు.

ఈ పరిశ్రమ నంద్యాలలో ఒకప్పుడు చాలా అభివృద్ధి దశలో ఉండేది. ఇచ్చట గరుకుకాగితం (Rough Paper) చేయబడుతూ ఉండేది. బొంబాయినుండి మిల్లుమీద తయారయిన కాగితం దిగుమతి అయ్యేసరికి ఈ పరిశ్రమ అభివృద్ధి

వర్గాన్ని ఉండేది. మిల్లు కాగితంతో పోటీ చేయలేక క్రమంగా నశించిపోయి, సుమారు 30 సంవత్సరాలక్రితం అసలు నామరూపాలు లేకుండాపోయింది.

తర్వాత అఖిలభారత గ్రామీణ పరిశ్రమలసంఘం ఈ పరిశ్రమను పునరుద్ధరించే ఉద్దేశ్యముతో 1938 లో కొందరికి వార్ధాలో శిక్షణ యిచ్చింది. వారి శ్రామికాభిమానులు కొందరు వీరి సహాయంతో రాజమండ్రిలో ఈ పరిశ్రమను ప్రారంభించారు. ప్రభుత్వం 1940-'41 సంవత్సరంలో బళ్ళారిజిల్లాలోని ఆదోని, అనంతపురం జిల్లాలోని కృష్ణిపాడు, చిత్తూరుజిల్లా వెంకపల్లి విద్యాలయాలలో దీనిని (చేతికాగితం చేయటాన్ని) ఒక పాఠ్యభాగముగా ప్రవేశపెట్టారు.

విజయవాడ, కర్నూలుజిల్లా గాజులపల్లి, కడపజిల్లాలోని బుగ్గి - ఈప్రదేశాలలో కాగిత ఉత్పత్తి కేంద్రాలను తెరిచారు.

ప్రస్తుతం విజయనగరం, నందిగామ, చెన్నారామపాలెం, కడప, గుంటూరులోని చేతికాగిత కో-ఆపరేటివ్ సొసైటీలలో చేతి కాగితాన్ని తయారు చేస్తున్నారు.

కాగితం చేయుటకు వరిగడ్డి, వెదురు, చిత్తుకాగితం, పాత గోనెసంచులు, గుడ్డలు ఉపయోగించబడుతున్నవి.

ఈ కాగితం, మిల్లు కాగితంతో పోటీ చేయలేకపోవుటచేత అభివృద్ధి చెందటంలేదు.

## లోహ పరిశ్రమ:

కంచు, ఇత్తడి, రాగి, ప్రధానంగా మన లోహపరిశ్రమలో ఉపయోగించబడుతున్న లోహాలు.

వీటితో ప్రధానంగా పాత్రలు, చెంబులు, కంచాలు, గ్లాసులు, తదితర పాత్రలు చేయబడుతున్నాయి

ఇది ఒక గృహ పరిశ్రమగా దాదాపు రాష్ట్రమంతటా ఉన్నది. కొన్ని పట్టణాలలో చిన్న చిన్న కార్ఖానాల స్థాయిలోకూడా ఉన్నది. ఈ ప్రదేశాలు, ఆ ప్రాంతంలో అధికసంఖ్యలో గ్రామ ప్రజలు వస్తూపోతూఉండే పెద్ద పట్టణం కావడంవలననో, లేక యాత్రికులు వచ్చే పవిత్రస్థలాలు కావటంవలననో, డిమాండు అధికంగా ఉండటంచేత, పరిశ్రమకూడా పెద్దఎత్తున (కార్ఖానాల స్థాయిలో) కొనసాగించబడుతున్నది.

ఇట్టి కేంద్రాలలో ప్రధానమైనవి: చిత్తూరుజిల్లాలోని కాళహస్తి, నేత్రవాడ; కడపజిల్లాలోని వోనిపెంట; తూర్పుగోదావరి జిల్లాలోని రాజమండ్రి, ధవళేశ్వరం, సామర్లకోట, పెద్దాపురం; పశ్చిమగోదావరిజిల్లాలోని పెనుగొండ, పాలకొల్లు; కృష్ణాజిల్లాలోని రమణక్కపేట, మైలవరం, విజయవాడ; విశాఖజిల్లాలోని పార్వతీపురం, బొబ్బిలి, అనకాపల్లి మొదలగునవి.

ఈ కేంద్రాలలో పరిశ్రమ కొందరు షాహుకార్ల చేత నడుపబడుతున్నది. గ్రామసీమలలో కార్మికులే ప్రజలవద్ద లోహం తీసుకొని, కూలికి తమ ఇండ్లలోనే పాత్రసామగ్రి చేసిపెట్టడం జరుగుతున్నది.

ఒక్క చిత్తూరుజిల్లా కాళహస్తిలో మాత్రం ఫ్యాక్టరీ స్థాయిలో, యంత్ర సహాయంతో పరిశ్రమ కొనసాగించబడుతున్నది.

వడ్రంగము (కొయ్య చెక్కడము):

గుంటూరు, కృష్ణాజిల్లాలలో కొయ్య చెక్కడపు పనులు విస్తారంగా జరుగుతున్నాయి రాజమండ్రి, గుంటూరు, బెజవాడవంటి పట్టణాలలో కుర్చీలు, బల్లలు (Furniture) ఇత్యాదులు తయారుచేసే కార్ఖానాలు ఉన్నాయి.

నరసరావుపేట (గుంటూరుజిల్లా)లో చేసే (Camp furniture) మడత మంచాలు, మడతకుర్చీలు చాల ప్రసిద్ధిచెందాయి. వీటికి మదరాసు, హైదరాబాదు, రాయలసీమ జిల్లాలలో మంచి డిమాండు ఉన్నది.

ఇవిగాక ప్రతి గ్రామంలోను వ్యవసాయపు పనిముట్లు చేసే చెక్కడపు పనులు జరుగుతున్నాయి. ఇది కొన్ని కులాలవారి నాగసత్వ వృత్తిగా అనాదినుండి ఉంటూ వస్తున్నది. వీరు వస్తువులను అమ్మకంకొరకని ముందుగా చేయక, తమ ఆసాములాల ఆర్డర్లనుబట్టి, వారు ఖర్చులు ఇస్తే పనిముట్లు తయారు చేస్తున్నారు. ఈ విధంగా కుటీర పరిశ్రమగా, వడ్రంగం ప్రతి గ్రామంలోను ఉన్నది.

ఎండ్లబండ్లు, టాంగాలు, గుర్రపుబండ్లు చేయడంలో అనంతపురంజిల్లా ధర్మవరం పేరుమోసినది.

దువ్వెనల పరిశ్రమ:

చిత్తూరుజిల్లా కాళహస్తి తాలూకాలోని కొత్తపేట, వాయలపాడు తాలూకాలోని నేరబైలులలో దువ్వెనల తయారీ జరుగుతున్నది. సంవత్సరంలో ఇచ్చట 10 వేల రూపాయల విలువగలిగిన దువ్వెనలు తయారు అవుతున్నట్లు అంచనా వేయబడుతున్నది.

పేము అల్లికము:

నెల్లూరు జిల్లాలోని ఇందుకూరుపేటలోను, తూర్పుగోదావరి జిల్లాలోని రాజమండ్రిలోను ఈ పరిశ్రమ పెద్దఎత్తున కొనసాగించబడుతున్నది. గుంటూరు, వరి, విశాఖపట్నం జిల్లాలలోకూడ కుటీరపరిశ్రమగా ఉన్నది.

దీనికి కావలసిన పేము నెల్లూరుజిల్లా ఇందుకూరుపేటనుండీ, నర్సీపట్నం ఏజన్సీలోని పెద్దవలస, పర్లాకిమిడి ప్రాంతంనుండి, గుంటూరుజిల్లాలోని చీరాలప్రాంతం నుండి సప్లయిచేయబడుతున్నది.

ఈ పేము, 'మలక్కా' పేమంత మెత్తదనం, మెరుగు కలిగివుండదు. అందుచేత, నగిషీ పనులకు 'మలక్కా' పేము దిగుమతి చేయబడుతున్నది.

పేముతో కుర్చీలు, ఉయ్యాలలు, బుట్టలు మున్నగునవి చేయబడుతున్నవి. ఇవి స్థానిక అవసరాలకే వినియోగపడుతున్నాయి.

రాతి చిప్పలు :

ఆంధ్రదేశంలో, 'స్టీటైట్' ఖనిజానికి సంబంధించిన సబ్బురాయి (Soap stone) తో రాతి చిప్పలవంటి పాత్రలు, విగ్రహాలు, ఆట వస్తువులు, సిరాబుడ్లు, నశ్యపుకాయలు చేయబడుతున్నాయి

ఈ పరిశ్రమ నెల్లూరు జిల్లా రాపూరు తాలూకాలోని సైదాపేట, గుంటూరు జిల్లా వినుకొండ తాలూకాలోని కొప్పుకొండ, పల్నాడు తాలూకాలోని దుర్గి గ్రామాలలో ఉన్నది.

ఇవి మట్టి పాత్రలవలె పగిలిపోవు గనుకను, ఇత్తడి, రాగి పాత్రలవలె కిలుమెక్కవు గనుకను, వీటికంటె చౌక గనుకనూ, ఈ పాత్రలకు డిమాండు అధికంగా ఉంది.

గాజుల పరిశ్రమ :

పూర్వం ఈ పరిశ్రమ అనంతపురం, కర్నూలు, బళ్ళారి, నెల్లూరు, చిత్తూరు, కృష్ణా, విశాఖపట్నం జిల్లాలలో ఉచ్ఛదశలో ఉండేది. ఆ కాలంలో అనంతపురంజిల్లా గుత్తూరు (దానినే గాజుల గుత్తూరు అనికూడా పిలుస్తారు) గ్రామంలోనే 700 మంది ఈ పరిశ్రమలో పనిచేసేవారట. కాని యిప్పుడు ఒక్క కుటుంబంవారు మాత్రమే ఈ పని చేస్తున్నారు.

విశాఖపట్నం, చిత్తూరు జిల్లాలలో ఈ పరిశ్రమ తుడుచుకుపోకుండా అలాగేఉంది. విశాఖపట్నంలో సుమారు 40 కుటుంబాలవారు, సంవత్సరానికి పదివేల రూపాయల ఖరీదుచేసే గాజులు తయారుచేస్తున్నట్లు అంచనా వేయబడింది.

చిత్తూరుజిల్లాలో కాళహస్తి, పాపానాయుడుపేట, మద్దిలేడు, పిల్లమిాడు ఈ పరిశ్రమకు ప్రధాన కేంద్రాలు.

ఇచ్చట సాదాగాజులు చేయబడుతున్నాయి. విశాఖజిల్లాలో తయారయిన గాజులు ఆ జిల్లాలోనే అమ్మబడుతూంటే, చిత్తూరు జిల్లాలో చేయబడిన గాజులు, ఇతర జిల్లాలకు కూడా ఎగుమతి చేయబడుతున్నాయి.

ఈ పరిశ్రమకు కావలసిన ముడిపదార్థం (Black glass) విశాఖజిల్లా, కొంత చిత్తూరుజిల్లా కాళహస్తినుండి, మరికొంత యితర రాష్ట్రాలనుండి తెప్పించుకుంటున్నది. చిత్తూరుజిల్లామాత్రం ఆ జిల్లాలో దొరికే ముడిపదార్థాన్నే వాడుకొంటున్నది.

నగిషీగాజుల దిగుమతి మూలంగా ఈ మన గాజులపరిశ్రమ అభివృద్ధి గాకపోగా, దినదినం కృంగిపోతున్నది. జనాభాలో అత్యధిక సంఖ్యాకులయిన బీద తరగతి ప్రజలు, హెచ్చుధరలిచ్చి ఆ నగిషీగాజులు కొనలేకనుక ఈ పరిశ్రమ నమసిపోలేదు.

గాజు (glass) పరిశ్రమకు అవసరమయిన 'సోడు' మన్ను అనంతపురం, కర్నూలు జిల్లాలలో విపరీతంగా దొరుకుతున్నా, మనకు ఒక్క గాజుఫ్యాక్టరీ కూడా లేదు. గాజు పరిశ్రమ అభివృద్ధిచెందితే, గాజుల తయారీకి కావలసిన గాజును సప్లయి చేసే అవకాశం ఉంటుంది. అపుడు దిగుమతి అయిన 'నగిషీ' గాజులతో పోటీచేసి నిల్వగలిగిన స్థితి, మన గాజుల పరిశ్రమకు చేకూరుతుంది.

మూసల పరిశ్రమ :

లోహాలను కరగుటకు మూస లవసరం. మనకు కావలసిన మూసలలో చాలభాగం విదేశాలనుండే దిగుమతి చేసుకుంటున్నాం.

తూర్పు గోదావరి జిల్లాలోని రాజమండ్రి, ధవళేశ్వరం, అంగర, గొల్ల మందాడ, కాకినాడ, తాపేశ్వరం పట్నాలలో మూసలు చేయబడుతున్నాయి. ఆంధ్రలో మరెచ్చటా ఈ పరిశ్రమ లేదు.

వేడికి తట్టుకోగలగడంలో, విదేశీ మూసలకు ఇవి ఏవిధంగాను తీసిపోవు. కాని విదేశీ మూసలు వాడగలిగినన్నిసార్లు వీటిని వాడటానికి వీలులేదు. మూసలు చెయ్యటంలో ఇంకా కొంత అభివృద్ధి అవసరం.

మూసలు చేయుటకు కావలసిన 'గ్రాఫైటు' పశ్చిమగోదావరిజిల్లాలోని జంగారెడ్డిగూడెంలో (ఇది రాజమండ్రికి 50 మైళ్ళు) దొరుకుతున్నది. ఈ ప్రాంతంలో యీ ఖనిజపు గనులు ఇంకా ఉన్నాయి.

ఈ పరిశ్రమను అభివృద్ధి చేసేందుకు కావలసిన అవకాశాలన్నీ మన కున్నాయి.

తోళ్ళ పరిశ్రమ :

తోళ్ళ పరిశ్రమ (ఊనటం) వ్యవసాయంవలె చాల పురాతనమైనది. చేనేత తర్వాత, చెప్పుకోతగ్గ పెద్ద పరిశ్రమ విశాఖపట్నం, పశ్చిమ గోదావరి, అనంతపురం, బళ్ళారి, కృష్ణాజిల్లాలో యీ పరిశ్రమ ఉన్నది. ఈ పరిశ్రమలో పని చేసేవారు అధికంగా హరిజనులు, ముస్లింలు.

ఆంధ్రదేశంలో తోళ్ళు ఎక్కువగా దొరికినా, ఆ తోళ్ళను ఊనుటకు కావలసిన అధునాతన యంత్రాగారం ఒక్కటయినా లేదు. ఇంకా, తంగేడు ఇత్యాది చెట్లబెరడులు తోళ్ళు ఊనటానికి ఉపయోగించబడుతున్నాయి.

ఊనిన తోళ్ళలో చాల భాగం రాష్ట్రంలో వినిమయ మవుతున్నాయి. మేలురకంమాత్రం మద్రాసు, తదితర ప్రాంతాలకు ఎగుమతి చేయబడుతున్నవి.

మొత్తం ఎగుమతిఅయ్యే తోళ్ళలో చాలభాగం, ఇంగ్లండుకు ఎగుమతి అవుతున్నాయి.

బెజవాడ, గుంటూరు, ఏలూరులలోమాత్రం చెప్పులు, బూట్లు మనీ పర్సులు ఇత్యాది తోలు వస్తువులు చేయబడుతున్నాయి.

తోళ్ళు అధికంగా లభ్యమయ్యే ఆంధ్రదేశంలో తోళ్ళపరిశ్రమను అభివృద్ధిచేయగల అవకాశం ఉన్నదని చెప్పనవసరంలేదు.

ఉప్పు పరిశ్రమ:

శ్రీకాకుళంజిల్లాలోని నౌపడా, పూండి, కళింగపట్నం; నెల్లూరుజిల్లాలోని తడ, కృష్ణాపట్నం, ఇస్కపల్లి, పాకాల మొదలయిన కేంద్రాలలో ఈపరిశ్రమ పెద్ద ఎత్తున కొనసాగించబడుతున్నది.

ఒక్క నౌపడా కేంద్రంలోనే సగటున సాలుకు 20 లక్షల టన్నులు ఉత్పత్తి చేయబడుతున్నట్లు అంచనా వేయబడుతున్నది.

ఉత్పత్తిలో అధికభాగం రాష్ట్రం వినిమయానికే ఉపయోగపడుతున్నది. ఉత్తరప్రదేశ్, ఒరిస్సాలకు కొద్దిగా ఎగుమతి చేయబడుతున్నది.

ఆటవస్తువులు:

ఆంధ్రదేశంలో ఆటవస్తువులు మట్టితోను, తేలిక చక్కతోను తయారు చేయబడుతున్నాయి. ప్రశస్తమయిన ఆటవస్తువులు,బొమ్మలు కృష్ణాజిల్లాలోని కొండపల్లి, చిత్తూరుజిల్లాలోని తిరుచానూరు, విశాఖజిల్లాలోని ఏటికొప్పాక, కడపజిల్లాలోని సెట్టిగుంట దగ్గరలోనున్న లక్ష్మిగారిపల్లిలో చేయబడుతున్నాయి.

కొండపల్లి బొమ్మలు చేయుటకు "తెల్లపొకిలి" కర్ర ఉపయోగించబడుతున్నది. ఏటికొప్పాకలో "అంకుడు" కర్ర ఉపయోగించబడుతున్నది.

పిల్లలు ఎపుడూ బొమ్మలు కొంటూఉంటారు కనుక, వీటికి సంవత్సరం పొడుగునా అమ్మకాలు ఉంటాయి. తిరుణాలలో, పండగరోజులలో వీటి ఖర్చు విపరీతం. దేశ విఖ్యాతిగాంచిన కొండపల్లి బొమ్మలు బెంగాలు, పంజాబు, మధ్యప్రదేశ్ లలోకూడా విరివిగా అమ్మబడుతాయి.

కొమ్ము చెక్కడములు:

ఈ పరిశ్రమ ఒక్క విశాఖజిల్లాలో మాత్రమే ఉన్నది.

ఇచ్చట ఫొటో ఫ్రేములు, నగిషీ చెక్కడములు, వివిధ దేవతాప్రతిమలు, పక్షులు, జంతువుల ప్రతిరూపాలు, చెస్ బోర్డులు, పుస్తకాల కేసులు, వాచ్ కేసులు, సిగరెట్ కేసులు, ఇత్యాదులు చేయబడుతున్నాయి.

ఇందుకు ఉపయోగించే సామాను దంతం, జింకకొమ్ము, తాబేలు చిప్పలు, గంధపుచెక్క, మచ్చికొమ్ములూ.

ఈ చెక్కడములు ధరలు అధికమగుటచేత ఖర్చు చాల తక్కువ. ఆదరించే దిక్కు క్రమంగా తగ్గిపోతున్నది కనుక పరిశ్రమే అంతరించే ప్రమాదం లేకపోలేదు.

బీడీలు - చుట్టలు :

ఈ పరిశ్రమ ముఖ్యంగా కర్నూలు, చిత్తూరు, బళ్ళారి జిల్లాలలోను, పశ్చిమగోదావరి జిల్లా ఏలూరులోను ఉన్నది. దీనికి కావలసిన పొగాకు ఆయా ప్రాంతాలలో పండించబడుతున్నది. ఈ పరిశ్రమ సుమారు 20_25 వేల మందికి పని కల్పిస్తున్నది. బీడీలు_చుట్టలు పూర్తిగా చేతితోనే (ఎట్టియంత్రసాయం లేకనే) చేయబడుతున్నవి. ఈ పరిశ్రమలో పనిచేసేకార్మికులలో నూటికి 38_40 మంది 6_16 సంవత్సరాల పసివారు. ఏ ఇతర పరిశ్రమలోను ఇంతమంది (ఈదామాషాలో) పిల్లలు పనిచేయడంలేదు. పొగాకు పండించడంలో ప్రథమస్థానాన్ని వహిస్తున్న ఆంధ్ర దేశంలో ఉన్న పొగాకు పరిశ్రమ ఇది !

పలకల పరిశ్రమ :

ఇది కర్నూలుజిల్లా కంభం, మార్కాపురంలలో సాగించబడుతున్నది. పలకలను ఉపయోగించే పదార్థమే బలపాలు చేయడానికి కూడా ఉపయోగిస్తారు కనుక, పలకలు చెయ్యటంతోపాటు బలపాలుచేయడంకూడా జరుగుతున్నది. పైగా ఇచ్చట దొరికే రాయి, బలపాలు చేయుటకు శ్రేష్ఠమయినది.

గని యజమానివద్ద కార్మికులు రాయి కొని బలపాలు చేస్తారు. సామాన్యంగా, కార్మికులంతా తమ ఇండ్లలోనే పని చేస్తూ ఉంటారు. తాము తయారుచేసిన సరుకు అంతా తమకే అమ్మాలనే షరతుతో, షావుకార్లవద్ద అడ్వాన్సులుకూడ తీసుకోవడం కద్దు. ఈ పరిశ్రమలో పనిచేసే కార్మికులంతా వెనుకబడిన తరగతులకు చెందినవారు.

షావుకారు, కొన్ని బలపాలకు రంగుకాగితం అంటించి ఐదువేల చొప్పున పెట్టెల్లో పెట్టి, ఎగుమతిచేస్తాడు. ఈ విధంగా 1943 లో రు. 76,128 లు విలువగల 6,844 పెట్టెలు, 1944లో రు. 63,072 లు విలువగల 5,256 పెట్టెలు ఎగుమతి చేశారు. శ్రేష్ఠమైన పలకరాయి మనకు విశేషంగా లభించుతున్నా దీనిని పారిశ్రామిక పద్ధతులలో నవీన యంత్రాలను వినియోగించి ఒక పరిశ్రమగా అభివృద్ధిచేయుటకు ఏ చర్యలూ తీసుకోనబడలేదు.

ఆంధ్రలో చెప్పుకోతగ్గ భారీ పరిశ్రమలు లేకపోగా, అనేకమంది ప్రజలకు జీవనాధారాలయిన గ్రామీణపరిశ్రమలు సమసిపోయినవిపోగా, ఉన్నవి అదేదోవలో ఉన్నాయి. వీటి పునరుద్ధరణకు పూనుకోవలసిన అవసరాన్ని వేరే నొక్కిచెప్ప పనిలేదు.

# విద్యుచ్ఛక్తి

ఆంధ్ర దేశం విద్యుదుత్పత్తిలోను, వాడకంలోను వెనుకపడి ఉన్నది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన అమెరికా, స్విట్జర్లండ్, సోవియట్ యూనియన్ వంటి దేశాలకంటె మాత్రమే కాదు, తోటి తమిళ దేశంకంటె కూడా ఎంతో వెనుకబడి ఉన్నది. జలవసతులు అపారంగా ఉన్నా, ఒక్క జల విద్యుదుత్పత్తి కేంద్రం ( Hydro - electric system ) కూడా మనకు లేదంటే, విద్యుదుత్పత్తిలో మన రాష్ట్రం ఎంతగా వెనుకపడి ఉన్నదో విశదమవుతుంది.

ప్రస్తుతం ఆంధ్రలోని 16 విద్యుదుత్పత్తి స్టేషన్లలో 3 స్టీమ్‌తోను (నీటి యావిరి) 13 డీసెల్ ఇంజన్లతోను నడుపబడుతున్నాయి. ఇవి పరిపాలనా సౌలభ్యం కోసం, రెండు గ్రూపులుగా విభజించబడ్డాయి. మొదటిగ్రూపు ఆంధ్ర పవరుసిస్టం, రెండవగ్రూపు రాయలసీమ పవరుసిస్టం.

ఆంధ్ర పవరుసిస్టంక్రింద ఈదిగువ థర్మల్ స్టేషన్లు ఉన్నాయి: విశాఖపట్నం, విజయవాడ (ఈరెండు స్టీమ్ థర్మల్ స్టేషన్లు),కాకినాడ, నరసారావుపేట, శ్రీకాకుళం, రాజమండ్రి, ఒంగోలు.

రాయలసీమ పవరుసిస్టంక్రింద ఈ దిగువ థర్మల్ స్టేషన్లు ఉన్నాయి: నెల్లూరు (స్టీముథర్మల్ స్టేషను), కర్నూలు, అనంతపురం, ప్రొద్దుటూరు, కడప, నంద్యాల, సొండూరు, తాడిపత్రి. మైసూరునుండి కొన్న జలవిద్యుత్‌ను పంచే స్టేషన్లు రెండు: ఒకటి బళ్ళారిజిల్లాలోని కేంద్రం. ఇది జాగ్ పవర్ స్కీమునుండి కొన్న పవరును పంచుతుంది. రెండవది: అనంతపురంజిల్లా హిందూపురంకేంద్రం. ఇది శివసముద్రం స్కీమునుండి కొన్న పవరును పంచుతుంది.

1951-'52 సంవత్సరంలో ఈ రెండు సిస్టంలక్రింద ఉన్న విద్యుత్ ప్రవాహపు లైనులపొడవు ఈవిధంగా ఉన్నది:

| స్టేషను పేరు | హైటెన్షన్ లైనులు మైళ్ళలో | లోటెన్షన్ లైనులు మైళ్ళలో | మొత్తం పొడవు మైళ్ళలో |
|---|---|---|---|
| ఆంధ్రా పవరు సిస్టం | 336 | 454 | 1,290 |
| రాయలసీమ పవరుసిస్టం | 318 | 333 | 651 |
| మొత్తం పొడవు | 1.154 | 787 | 1,941 |

ఈరెండుసిస్టంల క్రింద పనిచేసే థర్మల్ స్టేషన్ల ఉత్పత్తిశక్తి, అవి 1951-'52 లో చేసిన ఉత్పత్తి ప్రక్కపేజీలోని పట్టీలో ఉదహరించబడింది.

ఈ పవరు స్టేషన్ల ఉత్పాదకశక్తి (Generating Capacity) 1951-'52లో 32,177 కిలోవాట్లయితే డిమాండు 19,793 కిలోవాట్లున్నది.

ఆంధ్ర దేశంలోని పవరు స్టేషన్లు అన్నీ కలసి, 1952-'53 లో, 769.20 లక్షల యూనిట్ల విద్యుత్తును ఉత్పత్తి చేశాయి. ఇది చాలక, గత కొన్ని సంవత్సరాలుగా కొంటున్నట్లే, మైసూరులోని జాగ్ జలవిద్యుత్ కేంద్రంనుంచి, శివసముద్రం జలవిద్యుత్ కేంద్రంనుండి, ఇదే సంవత్సరంలో 103 16 లక్షల యూనిట్ల విద్యుత్తు కొనబడింది. అంటే, ఆంధ్ర దేశ వినిమయం నిమిత్తం, మొత్తం 872.36 లక్షల యూనిట్ల విద్యుత్తు సప్లయి చేయబడింది.

రాష్ట్రంలోని థర్మలు స్టేషన్లు అన్నీ చేసే ఉత్పత్తిలో, పవరు థర్మల్ స్టేషన్లు నూటికి సుమారు 93 పాళ్ళు, డీసిల్ స్టేషన్లు 7 పాళ్ళు ఉత్పత్తి చేస్తున్నాయి. రాష్ట్రపు మొత్తం ఉత్పత్తిలో ఒక్క బెజవాడ, విశాఖపట్నం థర్మలు స్టేషనులే నూటికి 87 పాళ్ళు ఉత్పత్తి చేస్తున్నాయి. మిగిలిన 13 స్టేషన్లు ఉత్పత్తి చేసేది 13 పాళ్ళు మాత్రమే! ఒక్క విజయవాడ స్టేషనే నూటికి 62 పాళ్ళు ఉత్పత్తి చేస్తున్నది.

మొత్తం రాష్ట్రం వినిమయంలో, సుమారు ఎనిమిదవవంతు(13.3%)పవరును బైటినుండి కొంటున్నామంటే, విద్యుదుత్పత్తిలో మనం ఎంత వెనుకబడి ఉన్నామో అవగత మవుతుంది.

1951-'52 సం॥లో మన రాష్ట్రంకంటె, పరిశిష్ట మదరాసురాష్ట్రం పదమూడురెట్ల యూనిట్ల (72,99,70 వేలు) విద్యుత్తును ఉత్పత్తి చేస్తున్నది. అంటే తోటిరాష్ట్రంలో తల 1 కి సగటున సుమారు 24 యూనిట్లు ఉత్పత్తి చేయబడుతూంటే, ఆంధ్రలో తల 1 కి సగటున 2.7 యూనిట్లే ఉత్పత్తి చేయబడుతున్నది. 1952-'53 సం॥లో తల 1కి సగటున 3.7 యూనిట్లు ఉత్పత్తి చేయబడుతున్నది. 4.3 యూనిట్లు వినిమయ మవుతున్నది.

వినియోగమవుతున్న కొద్ది విద్యుత్తు ఏ ఏ శాఖల క్రింద ఎంత వాడబడు చున్నదో క్రింద పొందుపరచబడిన వివరాలు తెలియజేస్తాయి.

విద్యుత్ వినియోగ వివరాలు (1951 - 52)

| వినియోగించబడే పద్దు | మొత్తం ఉత్పత్తిలో నూటికి ఎన్నిపాళ్లు | |
|---|---|---|
| | ఆంధ్ర | మదరాసు రాష్ట్రం |
| పరిశ్రమలకు | 43.54 | 62.0 |
| వ్యవసాయానికి | 10.02 | 13.5 |
| ఇండ్లకు, (Domestic Consumption) | 25.30 | 10.0 |
| వ్యాపారంలో | 12 20 | 7.0 |
| వీధిదీపాలు | 2.78 | 2.5 |
| ఇతరత్రా వినియోగం | 6.16 | 5.0 |
| | 100.00 | 100.0 |

Source: Administration Report of the Electricity Department for 1951-'52 లోని వినియోగ అంచనాల ఆధారంతో తయారుచేసిన ఉజ్జాయింపు అంచనాలు.

పారిశ్రామికాభివృద్ధికి, అధిక ఉత్పత్తికి పనిచేసే కార్మికులకు ఫ్యాక్టరీలో ఆరోగ్యవంతమైన వాతావరణానికి విద్యుత్తు చాల అవసరం. కాని వినియమయానికి ఉన్న మొత్తం విద్యుత్తులో పరిశ్రమలకు నూటికి 43.54 పాళ్లు మాత్రమే వినియోగించబడుతున్నది. మనకు భారీ పరిశ్రమలులేవు. మనకున్న "పరిశ్రమలు" అత్యధిక భాగం రైసుమిల్లులు, వేరుశనగ ఫ్యాక్టరీలు, చిన్న చిన్న వర్కు-షాపులు మాత్రం. కనుక పరిశ్రమల కుపయోగించబడుతున్నదన్న విద్యుత్తు, ఈ పరిశ్రమలకే వినియోగించబడుతున్నది.

తోటి మదరాసురాష్ట్రం, నూటికి 62 పాళ్ళు విద్యుత్తును పరిశ్రమలు నడపటానికి ఉపయోగిస్తున్నదనే విషయం ఇచ్చట గమనార్హం !

మన రాష్ట్రంలో వ్యవసాయానికి సుమారు నూటికి పదిపాళ్ళు మాత్రమే వినియోగించబడుతున్నది. ఈ కొంచెమైనా బావులలోనుంచి నీరు తోడటంలాంటి పనులకుమాత్రమే వినియోగించబడుతున్నది. పరిశ్రమల విషయంలో మదరాసు రాష్ట్రంకంటె వెనుకబడి ఉన్నాము గనుక, అంత ప్రమాణంలో మనం విద్యుత్తును పరిశ్రమలకు వాడలేకపోయామని సంతృప్తిచెందినా, వ్యవసాయరంగంలో విద్యుత్తును వాడడంలో కూడా మనం వెనుకబడే ఉన్నాము.

ఉదాహరణకు, ఆంధ్రలోని రెండు "సిస్టం"లక్రింద 3097 కిలోవాట్ల లోడ్ గల 831 పంపుసెట్లు 1951-'52 సంవత్సరంలో వాడబడుతూంటే, మదరాసురాష్ట్రంలో 60,657 కిలోవాట్ల లోడ్‌గల 14,717 పంపుసెట్లు వాడబడుతున్నాయి.

ఇంతవరకూ మనం ఉత్పత్తి చేస్తున్నది థర్మలు విద్యుత్తు మాత్రమేననీ, అదీ అత్యల్పమనీ, ఇందులో అత్యధికభాగం పరిశ్రమలకు వినియోగించబడటంలేదనీ, తల 1 కి వినియోగించబడే సగటుకూడా అత్యల్పమనీ చూశాం.

మనకున్న జలవిద్యుత్తు ఉత్పత్తి అవకాశాలేమిటో, వాటినన్నింటిని వినియోగించుకోగలిగిననాడు మనకు ఎంతజలవిద్యుత్తు లభ్యమవుతుందో, నాడు భారతదేశ విద్యుత్ ఉత్పత్తిలో ఆంధ్రస్థానం ఏమిటో చూద్దాం.

**మూడుతరగతుల స్కీములు :**

జలవిద్యుత్ ఉత్పత్తి స్కీములను మూడు రకాలుగా విభజించవచ్చు. 1. హైహెడ్‌స్కీము (300 అడుగులకుపైన) 2. మీడియం హెడ్‌స్కీము (300 - 50 అడుగులమధ్య) 3. లోహెడ్‌స్కీము (50 - 10 అడుగులు.)

**హైహెడ్ స్కీములు :**

నదులు పర్వతప్రాంతంలో ప్రవహించేటప్పుడు జలపాతాలు ఏర్పడతాయి. 300 అడుగులకు తగ్గని జలపాతాల సహాయంతో విద్యుత్ ఉత్పత్తి చేస్తారు. వీటినే హైహెడ్ స్కీములు అని పిలుస్తారు.

ఆంధ్రదేశంలో పశ్చిమ కనుములంతటి ఎత్తయిన పర్వతాలులేవు. పైగా, మన నదులు, మైదానప్రాంతంలో పారుతూండటంచేత జలపాతాలు ఏర్పడే అవకాశం లేదు. అందుచేత, ఆంధ్ర - ఒరిస్సా సరిహద్దులోమాత్రం ఒకటి - రెండు స్కీములకు అవకాశమున్నది. అంతకుమించి ఆంధ్రలో ఈ స్కీములకు అవకాశంలేదు.

**మీడియం హెడ్‌స్కీములు :**

నదులకు రిజర్వాయర్లు నిర్మించి, విద్యుదుత్పత్తికి తగినంత ఎత్తుకు నీటిమట్టాన్ని పెంచుతారు. ఈ రిజర్వాయర్లనుండి, కృత్రిమ జలపాతాలను (300-50 అడుగుల ఎత్తువరకూ) కల్పించి, విద్యుత్ ఉత్పత్తి చేస్తారు. వీటినే "మీడియమ్ హెడ్‌స్కీమ్సు" అంటారు. ఈ స్కీముల నిర్మాణానికి ఆంధ్రలో ఎంతో అవకాశం ఉంది. ఇరిగేషనుకోసం నిర్మించే రిజర్వాయర్లను - విద్యుదుత్పత్తి స్కీముతో జోడించి నిర్వహించకపోతే, లాభదాయకంగా నిర్వహించడం సామాన్యంగా వీలుపడదని, ఇందువల్ల విద్యుత్ సరఫరా ఖర్చులు తగ్గుతాయని నిపుణుల అభిప్రాయం.

**లో హెడ్ స్కీములు :**

నదీప్రాజెక్టుల ప్రధాన కాలువలమీద విద్యుదుత్పత్తికి 50-10 అడుగుల ఎత్తువరకు ఉండే చిన్న జలపాతాలను కల్పిస్తారు. మీడియమ్ హెడ్‌స్కీముల విద్యుదుత్పత్తిలో వచ్చే లోటుపాట్లను సర్దటమే వీటి ప్రధాన ఉపయోగం. ఉత్తర

ప్రదేశ్‌లో గంగానది కాలువలమీద ఈ స్కీముక్రింద జలవిద్యుదుత్పత్తి జరుగుతున్నది.

ఈ మూడుతరగతుల స్కీముల క్రింద ఆంధ్రలో ఎన్నిస్కీములు నిర్వహించవచ్చో అవి ఎంత జలవిద్యుత్తును ఉత్పత్తి చేయగలవో దిగువ పొందుపరచిన పట్టిక తెలియ చేస్తుంది :

| స్కీము | ఉత్పత్తి అంచనా (కిలోవాట్లలో) |
|---|---|
| హై హెడ్ స్కీములు | |
| మాచ్‌ఖండ్ | 1,02,000 |
| సీలేరు | 1,66,000 |
| మీడియం హెడ్ స్కీములు | |
| తుంగభద్ర | 44,000 |
| రామపాదసాగరం | 1,55,000 |
| నందికొండ | 1,00,000 |
| లో హెడ్ స్కీములు | |
| నందికొండ, సిద్ధేశ్వరం ప్రాజెక్టు, కాల్వలు, కృష్ణా గోదావరి కాలువలవల్ల. | 1,00,000 |
| | 6,67,000 |

నిర్మాణంలో ఉన్న స్కీములు :

వీటిలో ప్రస్తుతం మాచ్‌ఖండ్ తుంగభద్రస్కీములు నిర్మాణంలోఉన్నాయి

విశాఖపట్నానికి 125 మైళ్ళదూరంలో ఆంధ్ర ఒరిస్సా సరిహద్దున మాచ్‌ఖండ్ నదిమీద "డుడుమా" జలపాతంవద్ద ఒక ఉత్పత్తికేంద్రం నిర్మించబడుతున్నది. ఇది హై హెడ్ స్కీము. నిర్మాణంలో అన్నిదశలు దాటినతర్వాత ఈస్కీముకింద 102 వేల కిలోవాట్ల విద్యుత్తు లభ్యమవుతుంది. ప్రథమదశలో 17000 కిలోవాట్ల ఉత్పత్తిశక్తిగల మూడుయంత్రాలు 1955 నుండి పనిచెయ్యడం ప్రారంభిస్తాయని అధికారుల ప్రకటనలు తెలియచేస్తున్నాయి.

ఈస్కీము నిర్మాణానికి మొదట రు. 12,83 లక్షలు ఖర్చవుతుందని, పది సంవత్సరాలకు ఇతర అభివృద్ధి కార్యక్రమాలు అయ్యేటప్పటికి ఈ ఖర్చు రు. 14,55 లక్షలకు పెరుగుతుందని ప్రభుత్వ అంచనాలు తెలియచేస్తున్నాయి.

ఇచ్చట ఉత్పత్తి చేయబడే జలవిద్యుత్ శ్రీకాకుళం, విశాఖపట్నం, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలకు సరఫరా చేయబడుతుంది. ఈ పవరు సరఫరాకోసం, 290 మైళ్ళ పొడవున 132 కె. వి. డబుల్‌సర్క్యూట్ సరఫరాలైను, వివిధ కేంద్రాలలో సబ్ స్టేషన్లు నిర్మించబడుతున్నాయి.

ఈ కేంద్రపు ఉత్పత్తిలో నూటికి 70పాళ్ళు ఆంధ్రవాటా, 30 పాళ్ళు ఒరిస్సా వాటాగా నిర్ణయించబడింది.

నిర్మాణంలో ఉన్న రెండవ స్కీము తుంగభద్రప్రాజెక్టు. ఇది మీడియమ్ హెడ్‌స్కీము.

హొస్పేటవద్ద ఆనకట్ట సమీపంలో ఒకటి, దానికి 15 మైళ్ళు దిగువన ప్రధాన పంటకాలువమీద ఒకటి, రెండు పవరు స్టేషన్లు నిర్మించబడుతున్నాయి. మొదటి పవరుస్టేషను నిర్మాణం దాదాపు పూర్తికావచ్చింది. ఈ రెండు పవరు స్టేషన్లు నిర్మించబడే ప్రదేశం మైసూరు సంస్థానంలో ఉన్నది.

ఈ ప్రాజెక్టువల్ల మొదటి దశలో 27,000 కిలోవాట్లు, అంతిమదశలో 63,000 కిలోవాట్లు జలవిద్యుత్తు లభిస్తుందని, ప్రభుత్వ అంచనాలు తెలియచేస్తున్నాయి. ఈ పవరులో నూటికి 70 పాళ్ళు ఆంధ్రవాటాగాను, 30 పాళ్ళు మైసూరు వాటాగాను నిర్ణయించబడింది ఈ నిర్ణయం ప్రకారం ప్రాజెక్టు పూర్తయినతర్వాత ఆంధ్రకు 44 వేల కిలోవాట్ల జలవిద్యుత్ లభిస్తుంది.

వేసిన ప్లానుప్రకారం పని కొనసాగితే 1956 నుండి ఈ పవరుస్టేషన్లు ఉత్పత్తి ప్రారంభిస్తాయని, ఈ పవరు అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలకు సరఫరా చేయబడుతుందని, ప్రభుత్వ ప్రకటనలు తెలుపుతున్నాయి. ఈ పవరు సరఫరాకోసం 66-11 కె. వి. వోల్టేజి కలిగిన 750 మైళ్ళ హైటెన్షను లైను, 22 సబ్‌స్టేషన్లు నిర్మించబడుతున్నాయి.

ఈ స్కీము నిర్వహణకు మొదట రు 7,30 లక్షలు అవుతుందని, పది సంవత్సరాలలో దీని పూర్తిఅభివృద్ధికి ఈ ఖర్చు రు 8 కోట్లకు పెరుగుతుందని అంచనా వేయబడింది.

## నిర్వహించ వీలున్న ఇతరస్కీములు

సీ లే రు స్కీ ము :

ఇది హైహెడ్‌స్కీము కిందకు వస్తుంది సీలేరు నదిమీద ఆంధ్రప్రభుత్వం పవరు ఉత్పత్తి చేసుకొనేందుకు ఒరిస్సా ప్రభుత్వం అనుమతించింది.

ఈ స్కీముకింద 42,000; 44,000 - 19,000; 1,05,000 కిలోవాట్ల ఉత్పత్తిశక్తి గలిగిన మూడు పవరుస్టేషన్లు నిర్మించవచ్చునని, ఇందువల్ల 191 - 166 వేల కిలోవాట్ల పవరు లభ్యమవుతుందని ఆంధ్ర చీఫ్ ఎలక్ట్రికల్ ఇంజినీరు

సోమయాజులుగారు అంచనా వేశారు. మాచ్‌ఖండు నిర్మాణంలో ఉన్న ఇబ్బందులు — దూరం, మలేరియా ప్రాంతం, ఇత్యాదివి — ఇచ్చట రావనికూడా వారు అభిప్రాయపడుతున్నారు.

రామపాదసాగరం:

ఈ ప్రాజెక్టు నిర్మాణంవల్ల లక్షల ఎకరాలకు నీటిపారుదల వసతులు కలగడమేగాక, విద్యుదుత్పత్తికి కూడా అవకాశం ఉంది. ఈ రిజర్వాయరువద్ద, 165-72 అడుగుల కృత్రిమ జలపాతాన్ని (ఈఎత్తు ఋతువులనుబట్టి మారుతుంది. వర్షాకాలంలో రిజర్వాయరు నీటిమట్టం పెరుగుతుంది - వేసవిలో రిజర్వాయరులో నీరు తగ్గుతుంది కనుక, ఎత్తుకూడా తగ్గుతుంది.) సృష్టించి 1,50 వేల కిలోవాట్ల పవరు (Continuous power) ఉత్పత్తి చేయవచ్చు.

ఈ స్కీము నిర్మాణానికి (ఇరిగేషన్ ప్రాజక్టుతోసహా) 127 కోట్ల రూపాయలవుతుందని అంచనా వేయబడింది.

నందికొండ:

ఈ పవరుస్కీము ఉత్పత్తిశక్తి, ఇచ్చట నిర్మించబడే రిజర్వాయరు పరిమితిపై ఆధారపడి ఉంటుంది. ఇచ్చట కనీసం లక్ష కిలోవాట్ల విద్యుదుత్పత్తికి (Continuous power of 100% load factor) అవకాశం ఉన్నదని కె. యల్. రావుగారి అభిప్రాయం.

శ్రీశైలం స్కీము:

ఈ మీడియమ్ హెడ్‌స్కీము, కృష్ణానదిమీద, శ్రీశైలంవద్ద నిర్మించవచ్చు. ఇచ్చట నిర్మించబడే రిజర్వాయరు ఇరిగేషనుకు ఉపయోగపడదు.

ఇచ్చట నది నీటిమట్టం నందికొండవద్ద నిర్మించే రిజర్వాయరు నీటిమట్టం కంటె 180 అడుగులు ఎత్తు ఉంటుంది. అందుచేత శ్రీశైలంవద్ద రిజర్వాయరు నిర్మించి, ఈ నీటిని నందికొండ రిజర్వాయరుకు ప్రవహింపచేయటంద్వారా లక్ష కిలోవాట్ల విద్యుత్ ఉత్పత్తి చేయ వీలున్నదని శ్రీ కె. యల్. రావుగారు అంచనా వేశారు.

ఈ ప్రదేశానికి కొద్దిమైళ్ళ ఎగువన సిద్ధేశ్వరం, కొద్దిమైళ్ళు దిగువన నందికొండ ప్రాజెక్టులు నిర్మించాలనే ఆలోచన ఉండటంవల్ల, ఈ స్కీము నిర్మాణం జరగకపోవచ్చని శ్రీ సోమయాజులుగారు అభిప్రాయపడుతున్నారు.

లోహెడ్ స్కీముక్రింద కూడా విద్యుదుత్పత్తికి అవకాశం ఉంది. నందికొండ, సిద్ధేశ్వరం కాలువలవల్ల, ప్రస్తుతం ఉన్న కృష్ణా గోదావరినదుల కాలువల మీద సుమారు లక్షయూనిట్ల జలవిద్యుత్ ఉత్పత్తి చేయ వీలున్నదని శ్రీ కె.యల్. రావుగారు అంచనా వేశారు.

ఇవి గాక, తుంగభద్ర హైలెవెల్ కెనాల్ స్కీము, చెట్టిపేట కెనాల్ స్కీములాంటి సీజనల్ పవరు నిచ్చే స్కీములుకూడా నిర్మించడానికి వీలున్నది.

జల విద్యుత్ ఉత్పత్తికి ఆంధ్రలో ఉన్న అవకాశాల నన్నిటిని ఉపయోగించుకుంటే, సుమారు 6–7 లక్షల కిలోవాట్ల విద్యుత్ ఉత్పత్తి చేయవచ్చని అంచనా వేయబడుతున్నది. ఈ మొత్తం, ప్రస్తుతపు మన రాష్ట్ర ఉత్పత్తిశక్తికి 12–13 రెట్లు. భారతదేశ మొత్తం విద్యుత్ ఉత్పత్తిలో (సుమారు 20 లక్షల కిలోవాట్లు) నాలుగవవంతుకంటె అధికం. భారతదేశం మొత్తంలో నేడు చేయబడుతున్న జల విద్యుత్ ఉత్పత్తి (సుమారు 5 లక్షల కిలోవాట్లు) కంటె కొంచెం అధికం. అంటే, జల విద్యుదుత్పత్తికి ఆంధ్రదేశంలో ఎట్టి అవకాశా లున్నాయో అవగత మవుతుంది.

నందికొండ, పులిచింతల, సిద్ధేశ్వరం ప్రాజక్టులవద్ద ఉత్పత్తి చేయబడే విద్యుత్తు ప్రథమదశలో యూనిట్ ఉత్పత్తి ఖర్చు నాలుగుపైస లుంటుందనీ, మరి ఎనిమిది కోట్లు ఖర్చుచేస్తే ఈ ఉత్పత్తి ఖర్చు కానీకి తగ్గుతుందని ఖోస్లాకమిటీ వేసిన అంచనాలను ప్రస్తుతపు యూనిట్ ఖరీదు 4½–5 అణాలతో పోల్చితే మనకు విద్యుత్ ఎంత చౌకగా లభిస్తుందో వ్యక్తమవుతుంది.

ఈ విద్యుత్తును ఉత్పత్తిచేసిన, పరిశ్రమల అధునాతన పద్ధతులలో నడిపి, ఉత్పత్తిని అధికం చేయడానికేగాక, కొత్త పరిశ్రమల స్థాపనకూడా ప్రోత్సహిస్తుంది. దేశ పారిశ్రామికాభివృద్ధికి దోహదం చేస్తుంది.

వివిధ ప్రాజక్టుల నిర్మాణంవల్ల, లక్షలకొలది ఎకరాలు సాగై సిరిసంపదలతో తులతూగుతూ ఉండే గ్రామసీమలకు, ఈ జల విద్యుత్తు ఎంతో శోభను కూర్చుతుంది.

భారతదేశ జల విద్యుదుత్పత్తిలో ఆంధ్ర ఒక ప్రత్యేక స్థానాన్ని అలంకరిస్తుంది.

# 1952-'53 సం॥లో విద్యుదుత్పత్తి

| కేంద్రం పేరు. | ఉత్పత్తిశక్తి కిలోవాట్లు | లోడ్ కిలోవాట్లు | ఉత్పత్తి లక్షల యూనిట్లలో |
|---|---|---|---|
| **థర్మలు స్టేషన్లు (స్టీమ్)** | | | |
| 1. విశాఖపట్నం | 7,950 | 4,500 | 192.16 |
| 2. విజయవాడ | 13,000 | 9,487 | 477.17 |
| 3. నెల్లూరు | 5,000 | 1,225 | 47.36 |
| **డీసిల్ స్టేషన్లు** | | | |
| 1. కాకినాడ | 1,882 | 910 | 6.12 |
| 2. రాజమండ్రి | 802 | 620 | 5.39 |
| 3. శ్రీకాకుళం | 250 | 124 | 2.36 |
| 4. నరసన్నపేట. | 20 | 22 | 0.36 |
| 5. ఒంగోలు | 170 | 136 | 2.06 |
| 6. నరసరావుపేట | 170 | 90 | 0.47 |
| 7. కర్నూలు | 807 | 360 | 12.56 |
| 8. కడప | 885 | 270 | 8.95 |
| 9. అనంతపురం | 495 | 235 | 6.47 |
| 10. ప్రొద్దుటూరు | 170 | 124 | 3.37 |
| 11. నంద్యాల | 470 | 180 | 2.96 |
| 12. తాడేపల్లి | 470 | 75 | 1.44 |
| 13. మదనపల్లి | 580 | — | — |
| | 33,121 | — | 769.20 |
| మైసూరువద్ద కొన్న పవరు | — | 2,052 | 103.16 |
| | 33,121 | 290,410 | 872.36 |

ఆంధ్ర ప్రభుత్వ చీఫ్ ఎలక్ట్రికల్ ఇంజనీరు శ్రీ బి. ఆర్. సోమయాజులుగారి అంచనాలు.

# వివిధ పవరు సిస్టంల 1951-'52 సం॥ జమాఖర్చులు

(అంకెలు - లక్షల రూపాయలు)

| సిస్టం పేరు ధర్మలు స్టేషను | ఎన్ని సం॥ల నుండి పని చేస్తున్నది | మొత్తం పెట్టుబడి | మొత్తం ఆదాయం | ఖర్చు | నష్టము | లాభము |
|---|---|---|---|---|---|---|
| 1. విశాఖపట్నం | 13 | 79.28 | 13.59 | 13.59 | — | — |
| 2. విజయవాడ | 13 | 141.36 | 19.06 | 19.06 | — | — |
| 3. కాకినాడ | 12 | 19.89 | 6.22 | 6.32 | 0.10 | — |
| 4. కర్నూలు | 6 | 4.83 | 1.98 | 1.82 | — | 0.16 |
| 5. కడప | 4 | 8.67 | 1.77 | 1.80 | 0.03 | — |
| 6. అనంతపురం | 3 | 5.74 | 1.00 | 1.13 | 0.13 | — |
| 7. పొందూరు | 3 | 0.77 | 0.17 | 0.25 | 0.08 | — |
| 8. రాజమండ్రి | 3 | 10.65 | 2.81 | 3.90 | 1.09 | — |
| 9. నెల్లూరు | 2 | 61.88 | 3.01 | 5.76 | 2.75 | — |
| 10. ఒంగోలు | 1 | 2.62 | 0.25 | 0.46 | 0.21 | — |
| 11. నర్సరావుపేట | 1 | 1.98 | 0.37 | 0.65 | 0.28 | — |
| 12. సాలూరు-పార్వతీపురం | 1 | 0.27 | 0.30 | 0.20 | — | 0.10 |
| 13. శ్రీకాకుళం | 1 | 1.22 | 0.50 | 0.64 | 0.14 | |
| 14. ప్రొద్దుటూరు | 1 | 3.59 | 0.56 | 0.68 | 0.12 | — |
| మైసూరువద్ద కొన్న విద్యుత్తు | | | | | | — |
| 1. రాయలసీమజిల్లాలు | 3 | 80.03 | 8.53 | 6.97 | — | 1.57 |
| 2. హిందూపూరు | 2 | 3.63 | 0.68 | 0.52 | — | 0.16 |
| | | | 60.81 | 63.75 | 4.93 | 1.99 |

Source: Administration Report of the Electricity Department for 1951-'52 లోని అంచనాల ఆధారంతో ఈ పట్టీ తయారు చేయబడినది.

## 1951-'52 సం॥లో విద్యుత్తు సప్లయి చేయబడుతున్న గ్రామాలు

| | తాలూకా | | | | గ్రామాలు |
|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళంజిల్లా | | | | 14 |
| | శ్రీకాకుళం తాలూకా | ... | ... | 3 | |
| | చీపురుపల్లి ,, | ... | ... | 6 | |
| | సాలూరు ,, | ... | ... | 3 | |
| | బొబ్బిలి ,, | ... | ... | 1 | |
| | పార్వతీపురం ,, | ... | ... | 1 | |
| 2. | విశాఖపట్నంజిల్లా | | | | 31 |
| | విశాఖపట్నం తాలూకా | ... | ... | 11 | |
| | అనకాపల్లి ,, | ... | ... | 3 | |
| | వీరవల్లి ,, | .. | ... | 1 | |
| | భీమునిపట్నం ,, | ... | ... | 9 | |
| | విజయనగరం ,, | ... | ... | 7 | |
| 3. | కృష్ణాజిల్లా | | | | 54 |
| | నూజివీడు తాలూకా | ... | ... | 11 | |
| | విజయవాడ ,, | ... | ... | 21 | |
| | గన్నవరం ,, | ... | ... | 20 | |
| | బందరు ,, | ... | ... | 2 | |
| 4. | గుంటూరుజిల్లా | | | | 18 |
| | గుంటూరు తాలూకా | ... | ... | 12 | |
| | ఒంగోలు ,, | ... | ... | 1 | |
| | నర్సరావుపేట ,, | ... | ... | 1 | |
| | తెనాలి ,, | ... | ... | 1 | |
| | బాపట్ల ,, | ... | ... | 3 | |
| 5. | తూర్పుగోదావరిజిల్లా | | | | 25 |
| | కాకినాడ తాలూకా | ... | ... | 4 | |
| | పెద్దాపురం ,, | ... | ... | 1 | |
| | పిఠాపురం ,, | ... | ... | 4 | |
| | రామచంద్రపురం ,, | ... | ... | 7 | |
| | రాజమండ్రి ,, | ... | ... | 8 | |
| | అమలాపురం ,, | ... | ... | 1 | |
| 6. | పశ్చిమగోదావరిజిల్లా | | | | 23 |
| | ఏలూరు తాలూకా | ... | ... | 22 | |

1951-'52 సం॥లో విద్యుత్తు సప్లయి చేయబడుచున్న గ్రామాలు

| | తాలూకా | | | | గ్రామాలు |
|---|---|---|---|---|---|
| 7. | కర్నూలుజిల్లా | | | | 2 |
| | కర్నూలు తాలూకా | ... | ... | 2 | |
| 8. | కడపజిల్లా | ... | ... | | 4 |
| 9. | అనంతపురంజిల్లా | ... | ... | | 1 |
| 10. | నెల్లూరుజిల్లా | ... | ... | | 3 |
| 11. | రాయలసీమ జిల్లాలలోని ఇతర గ్రామాలు | ... | ... | | 18 |
| | పవరు సప్లయి చేయబడుతున్న గ్రామాల మొత్తం | | | | 193 |
| | తమిళదేశంలో | | | | 1218 |

Source: Adiministration Report of the Electricity Department for the year 1951-'52.

# వాణిజ్య వ్యాపారాలు

రాష్ట్ర వాణిజ్యవ్యాపారాల అభివృద్ధి, ఆ రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధిపై ఆధారపడి ఉంటుంది. ఆంధ్రరాష్ట్రం వ్యాపారపంటల నధికంగాపండిస్తున్నది. మైకా మాంగనీసులాంటి ఖనిజాలు విరివిగా దొరుకుతున్నాయి. కాని, ఈ ముడిసరుకుల నుపయోగించగలిగినంతగా మన రాష్ట్రంలో అభివృద్ధి జరగలేదు. కనుకనే, వాణిజ్య వ్యాపారాలలో ఆంధ్ర చాల వెనుకబడిఉంది.

గత రెండువందల సంవత్సరాల బ్రిటిష్‌పాలన కాలంలో, సామ్రాజ్యవాద ఆర్థిక వ్యవస్థకు కావలసిన ముడిసరకుల సప్లయి స్థావరంగా ఆంధ్ర ఆర్థిక వ్యవస్థ రూపొందించబడింది. దీనికితోడు మనకు ప్రత్యేకరాష్ట్రం లేకపోవటంచేత, మన పరిశ్రమలను, వాణిజ్యవ్యాపారాలను అభివృద్ధిచేసుకొనే అవకాశం మనకు లేక పోయింది. గుజరాతీ మార్వాడీపెట్టుబడిదారులు, తమిళపారిశ్రామికులు ఆంధ్ర అభివృద్ధిని అరికడుతూ, తమకు ముడిసరుకులను సప్లయిచేసే కేంద్రంగా అట్టిపెట్టేం దుకు, తమపంతు కృషిని నిపుణతతో నిర్వహించారు. వీటన్నిటితోపాటు భూస్వామ్య విధానంకూడా ఆంధ్రపారిశ్రామిక వాణిజ్య వ్యాపారాభివృద్ధికి ఆటంకంగా తయా రైంది. వీటన్నిటి విషఫలితాల కారణంగా ఆంధ్రరాష్ట్రం పారిశ్రామికంగా వెనుకబడి ఉంది.

ఆంధ్రలోఉన్న జాయింటుస్టాక్ కంపెనీలు, వాటిపెట్టుబడులను పరిశీలించితే మనం వాణిజ్య వ్యాపారాలలో ఎంతవెనుకబడి ఉన్నామో అవగతమవుతుంది. ఆంధ్రలో ప్రస్తుతం సుమారు 500 జాయింటు స్టాక్‌కంపెనీలున్నాయి. వీటి మొత్తం మూలధనం రు 3,50 లక్షలుగా అంచనా వేయబడుతున్నది. మన కంపెనీలు భారత దేశ మొత్తం కంపెనీలలో 2.2%; వాటిపెట్టుబడిలో 0.6%; తోటి మదరాసురాష్ట్రపు కంపెనీలలో 13.6%; వాటి పెట్టుబడిలో 5.3% మాత్రమే! వాణిజ్య వ్యాపారాలలో మన దుస్థితిని తెల్సుకొనడానికి ఈ ఉదాహరణ చాలు !

ఆంధ్రదేశం పొగాకు, పత్తి మొదలగు వ్యాపారపంటల నధికంగా పండిస్తున్నది. ప్రతిసంవత్సరం సుమారు 18 - 20 కోట్ల రూపాయల విలువచేసే పొగాకు, రు 50 - 55 కోట్ల విలువచేసే నూనెగింజలు, రు 20 కోట్ల విలువచేసే

పత్తి పండించబడుతున్నాయి. ఆంధ్రదేశ వ్యాపారపంటలమొత్తం సుమారు రు 116 కోట్లుగా అంచనా వేయబడుతున్నది. కాని వీటికి సంబంధించిన పరిశ్రమలేవీ మన రాష్ట్రంలో అభివృద్ధికాలేదు. ఈవిధంగానే మైకా, మాంగనీసు, క్రోమైట్, ముడి ఇనుముకూడా విరివిగానే లభిస్తున్నాయి. కాని వీటిని ఉపయోగించుకోగలిగిన పరిశ్రమలు మనకు అభివృద్ధి కాలేదు.

అందుచేతే కోట్లరూపాయలు విలువచేసే మన ముడిసరుకులు పరదేశాలకు, పరరాష్ట్రాలకు కారుచౌకగా ఎగుమతి చేయబడుతున్నాయి. ఈ ఎగుమతుల విలువ సాలుకు సుమారు రు 35 - 40 కోట్లు ఉంటుందని ఆంధ్ర వాణిజ్య మండలి ఉపాధ్యక్షులు శ్రీ సోమయాజులుగారు అంచనా వేశారు. వీరి అంచనాప్రకారం ఏటా ఎనిమిదికోట్ల రూపాయలు విలువగల పొగాకు; అయిదుకోట్ల రూపాయలు విలువ గలిగిన తోళ్ళు; సుమారు మూడుకోట్ల విలువగలిగిన నూనెలు, నూనెగింజలు; రెండుకోట్ల విలువగలిగిన మైకా; కోటిరూపాయలు విలువచేసే మాంగనీసు; 15 కోట్లు విలువచేసే ఇతర సరుకులు విదేశాలకు ఎగుమతి అవుతున్నాయి. వీటిలో నూటికి 50 పాళ్లు బ్రిటన్‌కు, పదిపాళ్ళు అమెరికాకు, ఐదుపాళ్ళు సిలోన్‌కు; మిగిలింది ఈజిప్టు, ఆఫ్రికా, కెనడా, తదితరదేశాలకు ఎగుమతి అవుతున్నట్లు అంచనా వేయబడింది.

తిరిగి మనం చిన్న ఇనుపమేకునుండి పెద్ద యంత్రంవరకూ, నూనెలు, వస్త్రాలు, చెప్పులు ఇత్యాది నిత్యజీవితావసర వస్తువులను దిగుమతి చేసుకుంటున్నాం. వీటి విలువను శ్రీ సోమయాజులుగారు సుమారు 30 కోట్ల రూపాయలుగా అంచనా వేశారు. వీరు మదరాసు, కాకినాడ, విశాఖపట్నం రేవులద్వారా వచ్చిన సరుకుకే విలువకట్టారు. కనుక, ఇందులో బొంబాయి, కలకత్తా రేవులలో పరదేశాలనుండి దిగుమతై, అచ్చటి కంపెనీలచేత మనరాష్ట్రానికి పంపబడిన సరుకుల విలువ ఇందులో చేర్చబడలేదు. వీటి విలువనుకూడా కలిపి దిగుమతుల అంచనా వేస్తే, మనం ఇతర దేశాలకు ఎగుమతిచేసే సరుకు విలువకంటే, దిగుమతి చేసుకునే సరుకు విలువ నిస్సందేహంగా అధికంగా ఉంటుంది. అందుచేత, విదేశీ వ్యాపారంలో ఆంధ్రకు ఎంతో నష్టం వస్తున్నట్లు తేలుతున్నది.

దానికి ప్రధాన కారణం, మనం ఎగుమతిచేసే ముడిసరుకు విలువకు దిగుమతి చేసుకునే సరుకువిలువ కొన్ని రెట్లు అధికంగా ఉండటమే. ఉదాహరణకు ఇనుము చూద్దాం: “గుండ్రాయి”లో (జగ్గయ్యపేట తాలూకా) టన్ను ముడి ఇనుము రైతులవద్ద కొనేది నామమాత్రపు విలువ రెండు - మూడు రూపాయలకు. ఇది కలకత్తా, కాకినాడ రేవులకు చేరవేయడానికి సుమారు 45-50 రూపాయలవుతుంది. ఇదిఇనుము, ఉక్కుగా తయారుచేయబడి, ముడిసరుకు విలువకు 12-15 రెట్లు అధికంగా ఉండే ధరకు దిగుమతి అవుతుంది. అలాగే, పౌను పొగాకు రు 3-4 ల

ధర చెప్పిన ఎగుమతి అయితే, దిగుమతిఅయ్యే (పోను పోనుకుంటే చేయబడే) సరుకుల విలువ సుమారు దానికి 15-20 కోట్లు ఉంటుంది.

కారుచౌకగా మనరాష్ట్రంలో ముడిసరుకులను కొనడం, వాటిని సరుకులుగా (Finished goods) తయారుచేసి, తిరిగి మనకే అమ్ముతూ, విదేశీ, మార్వాడీ, గుజరాతీ పెట్టుబడిదారులు మనసంపదను విపరీతంగా దోచుకుంటున్నారు. మన పారిశ్రామికాభివృద్ధిని అరికడుతున్నారు.

పొరుగురాష్ట్రాలకు ఆంధ్రరాష్ట్రం ముఖ్యంగా బియ్యం, జొన్నలు, పంచదార, బెల్లం, నూనెగింజలు, పొగాకు, ఇత్యాదులు సుమారు 20 కోట్ల రూపాయల విలువకు మించి ఎగుమతిచేస్తున్నట్లు; ఇతర రాష్ట్రాలనుండి ముఖ్యంగా వస్త్రాలు, బొగ్గు, సిమెంటు, ఇనుము, ఉక్కు, కిరసనాయిలు, జనపనార సంచులు ఇత్యాదులు సుమారు రు. 40 కోట్ల విలువచేసే సరుకును దిగుమతి చేసుకొంటున్నట్లు శ్రీ సోమయాజులుగారి అంచనాలు తెలియచేస్తున్నాయి.

దీనినిబట్టి, పరదేశ వ్యాపారంలోలాగే, పరరాష్ట్రాలతోడి వ్యాపారంలో కూడా ఆంధ్రకు విపరీతనష్టం వస్తున్నట్లు తేలుతున్నది.

ఆంధ్రరాష్ట్రం కోట్లరూపాయలు విలువచేసే ముడిసరుకుల నుత్పత్తి చేస్తున్నా, ఈ దుస్థితి తప్పలేదు. ఈ దుస్థితినుండి బయటపడేందుకు రెండేమార్గాలున్నాయి. మొదటిది, పెద్దపెద్ద ప్రాజక్టులను నిర్మించి, ఆహారధాన్యాలను అదనంగా పండించి, ఎగుమతులను పెంచడం; రెండవది రాష్ట్రంలో లభించే ముడిసరుకులలో అత్యధిక భాగాన్ని వినియోగించుకోగలిగిన భారీపరిశ్రమలను నిర్మించి తద్వారా పారిశ్రామిక వస్తువుల దిగుమతులను తగ్గించుకోవడం.

ఈ విధంగా, వ్యావసాయక పారిశ్రామికోత్పత్తులు అధికమవుతాయి గనుక, వ్యాపారం అభివృద్ధిచెంది ప్రస్తుతం వస్తున్న నష్టాన్ని పూడ్చుకోవడమేగాక, మన రాష్ట్రం లాభాలనుకూడా ఆర్జించగలదు. వ్యాపారాభివృద్ధితోపాటు ప్రభుత్వానికి వ్యాపారసుంకాలద్వారా వచ్చే ఆదాయంకూడా పెరుగుతుంది. నాడు ఆంధ్రదేశ సహజసంపదల ఫలితాన్ని ఆంధ్రప్రజలు అనుభవించగలుగుతారు.

## సరుకు రవాణా :

మన సరుకుల రవాణా ప్రధానంగా రైళ్ళద్వారా, సముద్రంమీద, నదులు, కాలువలద్వారా, లారీలద్వారా జరుపబడుచున్నది.

ఇందులో ప్రధాన భాగం, రైళ్ళద్వారా, లారీలద్వారా జరుపబడుతున్నదని చెప్పవచ్చు. లారీలపై జరిగిన ఎగుమతి, దిగుమతులకు సంబంధించినంత వరకు, ఎచ్చటా ఎట్టి లెక్కలు ఉన్నట్లు కనిపించదు. భారత వాణిజ్యంలో రైళ్ళద్వారా ఎంత సరుకు రవాణా చేయబడుతున్నదో తెలిసినా, అందులో ఆంధ్రదేశపు రవాణాకు సంబంధించిన వివరాలు-అంకెలతో సహా-లభించలేదు. కనుక కాలువలపై

జరిగే రవాణా, ఓడరేవులద్వారా జరిగే రవాణాలకు మాత్రమే వివరాలు ఇవ్వబడినవి.

సముద్ర వ్యాపారం :

ఆంధ్రదేశపు ప్రధాన ఓడరేవు విశాఖపట్నం. ఇదిగాక, మనకు కళింగపట్నం (శ్రీకాకుళం జిల్లా), భీమునిపట్నం (విశాఖపట్నం జిల్లా), కాకినాడ (తూర్పు గోదావరిజిల్లా), నరసాపురం (పశ్చిమగోదావరిజిల్లా), మచిలీపట్నం (కృష్ణాజిల్లా) మొదలైన ఓడరేవులు ఉన్నాయి. ఇవిగాక ఓడరేవు, నిజాంపట్నం మొదలైన అనేక చిన్న చిన్న ఓడరేవులద్వారా కూడా కొంత వ్యాపారం జరుగుతున్నది. కాని, వీటికి సంబంధించిన వివరాలుకూడా ఎచ్చటా లభ్యం కాలేదు.

కాకినాడ ఓడరేవు ద్వారా, ప్రధానంగా ఎగుమతి చేయబడే సరుకు :— పొగాకు (సుమారు రు. 5 కోట్లు విలువగలది); తాటినార (రు. 38 లక్షలు విలువగలది); ఆముదమునూనె, గింజలు ($10\frac{1}{2}$ లక్షల రూపాయల విలువగలవి) (ఎగుమతుల విలువలు 1950–'51 సంవత్సరానివి). భీమునిపట్నం, కళింగపట్నముల ద్వారా జనుము, గోగునార; విశాఖపట్నంద్వారా ముడి మాంగనీసు, బొగ్గు మున్నగునవి ఎగుమతి చేయబడుచున్నవి.

పై ఓడరేవులలో ఒక్క విశాఖపట్నం, కాకినాడలు మినహా దిగుమతి వ్యాపారం మరి ఏ యితర రేవులద్వారాను జరగటం లేదు. విశాఖపట్నంలోకూడా ఇతర ప్రదేశాలనుండి కొనుబడి అయ్యే ఆహారం మాత్రమే ప్రధానంగా దిగుమతి చేయబడుచున్నది. ఈ దిగుమతుల మొత్తం 67,000 టన్నులుమాత్రమే! విశాఖ నుండి జరిగే ఎగుమతులు సుమారు 9 లక్షల టన్నులవరకూ ఉంటాయి.

కాలువలమీద రవాణా :

రాష్ట్రంలో జరిగే వ్యాపారంలో ప్రధానభాగం కాలువలద్వారా జరుగుతున్నది. కృష్ణా, గోదావరీ నదుల బకింగ్‌హామ్, దుమ్ముగూడెం కాలువలు ఇందుకు ప్రధాన మార్గాలు. గోదావరి కాలువలలో సంవత్సరంలో 11 నెలలవరకూ, కృష్ణ కాలువలలో 10 నెలలవరకూ రవాణాలు జరగడానికి వీలవుతుంది.

కాలువలద్వారా రవాణా అయ్యే ప్రధానసరుకులు:— కట్టడపుసరుకులు (ముక్కరాయి, గుల్లరాయి వగైరా), బియ్యము, ధాన్యము, వంటచెరుకు, కలప, ఉప్పు మొదలైనవి.

గోదావరి కాలువలపై సుమారు రు. 22 కోట్ల విలువగల సరుకు (7,25 వేల టన్నులు) 1948–'49 సంవత్సరంలో రవాణా అయింది. గోదావరికాలువలలో ఆంధ్రదేశంలోని, మరి ఏ ఇతర కాలువలకన్న అధికంగా సరుకు రవాణా జరుగు

ఉన్నవి. వీటిపై ప్రధానంగా కలప, పొగాకు, బియ్యము, ధాన్యము రవాణా చేయబడుతున్నాయి.

కృష్ణా కాలువలపై 7 లక్షల టన్నుల సరుకు (రూ. 14 కోట్ల విలువ గలిగినది) 1948–'49 లో రవాణా చేయబడినది. ఈ కాలువలపై కలప, పిల్లర సరుకులు, బియ్యము, ధాన్యము ప్రధానంగా రవాణా చేయబడుతున్నాయి.

బకింగ్‌హామ్ కాలువపై ఇదే సంవత్సరంలో 3,26 వేల టన్నుల సరుకు (రూ. 6,30 లక్షల విలువ గలిగినది) రవాణా చేయబడినది. ఇందులో ప్రధానమైనవి ఉప్పు, వంటచెరకు, పుగాకు, బియ్యం, ధాన్యం మున్నగునవి.

బ్యాంకులు:

వాణిజ్య వ్యాపారాలకు, బ్యాంకింగు వ్యాపారానికి ఎంతో అవినాభావ సంబంధం ఉంది. వాణిజ్య వ్యాపారాల అభివృద్ధికి కొలతబద్దగా బ్యాంకింగు వ్యాపారాన్ని చెప్పవచ్చు.

మన వ్యాపారంలాగే బ్యాంకింగు వ్యాపారంకూడా వెనుకబడి ఉంది. ఆంధ్ర బ్యాంకుల్ని, వాటి మూలధనం, డిపాజిట్లను, భారతదేశ బ్యాంకులతో పోల్చి చూస్తే, మనం ఎంతగా వెనుకబడి ఉన్నామో అర్థమవుతుంది.

భారతదేశంలో (1952)

| బ్యాంకుల స్వభావం | బ్యాంకుల సంఖ్య | పెట్టుబడి–మూలధనం లక్షల రూ\|\|లలో | డిపాజిట్లు లక్షల రూ\|\|లలో |
|---|---|---|---|
| * షెడ్యూలు బ్యాంకులు | 91 | 60,36 | 8,91,97 |
| నాన్ షెడ్యూలు బ్యాంకులు | 443 | 13,89 | 64,72 |
| మొత్తం | 534 | 74,25 | 9,56,69 |
| | ఆంధ్రలో (1952) | | |
| * షెడ్యూలు బ్యాంకులు | 2 | 44 | 5,03 |
| నాన్ షెడ్యూలు బ్యాంకులు | 5 | 15 | 37 |
| మొత్తం | 7 | 59 | 5,40 |

* షెడ్యూలు బ్యాంకులు : రిజర్వుబ్యాంకుచేత గుర్తించబడి, అది సూచించే కొన్ని నిబంధనలకు కట్టుబడి వుంటూ, క్లియరింగ్ హౌసులతో ఇచ్చిపుచ్చుకొనే సంబంధాలు కలిగి ఉంటాయి. ఇవి రిజర్వు బ్యాంకులో ఒక నిర్ణీత మొత్తాన్ని డిపాజిట్‌గా ఉంచాలి.

Source : Statistical Tables Relating to Banks in India (Reserve Bank of India Publication) Pages 3–5.

భారతదేశంలోని మొత్తం జాయింట్ స్టాక్ బ్యాంకుల్లో, ఆంధ్ర బ్యాంకులు 1.2%; పెట్టుబడి - మూలధనంలో 0.8%; డిపాజిట్లలో 0.6% మాత్రమే!

పైగా, మనకు స్టేట్ బ్యాంకుగాని, రిజర్వుబ్యాంకు శాఖగాని లేదు. ఉన్న బ్యాంకుల వ్యాపారంలో, ఒక్క ఆంధ్ర బ్యాంకు వ్యాపారంతప్ప, ఇతర బ్యాంకుల వ్యాపారంలో ఎట్టి అభివృద్ధి కనిపించడంలేదు.

ఆంధ్ర బ్యాంకింగ్ వ్యాపారంలో అత్యధిక భాగాన్ని - ఇంపీరియల్ బ్యాంకు, ఇండియన్ బ్యాంకు, సెంట్రల్ బ్యాంకు-ఈ మూడు ఆంధ్రేతర బ్యాంకులే చేస్తున్నాయి.

ఆంధ్ర బ్యాంకులు వ్యాపారరంగంలో స్థిరత్వాన్ని సంపాదించలేదు. వ్యాపారస్తులకు, వ్యాపారంలో డబ్బు మార్పిడి విషయంలో, ఇతర రాష్ట్రాల ముఖ్యవ్యాపార కేంద్రాలలో బ్రాంచీలున్న బ్యాంకులలో ఎకౌంటుపెడితే వ్యాపార నిర్వహణకు అనువుగా ఉంటుంది. దురదృష్టవశాత్తు ఏఒక్క ఆంధ్రబ్యాంకుకు, ఒక్క మదరాసులోతప్ప ఇతరరాష్ట్రాలలో బ్రాంచీలులేవు. అందుచేతే ఆంధ్రవ్యాపారస్తులలో అధికులు మన బ్యాంకులనువదలి ఆంధ్రేతర బ్యాంకులైన ఇంపీరియల్ బ్యాంకు, ఇండియన్ బ్యాంకు, సెంట్రలుబ్యాంకులలోనే ఎకౌంట్లు పెడుతున్నారు. దీనికితోడు ఇవి స్థిరమైన బ్యాంకులుగా చాలకాలంగా చెల్లుబడిఅవుతూ వచ్చాయి. అందుచేత వ్యాపారస్తులేగాక, వ్యక్తులుకూడా తమ ధనాన్ని ఈ బ్యాంకులలోనే దాచుకోవడం జరుగుతున్నది.

దీనికితోడు ఆంధ్రబ్యాంకులు వ్యాపారస్తులకు అప్పులిచ్చే పద్ధతిని ఇంకా అనుసరించడంలేదు. పై ఆంధ్రేతర బ్యాంకులు, ఇతర రాష్ట్రాలలో సంపాదించిన డిపాజిట్ల ధనంతో ఇచ్చట ఈ వ్యాపారాన్ని విరివిగా సాగిస్తున్నాయి.

ఇటు ఆంధ్రబ్యాంకులకంటె హెచ్చుధనాన్ని డిపాజిట్లరూపంలో తక్కువ వడ్డీరేటుకు సేకరించుతూ, రెండవ ప్రక్కన ఇంతకు మించిన వడ్డీరేట్లతో అప్పులిస్తూ ఈ ఆంధ్రేతర బ్యాంకులు మంచిలాభాలు సంపాదిస్తున్నాయి. ఈ పరిస్థితులలో ఆంధ్రబ్యాంకులు తగినంత అభివృద్ధిని సాధించలేక పోతున్నాయి.

ఆంధ్ర బ్యాంకులు:

ఇక ఆంధ్రజాయింటు స్టాక్ బ్యాంకులు, వాటివ్యాపార వివరాలను పరిశీలించుదాం. ప్రక్కపేజీలో పొందుపరచిన పట్టిక వివిధ బ్యాంకులు, వాటి పెట్టుబడులు, డిపాజిట్లు మొదలైన విషయాలను వివరిస్తుంది.

ఆంధ్ర షెడ్యూల్డు – నాన్ షెడ్యూల్డు బ్యాంకులు (డిశంబరు 31, 1952)

| బ్యాంకు పేరు | ప్రారంభించిన తేదీ | బ్రాంచీలు | పెట్టుబడి మూలధనం రూపాయల్లో (డిశంబరు 31-1952) | డిపాజిట్లు (రూ॥) (డిశంబరు 31-1952) |
|---|---|---|---|---|
| **షెడ్యూల్డు బ్యాంకులు** | | | | |
| 1. ఆంధ్రా బ్యాంకు –మచిలీపట్నం | 20-11-1923 | 51 | 36,28,000 | 4,67,45,000 |
| 2. భారత లక్ష్మి బ్యాంకు –మచిలీపట్నం | 22- 4-1929 | 14 | 7,92,000 | 35,47,000 |
| **నాన్ షెడ్యూల్డు బ్యాంకులు** | | | | |
| 1. బ్యాంక్ ఆఫ్ చిత్తూరు –చిత్తూరు | 30- 9-1946 | 5 | 5,37,000 | 2,22,000 |
| **1-5 లక్షల మధ్య పెట్టుబడి గలవి** | | | | |
| 2. బ్యాంక్ ఆఫ్ బాపట్ల, –బాపట్ల | 15- 1-1902 | 1 | 1,10,000 | 1,23,000 |
| 3. కాకినాడ రాధాస్వామి –బ్యాంకు, కాకినాడ | 4- 5-1943 | 1 | 1,75,000 | 6,83,000 |
| 4. రాయలసీమ బ్యాంకు –బళ్ళారి | 25-11-1939 | 9 | 3,75,000 | 13,75,000 |
| 5. విజయా కమర్షియల్ బ్యాంకు, –విజయవాడ | 9- 2-1943 | 8 | 2,70,000 | 13,51,000 |
| | | 89 | 59,87,000 | 5,40,46,000 |

Source : Statistical Tables Relating to Banks In India.
Pages 42, 44, 52, 60, 62, 72 & 78.

ఆంధ్ర జాయింట్ స్టాక్ బ్యాంకుల్లోకెల్ల ఆంధ్రబ్యాంకు చాల పెద్దది. ఇది రాష్ట్రమంతటా 51 బ్రాంచీలతో రు 36,28,000 పెట్టుబడి – మూలధనంతో రు 4,67,45,000 డిపాజిట్లతో వ్యాపారం చేస్తున్నది.

ఈ బ్యాంకు పెట్టుబడి మూలధనం ఆంధ్ర జాయింట్ స్టాక్ బ్యాంకులన్నింటి పెట్టుబడి మూలధనంలో నూటికి 60.5 పాళ్ళు, డిపాజిట్లధనం అన్ని బ్యాంకుల మొత్తం డిపాజిట్లధనంలో నూటికి 86.5 పాళ్ళుఉన్నది. దీన్నిబట్టి ఆంధ్రబ్యాంకులమొత్తం

వ్యాపారంలో నూటికి 60 పాళ్ళు వ్యాపారాన్ని ఆంధ్రబ్యాంకు ఒక్కటే చేస్తున్నట్లు తేలుతున్నది. దీనితర్వాత చెప్పదగినది భారత లక్ష్మి బ్యాంకు. ఇది పాతికేండ్లుగా వ్యాపారం చేస్తున్నా చెప్పదగిన అభివృద్ధి కనిపించటంలేదు.

తర్వాత చెప్పదగినవి బ్యాంక్ ఆఫ్ చిత్తూరు, రాయలసీమ బ్యాంకు. బ్యాంక్ ఆఫ్ బాపట్ల 1902 లో స్థాపించబడింది. ఇది అన్నిబ్యాంకులకంటె చాల ముందుగానే ప్రారంభించబడినా పెట్టుబడి పెరగలేదు; డిపాజిట్లు అంతకంటె లేదు.

కోపరేటివు బ్యాంకులు :

జాయంట్ స్టాక్ బ్యాంకుల వ్యాపారంకంటె కోపరేటివు బ్యాంకుల వ్యాపారం పెద్దగా అభివృద్ధిచెందక పోయినా - కొంచెం మెరుగని చెప్పవచ్చు.

భారతదేశ కోపరేటివు బ్యాంకింగ్‌లో ఆంధ్రస్థానమేమిటో క్రింద ఇవ్వబడిన పట్టిక తెలియచేస్తుంది.

భారతదేశంలో కోపరేటివు బ్యాంకులు 1951 – '52

| బ్యాంకలు | సంఖ్య | పెట్టుబడి - మూలధనం ఇతర నిధులు (రూ॥ లలో) 1951 - 52 | డిపాజిట్లు (రూ॥ లలో) |
|---|---|---|---|
| రు. 5 లక్షలు_అంతకు మించిన పెట్టుబడి కలవి | 90 | 13,27,00,000 | 79,26,00,000 |
| రు.లక్ష_5లక్షలమధ్య పెట్టుబడికలవి | 355 | 7,44,00,000 | 26,40,00,000 |
| మొత్తం. | 445 | 20,71,00,000 | 1,05,66,00,000 |
| ఆంధ్రలో 1951 – '52 | | | |
| రు. 5 లక్షలు - అంతకుమించిన పెట్టుబడి గలవి | 14 | 1,38,67,000 ♦ | 6,35,06,000 * |
| రు. లక్ష - 5 లక్షల మధ్య పెట్టుబడి కలవి | 10 | 25,62,000 | 1,09,60,000 |
| మొత్తం. | 24 | 1,64,29,000 | 7,44,66,000 |

భారతదేశ కోపరేటివుబ్యాంకుల మొత్తం పెట్టుబడిలో ఆంధ్ర బ్యాంకుల పెట్టుబడి నూటికి 7.9 పాళ్ళు, డిపాజిట్లు ధనంలో నూటికి ఏడుపాళ్ళున్నది.

♦ ఇందులో ఆంధ్ర స్టేట్ కోపరేటివు బ్యాంకు పెట్టుబడి - మూలధనం, ఇతర నిధులు చేర్చబడ్డాయి.

* ఇందులో ఆంధ్ర స్టేటు కో ఆపరేటివు బ్యాంకు డిపాజిట్లు చేర్చబడలేదు.

— Compiled from " Statistical tabls relating to Banks in India, "

మనకు రు. 5 లక్షలు అంతకుమించి పెట్టుబడితో నడుపబడుతున్న *బ్యాంకులు రు.1½ లక్ష-5 లక్షల మధ్య పెట్టుబడితో నడుపబడుతున్న *బ్యాంకులు పది ఉన్నాయి. వీటి అన్నిటిలోను, ఆంధ్ర కోపరేటివ్ స్టేట్ బ్యాంకు పెద్దది.

రాష్ట్రావతారణ అనంతరం, 1953 అక్టోబరులో రు. 40 లక్షల పెట్టుబడితో మదరాసు స్టేట్ కోపరేటివ్ బ్యాంకునుండి విడదీయబడింది. దీని కేంద్ర ఆఫీసు విజయవాడలో ఉన్నది. కొత్తగా స్థాపించిన బ్యాంకు కనుక డిపాజిట్లు వివరాలు లభ్యం కాలేదు. ఇది కోపరేటివ్ సెంట్రలు బ్యాంకులకు సుమారు 2½% వడ్డీ రేటుతో అప్పులు ఇస్తుంది. ఐదులక్షల రూపాయలు అంతకుమించిన పెట్టుబడితో నడుపబడుతున్న బ్యాంకులలో ఎన్నదగినది విజయనగరం కోపరేటివ్ సెంట్రలు బ్యాంకు. ఇది రు. 14,37 వేల పెట్టుబడి-మూలధనంతో నడుపబడుతున్నది. దీని డిపాజిట్లుధనం రు.89.4 వేలు. ఈతరగతి బ్యాంకుల్లోకెల్ల ఇది పెద్దది. తరువాత చెప్పదగింది విజయవాడ కోపరేటివ్ సెంట్రలు బ్యాంకు-విజయవాడ. దీని పెట్టుబడి-మూలధనం రు. 11,03 వేలు, డిపాజిట్లువిలువ రు. 84,07 వేలు. గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాల సెంట్రలు బ్యాంకులుకూడా రు. 7-8 లక్షల పెట్టుబడి మూలధనంతో నడుపబడుతున్నాయి.

రు. లక్ష-5లక్షల మధ్య పెట్టుబడితో నడుపబడుతున్న బ్యాంకులలోకెల్ల పెద్దవి చిత్తూరు కోపరేటివ్ బ్యాంకు, కాకినాడ కోపరేటివ్ బ్యాంకు, కర్నూలు జిల్లా కోపరేటివ్ బ్యాంకు, తిరుపతి కోపరేటివ్ అర్బను బ్యాంకు, రాజమండ్రి కోపరేటివ్ సెంట్రలు బ్యాంకు. ఇవి రు 3-3½ లక్షల పెట్టుబడితో నడుపబడుతున్నాయి. వీటిలో ఇతర అన్ని బ్యాంకులలోకన్న (ఈ తరగతికి చెందిన) రాజమండ్రి బ్యాంకులో డిపాజిట్లుధనం అధికంగా ఉంది. డిపాజిట్ల సేకరణలో చెప్పదగినవి: రు. 23 లక్షలతో కర్నూలు జిల్లా బ్యాంకు, రు. 16, 34 వేలతో చిత్తూరు బ్యాంకు, 18 లక్షలతో కాకినాడ బ్యాంకు.

ఈ కోపరేటివ్ బ్యాంకులు నామమాత్రపు 2%-3% వడ్డీ రేట్లతో రైతులకు అప్పులిస్తూ, హెచ్చువడ్డీ రేట్లు వసూలుచేసే గ్రామ వడ్డీ వ్యాపారస్తుల కోరల నుండి రైతులను రక్షించడమే ఈ కోపరేటివ్ బ్యాంకుల స్థాపనలో ప్రధానోద్దేశ్యం. కాని ఈ బ్యాంకులు పెత్తందార్లు, రాజకీయ "నాయకుల" చేతుల్లోకి పోవడంచేత ఈ బ్యాంకుల స్థాపనోద్దేశ్యం నెరవేరడంలేదు. పాలకవర్గంగా కూర్చున్నవారి, వారి మిత్రుల అవసరాలను తీర్చేందుకే ఇవి ఈనాడు ప్రధానంగా ఉపయోగపడుతున్నాయి. ఉత్తమాశయాలతో ప్రారంభించబడిన కోపరేటివ్ బ్యాంకులు, బీద రైతులకు ఉపయోగపడాలంటే తక్షణం వీటిని స్వార్థపరుల చేతినుండి విడిపింపచేయాలి. నాడే కోపరేటివ్ బ్యాంకులు పేదప్రజలకు తోడ్పడగల్గుతాయి. కోపరేటివ్ బ్యాంకులు అభివృద్ధి అవుతాయి.

* ఈ బ్యాంకుల వివరాలు అధ్యాయం చివర పొందుపరచబడ్డాయి.

## 1948-'49 లో ఆంధ్రదేశంలోని కాలువలపై జరిగిన సరుకు రవాణా (1)

| సరుకు వివరం | గోదావరి కాలువలు సరుకు (టన్నుల్లో) | గోదావరి కాలువలు విలువ (రూపాయల్లో) | కృష్ణ కాలువలు సరుకు (టన్నుల్లో) | కృష్ణ కాలువలు విలువ (రూపాయల్లో) | బకింగ్‌హామ్ కెనాల్ సరుకు (టన్నుల్లో) | బకింగ్‌హామ్ కెనాల్ విలువ (రూపాయల్లో) | దుమ్ముగూడెం కాలువ సరుకు (టన్నుల్లో) | దుమ్ముగూడెం కాలువ విలువ (రూపాయల్లో) |
|---|---|---|---|---|---|---|---|---|
| పత్తి, దాని సంబంధమైన ముడి సరుకు | 836 | 1,92,060 | 754 | 29,67,400 | ... | ... | 11 | 38,500 |
| రంగులు | 117 | 6,81,000 | 114 | 1,47,861 | ... | ... | ... | ... |
| బియ్యం, ధాన్యం | 1,15,615 | 3,11,22,878 | 78,007 | 1,89,04,835 | 7,092 | 21,27,600 | 2 | 616 |
| ఇతర ఆహార ధాన్యాలు | 6,795 | 30,57,570 | 14,129 | 70,64,500 | 6,159 | 55,43,100 | 76 | 31,200 |
| తోళ్ళు-చర్మాలు | 61 | 31,200 | 435 | 6,47,920 | ... | ... | ... | ... |
| సారాయి | 133 | ... | 4 | 20,000 | 639 | 23,00,400 | 6 | 33,000 |
| లోహాలు | 4,493 | 79,84,400 | 1,136 | 64,44,100 | ... | ... | ... | ... |
| నూనెలు | 4,195 | 81,80,250 | 1,841 | 30,81,834 | 1,046 | 19,90,500 | 19 | 37,050 |
| నూనె గింజలు | 1,569 | 21,96,600 | 12,683 | 66,99,160 | 598 | 4,18,600 | 37 | 51,800 |
| చిల్లర సరుకులు | 93,050 | 6,97,87,500 | 34,360 | 2,72,88,000 | 365 | 5,47,500 | 59 | 41,250 |
| ఉప్పు | 16,633 | 9,14,815 | 1,296 | 7,01,568 | 90,728 | 1,08,87,360 | 173 | 9,515 |
| సుగంధ ద్రవ్యాలు | 367 | 16,14,800 | 12 | 32,400 | ... | ... | ... | ... |
| చక్కెర-బెల్లం | 29,860 | 86,96,300 | 16,991 | 49,60,350 | 611 | 2,74,950 | 31 | 8,450 |
| పొగాకు | 8,626 | 1,27,61,800 | 12,803 | 3,19,66,100 | 7,351 | 1,32,31,800 | 455 | 6,37,000 |
| కట్టడపు సరుకులు | 2,19,487 | 43,04,683 | 4,08,613 | 45,92,347 | 14,406 | 27,22,555 | 60 | 1,02,855 |
| ఇతర సరుకులు | 64,994 | 1,90,89,085 | 34,783 | 57,75,508 | 55,895 | 1,74,44,880 | 109 | 52,795 |

# 1948 – '49 లో ఆంధ్రదేశంలోని కాలువలపై జరిగిన సరుకు రవాణా (2)

| సరుకు వివరం | గోదావరి కాలువలు | | కృష్ణ కాలువలు | | బకింగ్‌హామ్ కెనాల్ | | మద్రాసు‌హూరెం కాలువ | |
|---|---|---|---|---|---|---|---|---|
| | సరుకు (టన్నుల్లో) | విలువ (రూపాయల్లో) | సరుకు (టన్నుల్లో) | విలువ (రూపాయల్లో) | సరుకు (టన్నుల్లో) | విలువ (రూపాయల్లో) | సరుకు (టన్నుల్లో) | విలువ (రూపాయల్లో) |
| కలప | 13,711 | 51,69,950 | 17,770 | 1,10,16,000 | ... | ... | ... | ... |
| వంట చెరుకు | 48,410 | 48,41,000 | 42,390 | 15,26,112 | 1,39,119 | 56,64,760 | ... | ... |
| వెదురు | 19,771 | 64,25,575 | 15,013 | 45,03,900 | 927 | 1,85,400 | ... | ... |
| రాతిసి బొగ్గు | 307 | 92,100 | 3,934 | 4,40,720 | 1,379 | 1,37,900 | 28 | 25,900 |
| జనపనార | 9 | 8,325 | 5 | 700 | ... | ... | ... | ... |
| తెప్పలమీద కలప రవాణా | 77,152 | 3,04,69,315 | 569 | 3,80,100 | ... | ... | 455 | 1,97,600 |
| కిరసన్ వగైరా | ... | ... | ... | ... | 42 | 7,935 | ... | ... |
| మొత్తం ... | 7,26,261 | 21,74,31,386 | 6,98,644 | 13,33,61,414 | 3,26,357 | 6,33,85,240 | 1,521 | 12,73,5[illegible] |

నోటు : బకింగ్‌హామ్ కాలువ మొత్తం పొడవు 258 మైళ్ళు. దూరంలో సుమారు 70 మైళ్ళు తమిళ రాష్ట్రంలో ఉన్నది. ఆంధ్రరాష్ట్రంలో ఉన్న భాగానికి ప్రత్యేకంగా లెక్కలు దొరకకపోవుటచేత, కాలువ అంతటికి సంబంధించిన లెక్కలు ఇవ్వబడినవి.

Source: Administration Department of the Public works department Madras presidency for the year 1948-'49 Pages 45, 46 & 47.

# 1950-'51 లో ఆంధ్ర ఓడరేవులద్వారా జరిగిన ఎగుమతులు - దిగుమతులు (1)

| సరుకు పేరు | భీమునిపట్నం (విలువ రూ.) | | కళింగపట్నం (విలువ రూ.) | | కాకినాడ (విలువ రూ.) | | మచిలీపట్నం (సరుకు టన్నులలో) | | నరసాపూర్ (సరుకు టన్నులలో) | | విశాఖపట్నం (సరుకు టన్నులలో) | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఎగుమతి | దిగుమతి | ఎగుమతి | దిగుమతి | ఎగుమతి | దిగుమతి | ఎగుమతి | దిగుమతి | ఎగుమతి | దిగుమతి | ఎగుమతి | దిగుమతి |
| జనపనార | 5,80,000 | ... | 30,00,000 | ... | | | | | | | | |
| గోగునార | 4,00,000 | ... | | | | | | | | | | |
| తోళ్ళు | 9,004 | ... | | | 18,750 | | | | | | | |
| వివిధ సరుకుల మొత్తం | | | (సరుకుల ఎగుమతులు మొత్తం టన్నులు 1256) | | | 5,01,018 | 15,213 | ... | | 56 | | |
| పొగాకు | | | | | 5,15,05,330 | | | | | | | |
| తాటినార | | | | | 38,32,330 | | | | | | | |
| బొమికల పిండి | | | | | 10,46,546 | | | | | | | |
| ఎముకలు | | | | | 14,057 | | | | | | | |
| ఆముదం | | | | | 8,83,226 | | | | | | | |
| బఠాణీకొమ్ములు | | | | | 1,04,747 | | | | | | | |
| ఉన్నితివాసీలు | | | | | 74,519 | | | | | | | |
| ఆముదపు గింజలు | | | | | 1,83,765 | | | | | | | |
| నూనె గింజలు | | | | | 1,03,560 | | | | | | | |
| ఇతరత్రా సరుకులు | | | | | 13,582 | | | | | | | |

(17)

| సరుకు పేరు | భీమునిపట్నం (విలువ రూ.) ఎగుమతి | భీమునిపట్నం (విలువ రూ.) దిగుమతి | కళింగపట్నం (విలువ రూ.) ఎగుమతి | కళింగపట్నం (విలువ రూ.) దిగుమతి | కాకినాడ (విలువ రూ.) ఎగుమతి | కాకినాడ (విలువ రూ.) దిగుమతి | మచిలీపట్నం (సరుకు టన్నులలో) ఎగుమతి | మచిలీపట్నం (సరుకు టన్నులలో) దిగుమతి | నరసపూర్ (సరుకు టన్నులలో) ఎగుమతి | నరసపూర్ (సరుకు టన్నులలో) దిగుమతి | విశాఖపట్నం (సరుకు టన్నులలో) ఎగుమతి | విశాఖపట్నం (సరుకు టన్నులలో) దిగుమతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆహార పదార్థములు | | | | | మొత్తం ఎగుమతులు టన్నులు 6,633 | మొత్తం దిగుమతులు టన్నులు 1,543 | | | | | | 33,543 |
| గోనె సంచులు | | | | | | | | | | | | 760 |
| యంత్ర సామాగ్రి | | | | | | | | | | | | 1,870 |
| కృడాయిల్, పెట్రోలు వంట ఆయిల్సు | | | | | | | | | | | | [illegible] |
| ఇతర సరుకులు | | | | | | | | | | | 1,31,320 | [illegible] |
| బొగ్గు (Bunker Coal) | | | | | | | | | | | 1,10,498 | |
| బొగ్గు | | | | | | | | | | | 1,883 | |
| ముడి మాంగనీసు | | | | | | | | | | | 6,25,181 | |
| వేరుశెనగ నూనె | | | | | | | | | | | 6,287 | |
| మొత్తం... | | | | | | | 15,213 | ... | ... | 56 | 8,78,769 | 67,394 |

Compiled from Commercial Directory (Madras 1952)

ఐదులక్షలు - అంతకుమించిన పెట్టుబడితో పనిచేస్తున్న కోపరేటివు బ్యాంకులు
(1951 — '52)

| పేరు | పెట్టుబడి-మూలధనం (ఇతరనిధులు) వేల రూ॥లలో | డిపాజిట్లు (వేల రూ॥లలో) |
|---|---|---|
| 1. అనంతపురం జిల్లా కోపరేటివు సెంట్రల్ బ్యాంకు - అనంతపురం | 7,28 | 46,13 |
| 2. చిత్తూరుజిల్లా కోపరేటివు సెంట్రల్ బ్యాంకు - చిత్తూరు | 8,43 | 29,29 |
| 3. కడపజిల్లా కోపరేటివు సెంట్రల్ బ్యాంకు - కడప | 6,90 | 41,75 |
| 4. కృష్ణాజిల్లా కోపరేటివు సెంట్రల్ బ్యాంకు - మచిలీపట్నం | 8,51 | 61,06 |
| 5. నెల్లూరుజిల్లా కోపరేటివు సెంట్రల్ బ్యాంకు - నెల్లూరు | 8,02 | 62,32 |
| 6. రామచంద్రపురం కోపరేటివు సెంట్రల్ బ్యాంకు- రామచంద్రపురం | 5,18 | 31,03 |
| 7. శ్రీకాకుళం కోపరేటివు సెంట్రల్ బ్యాంకు - శ్రీకాకుళం | 6,86 | 19,59 |
| 8. శ్రీ కోనసీమ కోపరేటివు సెంట్రల్ బ్యాంకు - అమలాపురం | 5,88 | 38,13 |
| 9. విజయనగరం కోపరేటివు సెంట్రల్ బ్యాంకు - విజయనగరం | 14,37 | 89,41 |
| 10. విజయనగరం కోపరేటివు టౌనుబ్యాంకు - విజయనగరం | 5,36 | 12,03 |
| 11. విజయవాడ కోపరేటివు సెంట్రల్ బ్యాంకు - విజయవాడ | 11,03 | 84,07 |
| 12. పశ్చిమగోదావరిజిల్లా కోపరేటివు సెంట్రల్ బ్యాంకు - ఏలూరు | 7,81 | 50,15 |
| 13. గుంటూరుజిల్లా కోపరేటివు సెంట్రలుబ్యాంకు - తెనాలి | 9,14 | 70,10 |
| మొత్తం | 104,77 | 635,06 |

Source :—Statistical Tables Relating to Banks in India Pages 96-98

## 1 లక్ష–5 లక్షల రూపాయల మధ్య పెట్టుబడితో పనిచేస్తున్న కోపరేటివు బ్యాంకులు (1951 — '52)

| బ్యాంకు పేరు | పెట్టుబడి – మూలధనం ఇతర నిధులు (వేల రూపాయలలో) | డిపాజిట్లు (వేల రూపాయలలో) |
|---|---|---|
| 1. ఆదోని కోపరేటివు బ్యాంకు – ఆదోని | 1,06* | 2,86* |
| 2. చిత్తూరు కోపరేటివు బ్యాంకు – చిత్తూరు | 3,41 | 16,34 |
| 3. హిందుపూరు కోపరేటివు బ్యాంకు – హిందుపూరు | 1,29 | 3,67 |
| 4. కాకినాడ కోపరేటివు సెంట్రల్ బ్యాంకు – కాకినాడ | 3,59 | 17,80 |
| 5. కర్నూలుజిల్లా కోపరేటివు బ్యాంకు – కర్నూలు | 3,68 | 22,87 |
| 6. మదనపల్లి కోపరేటివు టౌన్ బ్యాంకు – మదనపల్లి | 1,86 | 3,44 |
| 7. రాజమండ్రి కోపరేటివు సెంట్రల్ బ్యాంకు – రాజమండ్రి | 3,80 | 25,96 |
| 8. తాడేపల్లి గూడెం కోపరేటివు బ్యాంకు – తాడేపల్లి గూడెం | 1,12 | 13 |
| 9. తిరుపతి కోపరేటివు అర్బన్ బ్యాంకు–తిరుపతి | 3,23 | 11,00 |
| 10. విశాఖపట్నం కోపరేటివు టౌను బ్యాంకు – విశాఖపట్నం | 2,58 | 5,53 |
| | 25,62 | 109,60 |

* ఇవి 1949–'50 సంవత్సరపు లెక్కలు.

Source : Statistical Tables Relating to Banks in India. Pages122-126

# రహదారులు

రైళ్ళు, రోడ్డులు, కాలువలు మన ప్రధాన రహదారులు. మదరాసు - కలకత్తా రైలు మార్గం, మచిలీపట్నం - హుబ్లీ రైలుమార్గం ఆంధ్రదేశం నడి బొడ్డునుండి పోవుచున్నవి. మదరాసు - బొంబాయి రైలుమార్గంకూడా ఆంధ్ర జిల్లాలగుండా పోతున్నది.

మచిలీపట్నం - మార్మగోవా రైలుమార్గం మీటరుగేజి. ఈమార్గము కృష్ణా, గుంటూరు, కర్నూలు, అనంతపురం జిల్లాలగుండా పోతున్నది. మదరాసు - కలకత్తా లైను (బ్రాడ్ గేజి) మన ఆంధ్రదేశంలో నెల్లూరు, గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరిజిల్లాలు, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలగుండా పోవుచున్నది. మదరాసు-బొంబాయి మార్గము (బ్రాడ్ గేజి) ఆంధ్ర జిల్లాలయిన చిత్తూరు, కడప, అనంతపురం, బళ్లారిజిల్లాలోని ఆంధ్రప్రాంతంగుండా పోవుచున్నది. ఈ ప్రధాన రైలు మార్గాలుగాక అచ్చటచ్చట బ్రాంచి లైనులుకూడా ఉన్నాయి.

మొత్తం 2,090 మైళ్ళ రైలుమార్గం ఆంధ్రదేశంలో ఉన్నది. ఇదిమొత్తం భారతదేశ రైలుమార్గాలలో నూటికి 16.3 వంతులు మాత్రమే! సుమారైన ఆంధ్ర దేశ వైశాల్యములోని ప్రతి వంద చదరపు మైళ్లకు మూడుమైళ్ళ రైలుమార్గము మాత్రమే ఉన్నది.

వాల్తేరు, విజయవాడ, గుంతకల్లు ఆంధ్రదేశంలోని ప్రధాన రైల్వే కేంద్రాలు. ఇవిగాక గూడూరు, తెనాలి, నిడదవోలు, సామర్లకోట, విజయనగరం, నౌపడా, రేణిగుంట, పాకాల, ధర్మవరం, గుంటూరు, గుడివాడ, భీమవరం మున్నగు చిన్న కేంద్రాలు కలవు. ఈ కేంద్రాలనుండి ముఖ్య రైలుమార్గాలకు ఉపశాఖలు పోతున్నాయి.

**రోడ్లు :**

మొత్తం ఆంధ్రదేశంలో 16,249 మైళ్ళ (1951 లో) పొడవుగలిగిన రోడ్లు ఉన్నాయి. వీనిలో 3,899 మైళ్ళు మట్టిరోడ్లు, 11,963 మైళ్ళు కంకరరోడ్లు, 297 మైళ్ళు తారురోడ్లు, 90 మైళ్ళ పొడవుగలిగిన సిమెంటురోడ్లు ఉన్నాయి.

ఆంధ్రజిల్లాలలోకెల్ల చిత్తూరు (1728 మైళ్ళు), అనంతపురము (1321 మైళ్ళు), కృష్ణా (1,472 మైళ్ళు), గుంటూరు (1,672 మైళ్ళు), కర్నూలు (1,303 మైళ్ళు) జిల్లాలలో రోడ్లు ఇతర జిల్లాలలోని రోడ్లకన్న పొడవు ఎక్కువ.

కరువుపనుల పేరుతో అనంతపురం, చిత్తూరు, కర్నూలు జిల్లాలలో అనేక రోడ్లు నిర్మించబడుటచేత, ఈ జిల్లాలలో ఇతర ప్రదేశాలకన్న పొడవైన రోడ్లు ఉన్నవి.

రాష్ట్రంలోని మొత్తం రోడ్ల పొడవులో సుమారు 400 మైళ్ళుమాత్రమే సిమెంటు, తారురోడ్లు. మన రహదార్ల అభివృద్ధికి ప్రభుత్వం తీసుకునే శ్రద్ధకు ఇది చక్కని నిదర్శనం. మిగిలిఉన్న సుమారు 12 వేల మైళ్ళ కంకరరోడ్లలోను, ఏదో కొంత అజమాయిషీక్రింద అట్టిపెట్టబడే ట్రంకురోడ్లు కొద్దిమాత్రమే! మిగిలినవి పల్లెటూరు డొంకల్లా ఉండే రోడ్లు మాత్రమే!

రాష్ట్రంలో 1952 లో 702 రూట్లమీద, సుమారు రెండు వేల బస్సులు తిరుగుతున్నాయి.

క్రింది పట్టికలో 1952 సంవత్సరంలో ఎన్ని రూట్లమీద, ఎన్ని బస్సులు తిరుగుతున్నాయో ఇవ్వబడినది:—

| జిల్లా | | రూట్ల సంఖ్య | తిరిగే బస్సులు |
|---|---|---|---|
| శ్రీకాకుళం | ... | 43 | 107 |
| విశాఖ | ... | 45 | 119 |
| తూర్పుగోదావరి | ... | 48 | 196 |
| పశ్చిమగోదావరి | ... | 47 | 225 |
| కృష్ణా | ... | 36 | 296 |
| గుంటూరు | ... | 55 | 226 |
| నెల్లూరు | ... | 97 | 193 |
| చిత్తూరు | ... | 91 | 183 |
| కడప | ... | 46 | 129 |
| కర్నూలు | ... | 45 | 121 |
| అనంతపురం | ... | 67 | 104 |
| బళ్ళారి | ... | 82 | 111 |
| | మొత్తం | 702 | 2010 |

నోటు: బళ్ళారిజిల్లా మొత్తంగా చేర్చబడింది.

Source : Commercial Directory Madras State. Page 435.

1950-'51 సంవత్సరంలో ఆంధ్రదేశపు రోడ్లమీద 3,48,453 మోటారులు, లారీలు, బండ్లు మున్నగునవి తిరిగినట్లు ప్రభుత్వ అంచనా. ప్రభుత్వానికి మన రోడ్లు, 1950 '51 సంవత్సరంలో రు. 4,63,53,000 ఆదాయాన్ని ఇచ్చినవి. కాని, ప్రభుత్వం వీటిపై 3,69,87,000 మాత్రమే ఖర్చుపెట్టినది.

కా లు వ లు :

సుమారు 1200 మైళ్లు పడవల ప్రయాణానికి వీలయిన నదీ కాలువలున్నాయి. ఇందులో ప్రధానమైనవి కృష్ణా (420 మై॥), గోదావరి (498 మై॥) కాలువలు; బకింగ్‌హామ్ కాలువ (ఆంధ్ర ప్రాంతంలో 200 మై॥) ప్రధానమైనవి.

1948-'49 లెక్కల ప్రకారం సుమారు 7½ లక్షల టన్నుల సరుకు మోయ శక్తిగలిగిన పడవలు యీ కాలువలపై ప్రయాణంచేసినవి. ఒక్క గోదావరికాలువల మీదనే 1948-'49 సంవత్సరంలో సుమారు 5,32,000 ప్రయాణీకులు ప్రయాణం చేశారు. కృష్ణ కాలువలపై ఇదే సంవత్సరంలో సుమారు రెండు లక్షలమంది, బకింగ్‌హామ్ కాలువపై 1½ లక్షలమంది ప్రయాణం చేశారు. మొత్తం 8,80,000 మంది యీ సంవత్సరంలో కాలువలమీద ప్రయాణం చేశారు. ప్రయాణ సౌకర్యాలకు, రవాణాసౌకర్యాలకు, కాలువలు ఎంత ముఖ్యమైనవో యీ సంఖ్యలు తెలియ చేస్తున్నాయి.

మన కాలువలపై 1948-'49 సంవత్సరంలో సుమారు 6,08 వేల రూపాయల ఆదాయం వచ్చింది. ఇందులో గోదావరి కాలువలమీద రు. 1,85 వేలు, కృష్ణ కాలువలమీద రు. 2,42 వేలు, బకింగ్‌హామ్ కాలువమీద రు. 1,71 వెయ్యి వచ్చినవి.

మన రోడ్ల స్వభావ వివరాలు (మార్చి 31, 1951), (మైళ్ళలో)

| సర్కిల్ పేరు | సిమెంటు రోడ్లు | తారు రోడ్లు | కంకర రోడ్లు | మట్టి రోడ్లు | రోడ్లు మొత్తం పొడవు |
|---|---|---|---|---|---|
| 1. విజయనగరం | — | — | 64 | — | 64 |
| 2. ఉత్తర విశాఖపట్నం | 1 | — | 838 | 125 | 964 |
| 3. దక్షిణ విశాఖపట్నం | 8 | 46 | 865 | 122 | 1,041 |
| 4. కాకినాడ | 7 | 35 | 689 | 282 | 1,013 |
| 5. రాజమండ్రి | 3 | — | 476 | 308 | 787 |
| 6. ఏలూరు | 4 | 19 | 754 | 395 | 1,172 |
| 7. కృష్ణా | 20 | 46 | 696 | 710 | 1,472 |
| 8. గుంటూరు | 19 | 6 | 522 | 392 | 939 |
| 9. ఒంగోలు | — | 1 | 574 | 158 | 733 |
| 10. అనంతపురం | 1 | 31 | 1,147 | 122 | 1,321 |
| 11. బళ్ళారి * | 3 | 25 | 1,065 | 190 | 1,283 |
| 12. చిత్తూరు | 1 | 68 | 953 | 706 | 1,728 |
| 13. కడప | 9 | 7 | 943 | 63 | 1,022 |
| 14. కర్నూలు | 3 | — | 1,053 | 247 | 1,303 |
| 15. నెల్లూరు | 11 | 13 | 1,324 | 59 | 1,407 |
| మొత్తం | 90 | 297 | 11,963 | 3,899 | 16,249 |

నోటు : రోడ్ల పొడవులో జిల్లాలవారీ ఇచ్చిన మొత్తం రోడ్ల పొడవుకు, సర్కిల్ వారీ ఇచ్చిన మొత్తం పొడవుకు, వెయ్యిమైళ్ళ తేడా ఉన్నది. ఇది సర్కిల్ డివిజన్‌లో వున్న హెచ్చుతగ్గుల మూలముగా వచ్చిన వ్యత్యాసమని భావిస్తున్నాము.

* బళ్ళారిజిల్లా మొత్తంగా చేర్చబడింది.

Source: Administration Report of the Highways Department 1950-'51, Page53

## 1950-'51 లో రోడ్ల ఆదాయ - వ్యయ వివరాలు

| జిల్లా పేరు | | తిరిగేబండ్ల మొత్తం | మొత్తం పొడవు (మైళ్ళలో) | రోడ్లపై ఖర్చు | రోడ్లపై ఆదాయం |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | ... | 52,961 | 986 | 20,86,744 | 42,26,647 |
| విశాఖ | ... | 2,193 | 894 | 21,37,344 | — |
| తూర్పు గోదావరి | ... | 91,669 | 1,625 | 39,64,516 | 77,99,848 |
| పశ్చిమ గోదావరి | ... | 66,574 | 1,060 | 44,63,263 | 48,19,170 |
| కృష్ణా | ... | 11,354 | 1,275 | 43,74,651 | 50,48,135 |
| గుంటూరు | ... | 55,317 | 1,495 | 58,22,337 | 78,53,781 |
| నెల్లూరు | ... | — | 1,358 | 30,04,235 | 38,97,134 |
| కర్నూలు | ... | 66,765 | 1,248 | 21,76,308 | 30,59,897 |
| బళ్ళారి | ... | 1,046 | 1,174 | 15,32,357 | 27,88,451 |
| అనంతపురం | ... | — | 1,260 | 12,85,625 | 22,36,972 |
| కడప | ... | 571 | 981 | 17,96,382 | 22,95,412 |
| చిత్తూరు | ... | — | 1,685 | 23,43,818 | 23,27,799 |
| మొత్తం | | 3,48,453 | 15,041 | 3,69,87,580 | 4,63,53,246 |

గమనిక: బళ్ళారిజిల్లా మొత్తంగా చేర్చబడింది.

Source: Administration Report of the Highways Department 1950-'51 Page 111.

## 1948 – '49 కాలువ రవాణా వివరాలు

| | గోదావరి కాలువలు | కృష్ణా కాలువలు | కర్నూలు–కడప కాలువ | బకింగ్‌హామ్ కాలువ | దుమ్ము గూడెం కాలువ |
|---|---|---|---|---|---|
| కాలువల్లో పడవలు నడవటానికి వీలయిన దూరం (మైళ్ళలో) | 498 | 420 | 75 | 261 | 2 |
| 1948–'49 సంవత్సరంలో తిరిగిన పడవల మొత్తం సరకు మోయగలశక్తి (tonnage)(టన్నులలో) | 7,72,855 | 6,98,076 | | | 1,066 |
| ప్రయాణీకులు | 5,31,806 | 1,98,768 | | 1,46,937 | 1,044 |
| పడవపన్నులు మొదలైన వాటిద్వారా ఆదాయం | 1,85,423 | 2,41,974 | 513 | 1,71,698 | 11,505 |

నోటు : బకింగ్‌హామ్ కాలువ మొత్తం పొడవు ఇందులో చేర్చబడింది.

Source: Administration Report of the Public Works Department for the Year 1948-'49, Page 44.

# విద్య

విద్యావిషయాలలో ఆంధ్రదేశం చాలా వెనుకబడిఉంది. జనాభాలో నూటికి 14 – 15 మంది మాత్రమే అక్షరాస్యులు. మిగిలిన 86 – 85 మంది నిరక్షరాస్యులు. మన ప్రజల యీ పరిస్థితిని గుర్తించినప్పుడే భవిష్యత్తులో మన జాతి విజ్ఞాన వికాసాలకు ఎంత తీవ్రంగా కృషిచేయవలసి ఉన్నదో అర్థమవుతుంది.

1951 జనాభా లెక్కలలో మొత్తం ప్రజలలోని అక్షరాస్యులు, నిరక్షరాస్యుల వివరాలు ప్రకటించలేదు. కాని లెక్కలు తీసుకొన్న జనాభాలో కొంత భాగానికిమాత్రం యీ వివరాలు ప్రకటించబడ్డాయి. అన్నిజిల్లాలను, అన్నివర్గాల నుండి యీ లెక్కలలో కొంత నిర్ణీతశాతం కల్పటం జరిగింది. కనుక యీ లెక్కలు ఆ యా జిల్లాలలోని విద్యావ్యాప్తిని స్థూలంగా సూచించే అంకెలుగా స్వీకరించవచ్చు.

ఆంధ్రజిల్లాలకు యిచ్చిన సంఖ్యలకు శాతంకడితే అక్షరాస్యులసంఖ్య ప్రక్కపేజీలోని పట్టికలోని విధంగాఉంది.

గత 10 సంవత్సరాలలోనూ మన ప్రజలలో అక్షరాస్యులసంఖ్య నూటికి నాలుగుదాటి పెరుగలేదు. ప్రజలను అక్షరాస్యులుగా చేయడానికి ప్రభుత్వం ఎంత శ్రద్ధతీసుకొంటున్నదీ యీ దశాబ్దపు "అభివృద్ధి"యే చక్కటి ఉదాహరణ.

నేటి ప్రభుత్వ విధానాల ఫలితంగా విద్య క్రమంగా ఉన్నవారి గుత్తసొమ్ముగా తయారవుతున్నది. విద్యాభివృద్ధికి పెద్దమొత్తాలు కేటాయించి విద్యను అన్నివర్గాల ప్రజలకు అందుబాటులోనికి తీసుకొనివచ్చే పరిస్థితికి బదులు, విద్యాలయాలలో ప్రవేశించటం అధికవ్యయప్రయాసలతో కూడుకొన్నదిగా తయారవుతున్నది. విద్యాలయాల నిర్వహణ ఖర్చులలో అధికభాగం విద్యార్థే చెల్లించవలసివస్తున్నది.

కళాశాలా విద్యాదశలో – ఆ విద్యాలయాల నిర్వహణ ఖర్చులలో విద్యార్థులు తమ జీతాలద్వారా నూటికి 61 వంతులు చెల్లిస్తున్నారు. ప్రభుత్వం 21.8 వంతులు మాత్రమే చెల్లించడం జరుగుతున్నది. అలానే సెకండరీ విద్యాలయాల నిర్వహణలోకూడ విద్యార్థులు 55% ఖర్చును భరిస్తూంటే, ప్రభుత్వం 27% ఖర్చును మాత్రమే భరిస్తున్నది. చిట్టచివరకు ప్రాథమికపాఠశాలలలోకూడ విద్యార్థులు – కొద్దో గొప్పో ముడుపులు చెల్లించుకొనవలసి వస్తున్నది.

ఆంధ్ర జిల్లాలలోని అక్షరాస్యుల శాతం

| జిల్లా (1) | | పురుషులలో అక్షరాస్యుల శాతం (2) | స్త్రీలలో అక్షరాస్యుల శాతం (3) | మొత్తం జనాభాలో అక్షరాస్యుల శాతం (4) |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | ... | 14.7 | 4.5 | 9.6 |
| విశాఖపట్నం | ... | 14.3 | 3.8 | 9.0 |
| తూర్పుగోదావరి | ... | 25.4 | 11.4 | 18.4 |
| పశ్చిమగోదావరి | ... | 28.0 | 14.0 | 21.0 |
| కృష్ణా | ... | 27.6 | 15.2 | 21.4 |
| గుంటూరు | ... | 25.4 | 8.8 | 17.1 |
| నెల్లూరు | ... | 19.5 | 5.4 | 12.5 |
| కడప | ... | 23.1 | 4.6 | 13.9 |
| కర్నూలు | ... | 23.9 | 6.7 | 15.3 |
| అనంతపురం | ... | 22.6 | 5.5 | 14.0 |
| చిత్తూరు | ... | 10.9 | 5.3 | 8.1 |
| బళ్ళారి | ... | 22.0 | 5.2 | 13.6 |
| వివిధజిల్లాల సగటు శాతం | | 21.5 | 7.5 | 14.5 |

Source : Census Papers of India - Vol. III Part II B.

నేడు విద్యాలయాలలోని విద్యార్థులు ఏ ఆదాయగ్రూపులనుండి వస్తున్నారో పరిశీలిస్తే యీ విధానపు విష ఫలితాలు బయటపడతాయి. మన సంఘంలో అత్యధికులు (నూటికి షుమారు 85, 90 మందివరకూ) 750 రు॥ సంవత్సర ఆదాయం గలవారే. ప్రాథమిక పాఠశాలలలో యీ కుటుంబాలనుండి వచ్చిన బాలుర శాతం 79 వరకూ ఉన్నది. కాని సెకండరీ విద్యాలయాలకు వచ్చేటప్పటికి యీ గ్రూపు యొక్క శాతం 79 నుండి 40 కు క్షీణించింది. కళాశాలలలో వీరిశాతం 21-24 వరకు తగ్గింది. వృత్తి కళాశాలలలో 14-16% కు దిగజారింది.

రు॥ 2,500 - ఆ పైన సంవత్సర ఆదాయంగల్గిన కుటుంబాలనుండి వచ్చే బాల, బాలికలసంఖ్య, ప్రాథమిక పాఠశాలా విద్యార్థులలో 4% మాత్రమే. కాని సెకండరీ పాఠశాలలలో వీరి సంఖ్య 20% కు - కళాశాలలలో 30 - 40% వరకూ, వైద్యం, ఇంజనీరింగు మున్నగు వృత్తి కళాశాలలలో 40 - 50% వరకూ పెరిగింది.

నేటి విద్యావిధానంలో ఆర్థికస్తోమత లేనివారు ఎలా వెనుకకు నెట్టబడుతున్నారో పై అంకెలే స్పష్టంచేస్తున్నాయి. (ఇతర వివరాలకు పట్టిక చూడండి). కనుకనే మన పాఠశాలలసంఖ్య, విద్యార్థులసంఖ్య, సంవత్సరం గడిచినా పెరగవలసినంత ప్రమాణంలో పెరగడంలేదు.

ఇక రాష్ట్రంలో నిర్వహించబడుతున్న అన్నిరకాలయిన విద్యాలయాల విషయం పరిశీలించితే 1950-'51 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం 18,762 (బళ్ళారి మొత్తంతో సహా) విద్యాలయాలు ఉన్నాయి. 1949-'50 సం॥ సంఖ్యలతో పోల్చి చూచినట్లయితే యీ సంఖ్య 500 మాత్రమే పెరిగింది. ఈ విద్యాలయాలలో 18,02,742 మంది విద్యార్థులు విద్యనభ్యసిస్తున్నారు. 1949-'50 సం॥ విద్యార్థుల సంఖ్యతో పోల్చిన 1950-'51 సం॥లో సుమారు 50 వేలమంది విద్యార్థులు మాత్రమే అదనంగా విద్యాలయాలలో ప్రవేశించారు.

మొత్తం రాష్ట్ర జనాభాలో పురుషులలో ప్రతి నూరుమందిలో 11 మంది; స్త్రీలలో 6 గురు - సగటున 8 మంది మాత్రమే 1950-'51 సం॥లో విద్యాలయాలలో విద్య అభ్యసించడం జరిగింది.

కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరిజిల్లాలు యీవిషయంలో ఇతర జిల్లాలకన్న కొద్దిగా మెరుగుగా ఉన్నాయి. అక్షరాస్యుల సంఖ్యలోకూడ యీ జిల్లాలదే యితర జిల్లాలకన్న ముందడుగు. అనంతపురం, విశాఖ, బళ్ళారి జిల్లాలు విద్యావిషయకంగా చాలావెనుకబడి ఉన్నాయి. ఇచ్చట నూటికి 6 గురుమాత్రమే విద్యాలయాలలో ఉన్నారు (జిల్లావారీ వివరాలకు పట్టిక చూడుడు).

ప్రాథమిక విద్య :

1951 సం॥ లెక్కలప్రకారం ఆంధ్రరాష్ట్రంలో 17,215 గ్రామాలు ఉన్నాయి. ఇందులో 14,328 గ్రామాలు రెండువేలు - అంతకులోపు జనాభాగల్గి ఉన్నాయి. కాని 1950-'51 సం॥ లెక్కలప్రకారం 16,936 ప్రాథమిక పాఠశాలలు ఆంధ్రజిల్లాలలో నిర్వహించబడుతున్నాయి. ఈ అంకెలనుచూచి ఆంధ్రరాష్ట్రంలో ఒక్క ప్రాథమిక పాఠశాలకూడ లేని గ్రామాలు మూడువందల నాకే ఉన్నాయని సంతృప్తిపడరాదు. పెద్దగ్రామాలలోనూ, పట్టణాలలోనూ ఒకటికన్న అధికంగా పాఠశాలలుంటాయనీ అవి మొత్తం సంఖ్యలో నాల్గు, నాల్గున్నరవేల వరకూ ఉంటాయనీ గుర్తుంచుకోవాలి. అప్పుడే మన ప్రాథమిక విద్యా స్థితిగతులు బయట పడతాయి.

రెండువేలు-అంతకులోపు జనాభాగల్గిన గ్రామాలు 1941 సం॥ జనాభా లెక్కల ప్రకారం 14,354 మనకు ఉండగా (1951 సం॥ జనాభాలెక్కల ప్రకారం కూడ యీ సంఖ్య 14,328) అందులో 4,799 గ్రామాలలో ఒక్క ప్రాథమిక పాఠశాలకూడ లేదు. అనగా రెండువేలు - అంతకులోపు జనాభాగల్గిన గ్రామాలలో నూటికి 33 కి ఒక్క ప్రాథమిక పాఠశాలకూడ లేదు. ఆంధ్రరాష్ట్రంలోని మొత్తం గ్రామాలసంఖ్యతో దీనిని పోల్చిచూస్తే - మనకున్న ప్రతినాల్గు గ్రామాలలోనూ ఒకదానిలో ఏరకమైన పాఠశాలకూడా లేదని తేలుతుంది.

ఒక్క పాఠశాలకూడలేని గ్రామాల జిల్లాలవారీ విభజన ప్రక్క పేజీ పట్టికలోని విధంగా ఉన్నది.

| జిల్లా | 1951 సం॥ లెక్కల ప్రకారం 2,000 లోపు జనాభాగల మొత్తం గ్రామాలు | ఒక్క పాఠశాల కూడ లేని గ్రామాల సంఖ్య |
|---|---|---|
| శ్రీకాకుళం | 2,417 | 1,059 |
| విశాఖ | 1,035 | 350 |
| తూర్పుగోదావరి | 980 | 466 |
| పశ్చిమగోదావరి | 795 | 68 |
| కృష్ణా | 1,052 | 103 |
| గుంటూరు | 1,204 | 119 |
| కర్నూలు | 717 | 136 |
| అనంతపురం | 997 | 391 |
| కడప | 829 | 222 |
| నెల్లూరు | 1684 | 644 |
| చిత్తూరు | 1808 | 872 |
| బళ్ళారి | 836 | 369 |
| మొత్తం | 14,354 | 4,799 |

(అదనపు వివరాలకు పట్టిక చూడుడు)

ఇదీ మన ప్రాథమిక విద్యావిధానస్థితి! దీనికి తోడు 1960 సం॥ కు దేశమంతటా ఉచిత, నిర్బంధ ప్రాథమిక విద్యను బాల,బాలికలకు 14 సం॥ వయస్సు వచ్చువరకూ అమలు జరుపుతామని భారత రాజ్యాంగంలో పొందు పర్చబడింది. నూటికి 25 గ్రామాలలో పాఠశాలలే లేనిది, ఇక వీరురానున్న 6 సంవత్సరాలలో ఉచిత నిర్బంధ విద్యను అమలు జరుపగలరా?

1945 – '46 సం॥ లో బ్రిటిష్ ఎడ్వైజర్ల పాలనలోనే యీ ఉచిత నిర్బంధ విద్యావిధానమని ఒక ప్రణాళిక ప్రారంభింపబడింది. 1945–'46లో ఆంధ్రజిల్లాలలో 220 గ్రామాలతో ప్రారంభించి యీ సంఖ్యను 1946 – '47 కు 389 గ్రామాలకుపెంచటం జరిగింది. కాని 1947–'48 లోని కాంగ్రెసు ప్రభుత్వం యీ సంఖ్యను 327 కు కుదించింది. దీనికితోడు బీదవిద్యార్థులకు మధ్యాహ్నం పాఠశాలలలో ఉచితంగా భోజనం పెట్టే ఏర్పాటునుకూడ తొలగించింది. 1946–'47 సం॥ నుండి యీ నిర్బంధ విద్యా కేంద్రాలు సంవత్సర సంవత్సరానికీ తగ్గుతూవస్తున్నాయేగానీ, అభివృద్ధి మాత్రం చెందడంలేదు. ఇక మరి 1960 కు అన్ని గ్రామాలలో యీ ప్రణాళికనెలా అమలు జరుపుతార్లో అర్థం అవడంలేదు.

నడుస్తున్న నిర్బంధ కేంద్రాలలో విద్యావయస్కులైన బాలబాలికలలో నూటికి 70 నుండి 80 మంది వరకూ పాఠశాలలకు హాజరవుతున్నట్లు ప్రభుత్వ

రిపోర్టులు చిత్రిస్తున్నాయి. కాని ఇవి దొంగలెక్కలని ప్రతి ఒక్కరూ ఎరిగినదే. ప్రభుత్వ అధికారులు ప్రారంభిస్తున్న నిర్బంధ చర్యలనుండి తప్పుకోవడానికి స్థానికంగా ఉండే ఉపాధ్యాయుడు, తల్లిదండ్రులు గ్రామంలోని విద్యాలయవయస్కులైన బాలబాలికలను పాఠశాల రిజిస్టరులో చేర్పించడం జరుగుతుందే గాని - అందులో నాల్గవవంతుకూడ యథార్థానికి నిత్యం పాఠశాలకు హాజరయ్యేవారు ఉండరు.

1949 - '50 సం॥ విద్యాశాఖ రిపోర్టే యీ సత్యాన్ని అంగీకరిస్తున్నది. 1948 - '49 సం॥ లో నిర్బంధ కేంద్రాలలో 88.8% మంది బాలురు, 77.8% మంది బాలికలు పాఠశాలలకు హాజరయ్యారట. కాని 1949 - '50 సం కు యీ సంఖ్య - బాలురలో 77.8% కు - బాలికలలో 72.1%కు క్షీణించింది. తల్లిదండ్రులపై నిర్బంధ చర్యలను అమలు జరుపుతామనే బెదరింపులతోనూ, జరిమానాలతోనూ ఈ బూటకపు లెక్కలు ప్రచురించేదానికన్న నిర్బంధవిద్యావిధానాన్ని జయప్రదం చేయడానికి అవసరమయ్యే ఆర్థిక, సాంఘిక ప్రచార చర్యలను ప్రభుత్వం చేకొనటం అత్యావసరం.

ఆంధ్ర దేశంలో జిల్లాలవారీగా నడుపబడుతున్న నిర్బంధ విద్యాకేంద్రాలు, వాటి "పురోభివృద్ధి" తెలియబర్చే పట్టిక యీ క్రింద యివ్వబడింది.

| జిల్లా పేరు | నిర్బంధ విద్యా కేంద్రాలు 1945-'46 | 1946-'47 | 1947-'48 |
|---|---|---|---|
| ఉభయ విశాఖలు ... | 23 | 22 | 31 |
| తూర్పు గోదావరి ... | 16 | 15 | 20 |
| పశ్చిమ గోదావరి ... | 13 | 16 | 13 |
| కృష్ణా ... | 16 | 17 | 17 |
| గుంటూరు ... | 67 | 68 | 47 |
| కర్నూలు ... | 9 | 47 | 36 |
| అనంతపురం ... | 8 | 45 | 21 |
| కడప ... | 14 | 30 | 34 |
| నెల్లూరు ... | 17 | 30 | 40 |
| చిత్తూరు ... | 31 | 64 | 50 |
| బళ్ళారి ... | 6 | 35 | 18 |
| మొత్తం. | 220 | 389 | 327 |

గమనిక : బళ్ళారిజిల్లా మొత్తంగా పరిగణించబడింది.

— 1950 - '51 ప్రభుత్వ విద్యాశాఖ రిపోర్టు పేజి 74.

కనీసం మ్యునిసిపల్ పట్టణాలలో నయినా యీ ప్రణాళిక అమలుజరపడానికి ప్రయత్నించిన పాపాన పోవడంలేదు. మనకు మొత్తం 35 మ్యునిసిపల్ పట్టణాలు ఉండగా, అందులో 5 పట్టణాలలోమాత్రం (విశాఖపట్నం, రాజమండ్రి,

ఏలూరు, హిందూపురం, ప్రొద్దుటూరు) బాలురకు నిర్బంధ ప్రాథమికవిద్య అమలు జరుపుతున్నట్లు ప్రకటించబడింది. మరొక నాల్గు పట్టణాలలో (విజయవాడ, బందరు, నెల్లూరు, కాకినాడ 11 వార్డులలో మాత్రం) బాల, బాలికలకు నిర్బంధ ప్రాథమిక విద్య అమలు జరుపుతున్నట్లు ప్రకటించబడింది.

ఈ స్థితిగతుల నంతంజేసి ప్రాథమిక విద్యను జయప్రదంగా కొనసాగించాలంటే అనుభవశాలురు, అభిలాషాపరులైన ఉపాధ్యాయులను తరిఫీదు చేయడం అత్యావసరం. ప్రతి విద్యార్థినిగూర్చి వ్యక్తిగత శ్రద్ధ తీసుకునే సావకాశం ఉపాధ్యాయునికి ఉన్నప్పుడే విద్యార్థియొక్క విద్యాభివృద్ధిని ఉపాధ్యాయుడు చూడగలడు. నేటి మన విద్యాలయాలలో యీ అవకాశాలు ఏకోశానా కన్పించవు.

అనుభవజ్ఞుడైన ఉపాధ్యాయుడంటే కనీసం ట్రయినింగుపొందిన ఉపాధ్యాయుడు. మనకు ప్రాథమిక పాఠశాలలలోనే వీరి సంఖ్య కొరతగా ఉంది. మొత్తం ప్రాథమిక ఉపాధ్యాయులలో నూటికి 8-9 మంది వరకూ ట్రయినింగు కానివారే! జిల్లావారీగా యిచ్చిన యీ క్రింది పట్టిక ట్రయినింగు పొందిన ప్రాథమిక ఉపాధ్యాయులు – మొత్తం ప్రాథమిక ఉపాధ్యాయులలో ఏ శాతంలో ఉన్నదీ తెలియజేస్తున్నది.

| జిల్లా | | మొత్తం ప్రాథమిక ఉపాధ్యాయులలో ట్రయినింగు పొందినవారి శాతం | ట్రయినింగు పొందిన ఉపాధ్యాయుడు సగటున బోధించే విద్యార్థుల సంఖ్య |
|---|---|---|---|
| ఉత్తర విశాఖ | ... | 86 | 34 |
| దక్షిణ విశాఖ | ... | 90 | 34 |
| తూర్పుగోదావరి | ... | 98 | 29 |
| పశ్చిమగోదావరి | ... | 97 | 29 |
| కృష్ణా | ... | 94 | 31 |
| ఉత్తర గుంటూరు | ... | 98 | 44 |
| దక్షిణ గుంటూరు | ... | 95 | 30 |
| కర్నూలు | ... | 95 | 33 |
| అనంతపురం | ... | 96 | 33 |
| కడప | ... | 98 | 33 |
| నెల్లూరు | ... | 97 | 31 |
| చిత్తూరు | ... | 95 | 35 |
| బళ్ళారి | ... | 90 | 35 |
| **ఏజన్సీ :** | | | |
| విశాఖపట్నం | ... | 61 | 47 |
| తూర్పుగోదావరి | ... | 84 | 30 |
| పశ్చిమగోదావరి | ... | 73 | 30 |

(1949 – '50 విద్యాశాఖ రిపోర్టు నుండి)

అనుభవజ్ఞులయిన ఉపాధ్యాయులు కరువవటం అనే సమస్యయేగాక, ఉన్న వారిపై కూడ తలకుమించిన సంఖ్యలో విద్యార్థులను వప్పజెప్పడంచేత, విద్యార్థిపై వ్యక్తిగత శ్రద్ధ తీసుకొనే వీలులేకుండా పోతున్నది. ప్రాథమికవిద్యలో ఉపాధ్యాయు నికి 15-18 మంది విద్యార్థులుదాటి ఉన్న, వారిపైవ్యక్తిగత అజమాయిషీజరగదు. ఇట్టి పరిస్థితులలో మన పాఠశాలలలో ఉపాధ్యాయుడు కనీసం 19 మంది నుండి 47 మంది విద్యార్థులవరకూ అజమాయిషీ వహించటం జరుగుతున్నది. ఫలితం చదువు రాని పాఠశాలా కాలక్షేపం.

ఈ ఉపాధ్యాయులకిచ్చే జీతాలు మరీ అన్యాయం. భావిపౌరులను విద్యా వంతులజేసే మహత్కార్యాన్ని వీరి కొప్పగించి వీరికి దఫేదారులకన్నా అధ్వాన్నంగా జీతాలు యివ్వడం జరుగుతున్నది. కనుక వీరు పొట్టకక్కుర్తికి పాఠశాలా నాటకం కొనసాగిస్తూనే, ప్రక్కప్రక్కన ప్రయివేట్లు చెప్పుకొని, కరిణీకాలు చూసుకొని పోషించుకోవడం జరుగుతున్నది. దీని ఫలితంగా అత్యధిక ప్రాంతాలలో ప్రాథమిక విద్య ఒక తమాషాగా తయారయింది.

ఈ అధ్వాన్న పరిస్థితులమూలంగా మొదటి సంవత్సరంలో జేరిన విద్యార్థు లలో చాలాభాగం రెండవసంవత్సరంలోనూ; రెండవ సంవత్సరంవారు మూడవ సంవ త్సరంలోనూ, యిలా వరుసగా చాలామంది విద్యకే తిలోదకాలివ్వడం జరుగుతున్నది. ఒకటవ తరగతినుండి 5వ తరగతివరకూ ప్రాథమికవిద్యాదశ. ఈ 5 సంవత్సరాల విద్య సంపూర్ణమయినప్పుడే అతను అక్షరాస్యుడుగా పరిగణింపబడాలి. కాని మనరాష్ట్ర విద్యాపరిస్థితులు అలా కన్పించవు. ప్రభుత్వ లెక్కలే యీ పరిస్థితిని యిలా వివరిస్తున్నాయి.

1946 - '47 సం॥ లో మొత్తం మద్రాసురాష్ట్రంలో 12,22,775 మంది బాల, బాలికలు ఒకటవతరగతిలో చేరారు. వీరు తమ విద్యను వదలకుండా కొనసా గించినట్లయితే 1950-'51 సం॥ కు 5వ తరగతికి చేరాలి. కాని 1950 - '51 సం॥లో 5వ తరగతిలో 4,61,686 (దాదాపు మూడవవంతు) మంది మాత్రమే కలరు. మిగతా 7,61,089 మంది మధ్యలో తమ విద్యకు తిలోదకాలిచ్చినవారే.

మరొకవిధంగా యీ సంఖ్యలను అర్థంచేసుకోవాలంటే, 1946-'47 లలో ఒకటవ తరగతిలో జేరిన ప్రతి 4 బాలురు, 4 బాలికలలో 1950 - '51 లో 5వ తర గతిలో 2 బాలురను, ఒక బాలికనుమాత్రమే చూడగలం. అనగా ప్రాథమిక పాఠ శాలలలో జేరే బాలురలలో 50%, బాలికలలో 25%మాత్రమే నిజానికి అక్షరాస్యు లుగా పరిగణించాలి.

ఈ నికృష్టపు పరిస్థితులపై వ్యాపించి ఉన్న అసంతృప్తినెల్ల రాజాజీ చిటికలో పరిష్కరించ నెంచారు. కనుకనే "నూతనవిద్యా విధానం" అనుపేర ఒంటి పూట బడులు ప్రారంభించారు. దీనిద్వారా నేడు ప్రాథమిక పాఠశాలలకు హాజరయ్యే విద్యార్థుల సంఖ్యను రెట్టింపుచెయ్యవచ్చునని సూత్రీకరించారు.

నిజానికి నేడు మన ప్రాథమిక పాఠశాలలలో గ్రాంటుకోసకు, పాఠశాలలకు ఏరోజూ హాజరుగానివారిపేర్లు వ్రాసుకొనటం జరుగుతున్నదేకాని – నిత్యం హాజరవగల్గిన ఆర్థికస్థోమత ఉన్న బాలబాలికలకు పాఠశాలలలో స్థలం కరువు అవలేదు. కనుక నేడు "నూతనవిద్యావిధానం" క్రింద ఉపాధ్యాయులు తమగ్రాంటులను నిలుపుకొనడంకోసం తామిచ్చిన విద్యార్థుల జాబితాను రెండింతలు చేయడానికి ప్రయాస పడవలసి వస్తున్నది. బాలబాలికలు మాత్రం "వృత్తివిద్య"ను నేర్చుకొనేపేర, "ప్రకృతి పాఠాల"పేర చెట్లు, పుట్టలు పట్టుకుని తిరగటం, వచ్చిన రెండుఅక్షరాలు మరచిపోవటం సంభవిస్తున్నది.

బాలబాలికలలో యీ పరిణామం ఎలావస్తున్నా – మద్రాసుప్రభుత్వం నూతనంగా ఒకకమిటీనివేసి యింతకుమించిన విద్యాసంస్కరణలు లేవని భుజాలు చరిచుకొన్నది. నిరక్షరాస్యతను "క్షణం"లో తొలగించే యీ ప్రణాళికను ప్రజలు ఎందుకు నిరసించాలో తమకు తెలియటంలేదని వాదనలుతెస్తూ – దాని వెనకాల యీ "నూతనవిద్యావిధానం" ద్వారా ఉద్భవిస్తున్న విషఫలితాలను దాచిపెట్టనెంచింది.

ఆంధ్రరాష్ట్రం విడివడకముందే యీ ప్రణాళికను మద్రాసురాష్ట్రంలో అమలుజరుపుటచేత, ఆంధ్రలోకూడ యిది అమలు జరుపబడ్డది. అసెంబ్లీలోని అధిక సంఖ్యాక సభ్యులు యీ ప్రణాళికను తిరస్కరించినా, రాజాజీ తన ప్రణాళికను అంటిపెట్టుకొనే తన ప్రజాస్వామిక అభిమానాన్ని ప్రకటించారు. అలానే ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం అనంతరం ఆంధ్రప్రభుత్వంకూడ యీ రాజాజీ ప్రణాళికను తూచ తప్పకుండా అమలుజరుపుతూ వస్తున్నది.

ప్రాథమిక విద్యారంగంలో దినదినం వ్యాపిస్తున్న క్షీణతను ఎదుర్కొనాలంటే యీ "నూతనవిద్యావిధానాన్ని" తక్షణం రద్దుచేయుటం అత్యవసరం. అందుకు విద్యాభిమానులు ఎల్లరూ పూనుకోవాలి. దాని స్థానంలో ఆంధ్ర బాలబాలికలకు సరియైన విజ్ఞానాన్ని కలిగించే విద్యావిధానాన్ని అమలు జరపటం అవసరం.

## సెకండరీ విద్య

**1951** లెక్కలప్రకారం ఆంధ్రజిల్లాలలో **538** సెకండరీ పాఠశాలలు ఉన్నాయి. వీనిలో **2,31,200** మంది బాలబాలికలు విద్య నభ్యసిస్తున్నారు. పై పాఠశాలలలో **481** బాలుర పాఠశాలలు – వీటిలో **2,03,242** మంది బాలురు, **15,284** మంది బాలికలు మొత్తం **2,18,773** మంది విద్య నభ్యసిస్తున్నారు. బాలికల సెకండరీ పాఠశాలలు మనరాష్ట్రంలో **57** మాత్రమే ఉన్నవి. వీటిలో **12,279** మంది బాలికలు, **138** మంది బాలురు (క్రింది తరగతులవారు) మొత్తం **12,417** మంది విద్య నభ్యసిస్తున్నారు. రాష్ట్రం మొత్తంలో **1951** సంవత్సరంలో

27,500 మంది బాలికలుమాత్రమే సెకండరీ విద్యను అభ్యసిస్తున్నారంటే స్త్రీ విద్యలో మనరాష్ట్రం ఎంత వెనుకబడిఉన్నదీ స్పష్టమవుతుంది.

1950–'51 సం॥లో ఆంధ్రజిల్లాలలో 90 సెకండరీ విద్యాలయాలు ప్రారంభింపబడ్డాయి. వీటిలో ఒక పాఠశాల మ్యునిసిపాలిటీచేత, మరొకటి ప్రయివేటు వ్యక్తులచేతా స్థాపింపబడగా మిగతా 88 జిల్లాబోర్డుల ఆధ్వర్యానవే ప్రారంభింపబడ్డాయి. వీటికికూడ ఉదారులైన దాతల దానాలే ప్రధానాధారం. 1950–'51 సం॥ అనంతరం స్థాపించిన కొత్తపాఠశాలలుకూడ లెక్కలోనికి తీసుకొన్నట్లయితే నేడు ఆంధ్ర జిల్లాలలో 600 సెకండరీ పాఠశాలలు ఉన్నట్లు స్థూలంగా అంచనా వేయవచ్చు. ఈ 600 పాఠశాలలలోని విద్యార్థుల సంఖ్య 3 లక్షలనుండి 3 లక్షల 20వేల వరకూ ఉంటుందనికూడ భావించవచ్చు. ఈ అంచనా ప్రకారం ఆంధ్ర జనాభాలో ప్రతి 200 మందిలో ముగ్గురుమాత్రమే సెకండరీ విద్యను అభ్యసిస్తున్నవారు కానవస్తారు. రాష్ట్రంలో ఉభయగోదావరులు, కృష్ణా, గుంటూరు జిల్లాలు యితర జిల్లాలకన్న ముందుండగా; రాయలసీమ జిల్లాలు, ఉభయవిశాఖలు చాలావెనుకబడి ఉన్నాయి. విశాఖ, ఉభయ గోదావరులలోని ఏజన్సీ ప్రాంతాలు మరీ అన్యాయం. ఇచ్చట జనాభాలోని ప్రతి వెయ్యిమందికీ ఒక్కరు మాత్రమే సెకండరీ విద్య అభ్యసించినవారు కన్పించుతారు.

1950–'51 లెక్కలప్రకారం పురుషులలో ప్రతి 100 మందికి యిద్దరు, స్త్రీలలో ప్రతి 400 మందికి ఒకరూ సెకండరీ విద్యను అభ్యసిస్తూ ఉన్నవారు కానవస్తారు. (వివరాలకు జిల్లాలవారీ పట్టిక చూడండి.)

రాష్ట్రమంతటా సెకండరీ విద్యాలయాలు తగిన సంఖ్యలో వ్యాపించి ఉండకపోవుటచేత సెకండరీ విద్య తగినంతగా అభివృద్ధి చెందుటలేదు. పాఠశాలలు స్వగ్రామమునకు చేరువుగానున్నట్లయితే అధికసంఖ్యాకులు విద్యాలయాలలో చేరడానికికృషిచేస్తారు. కాని విద్యకని పొరుగుగ్రామంలో మకాం పెట్టవలసి వచ్చేటప్పటికి చాల కొద్దిమందికిమాత్రమే యీ ఆర్థికస్థోమత ఉంటుంది. నేడు 38 వేల జనాభా కల్గిన ప్రాంతానికి సగటున ఒక సెకండరీ పాఠశాల ఉంది. ఇందులో రాష్ట్రం మొత్తంలోని పాఠశాలలలో ఒక్క కృష్ణా, గుంటూరు జిల్లాలలోనే మొత్తం పాఠశాలలలో మూడింట ఒకభాగం ఉండుటచేత – యితర ప్రదేశాలలో యీ పరిస్థితి మరింత అన్యాయంగా ఉంటుంది.

దీనికితోడు ప్రభుత్వంకూడ సెకండరీ విద్యావిధానాన్ని ప్రజలకు అందుబాటులో ఉంచుటకు కృషిచేయకపోగా, విద్యార్థుల జీతాలు పెంచడం, పరీక్ష రుసుములను హెచ్చించడం మున్నగునవి చేయటంతోపాటు – విద్యార్థులే సెకండరీ విద్యాలయ నిర్వహణకయ్యే ఖర్చులో అధికభాగం భరించవలసివస్తున్నది. వీటన్నింటి

ఫలితంగా మధ్యతరగతి ప్రజలకుకూడ తమబిడ్డలకు సెకండరీ విద్యగరపటం గగనంగా తయారయింది. సెకండరీ విద్యాలయాల నిర్వహణ విషయంలో మద్రాసురాజధాని సగటు అంకెలు మనకుకూడ వర్తిస్తాయని అంచనా వేసినట్లయితే నేడు నడుపబడుతున్న ప్రతి 100 సెకండరీ పాఠశాలలలోనూ, 50 ప్రయివేటు సంస్థలచేత, 35 జిల్లాబోర్డులచేత, 8 మ్యునిసిపాలిటీలచేత, 7 మాత్రం ప్రభుత్వంచేత నడుపబడుతున్నట్లు కన్పించుతుంది. కాని ఆంధ్రలో ప్రత్యేకంగా గమనించిన, జిల్లాబోర్డులచే నిర్వహించబడే పాఠశాలల సంఖ్య ఆంధ్రలో అధికం. మొత్తం పాఠశాలలలో వీటి సంఖ్య 55–60% వరకూకూడ ఉండునని భావించవచ్చు.

సెకండరీవిద్య గడించడం చాలా ఆర్థికభారంతో కూడుకొన్న సమస్యగా తయారవటంతో యీ విద్యాలయాలలోకూడ పై తరగతులకు పోయినకొలదీ విద్యార్థులు పల్చబడుతున్నారు. మద్రాసు ప్రభుత్వ అంచనాల ప్రకారం ఒకటవఫారంలో చేరిన బాలురలో నూటికి షుమారు 50 మంది, బాలికలలో నూటికి 33 మంది మాత్రమే ఆరవఫారం వరకూ విద్యను కొనసాగిస్తున్నారు. మిగతావారు మధ్యలోనే జారిపోవటం జరుగుతున్నది.

ఈ పాఠశాలలలో ట్రయినింగుపొందిన ఉపాధ్యాయులకొరత తీవ్రముగా ఉన్నది. పనిచేస్తున్న ప్రతి 100 మందిలోనూ 20 మందివరకూ ట్రయినింగుకానివారే. దీనికి తోడు క్లాసులోని విద్యార్థుల సంఖ్యను 45 వరకూ పెంచడానికి ప్రభుత్వం అంగీకరించుటతో ఉపాధ్యాయుడు క్లాసులోని విద్యార్థులపై వ్యక్తిగతంగా శ్రద్ధజూపే పరిస్థితులే లేకుండాపోయ్యాయి. దినమెల్లా పాటుపడే యీ ఉపాధ్యాయులకు పట్టుమని వందరూపాయలు ముట్టడమే కష్టంగా ఉంది. కనుక విద్యార్థుల మొత్తం అభివృద్ధిని ఆలోచించాల్సిన ఉపాధ్యాయులు భుక్తికోసం ట్యూషన్లు వెదకుకొనడం, కాస్త సమర్థులయిన వారు ట్యుటోరియల్ కళాశాలలు స్థాపించటం ప్రారంభించారు. ఈ కారణాలవల్ల మన సెకండరీ విద్యాపరిస్థితి దినదినం దిగజారుచున్నది. ఈ పరిస్థితులను ఆపుచేయుటకు విద్యావిధానంలోనూ, ఉపాధ్యాయుల జీవన పరిస్థితులలోనూ తీవ్రమైన సంస్కరణలను అమలు జరపడం అత్యవసరం. లేకున్న నేటివలె మన సెకండరీ విద్య నానాటికి తీసికట్టు అవుతుంది.

ఉన్నత విద్య:

మనకున్న మొత్తం ఉన్నత కళాశాలలు 30 (Arts and Science Colleges), వృత్తి కళాశాలల సంఖ్య 9.

ఉన్నకళాశాలలలో 26 ఆంధ్రవిశ్వవిద్యాలయానికీ, 4 మద్రాసు విశ్వవిద్యాలయానికీ అనుబంధింపబడిఉన్నాయి. ఇలానే వృత్తికళాశాలలు 9 డింటిలో 8 ఆంధ్ర విశ్వవిద్యాలయానికీ, ఒకటి మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధింపబడిఉన్నాయి. ఆంధ్రరాష్ట్ర అవతరణతోకూడ యీ విద్యాలయాలు ఆంధ్ర విశ్వ విద్యాలయానికి అనుబంధింపబడకుండా బలీయమైన శక్తులు అడ్డుబడుతున్నట్లు కన్పిస్తున్నది.

గత రెండు దశాబ్దాలుగా ఆంధ్రులకు ప్రత్యేక విశ్వవిద్యాలయం ఉన్నా, ఆంధ్రదేశం పారిశ్రామికంగా అభివృద్ధి పొందకపోవుటచేత ఉన్నత విద్య తగినంతగా అభివృద్ధి చెందలేదు. ఇక వృత్తి విద్యల విషయం చెప్పవలసిన పనేలేదు. మనకున్న వృత్తికళాశాలలల్లా 2 వైద్యకళాశాలలు [విశాఖపట్నం, గుంటూరు], 2. ఇంజనీరింగు కళాశాలలు [అనంతపురం, కాకినాడ], 1 వ్యవసాయ కళాశాల [బాపట్ల], 4 ఉపాధ్యాయుల ట్రయినింగు కళాశాలలు [రాజమండ్రి, విజయనగరం, గుంటూరు], 1 వ్యాయామ శిక్షణ కళాశాల [విజయవాడ], 1 లా కళాశాల [విశాఖపట్నం]. వీటిలో గుంటూరులోని వైద్య కళాశాల, అనంతపురంలోని ఇంజనీరింగు కళాశాల స్వయం సంపూర్ణమైన కళాశాలలని చెప్పటాకిని వీలులేదు.

మన విశ్వ విద్యాలయం ఎడల ప్రభుత్వ సవతితల్లిప్రేమ మన యీ అధ్వాన్న పరిస్థితులకు చాలవరకు కారణం. ప్రత్యేకరాష్ట్రం సాధించుకొన్న యీ తరుణంలో మనకు వెటర్నిటీ, అటమిశాస్త్రం మున్నగు అనేక ముఖ్య విషయాలకు ప్రత్యేక కళాశాలలే లేకుండా ఉండడం జరుగుతున్నది. ఉన్న కళాశాలలు, విశ్వవిద్యాలయంకూడ ఆర్థికంగానూ, శాస్త్రపరికరాలను సమకూర్చుకొనటం దృష్ట్యానూ చాలా యిబ్బందులకు లోనుగావటం జరుగుతున్నది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మన విశ్వవిద్యాలయం ఎడల చూపిన పక్షపాతవైఖరి యూనివర్సిటీ కమిషన్ రిపోర్టులో యిచ్చిన యీ క్రింది లెక్కలే రుజువుపర్చుతాయి.

1946 – '49 సం॥ మధ్యలో విశ్వవిద్యాలయ ఆదాయాల్లో ప్రభుత్వగ్రాంట్ల శాతం

| విశ్వ విద్యాలయం | విశ్వవిద్యాలయ ఆదాయంలో గవర్నమెంటు గ్రాంటుశాతం | | |
|---|---|---|---|
| | 1946-'47 | 1947-'48 | 1948-'49 |
| అన్నామలై | 47.62 | 58.1 | 44.1 |
| మద్రాసు | 23.4 | 27.1 | 33.7 |
| అలిఘర్ | 35.7 | 52.5 | 52.0 |
| అలహాబాద్ | 52.88 | 72.58 | 26.8 |
| ఢిల్లీ | 52.4 | 66.7 | 71.6 |
| ఆంధ్ర | 20.4 | 37.4 | 16.1 |

ఈకారణంగా విశ్వవిద్యాలయవిద్య నభ్యసించగోరేవిద్యార్థులు విపరీతమైన ఆర్థికయిబ్బందులకు లోనుగావలసి వస్తున్నది దీనిపర్యవసానం ఉన్నతవిద్య తగినంతగా వృద్ధికాకపోవడం. గత 3-4 సం॥లుగా కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరిజిల్లాలలో ప్రయివేటుసంస్థల, వ్యక్తుల ప్రోత్సాహంతో కొన్ని కళాశాలలు ఉద్భవించాయి. కాని రాయలసీమ జిల్లాలలోమాత్రం ఒక్క చిత్తూరుజిల్లా మినహా, జిల్లాకొక్క కళా

శాలకు మించి లేవు. ఈ కారణంగా అచ్చట ఉన్నతవిద్య మరింత వెనుకబడి ఉండడం జరుగుతున్నది. ఈ తారతమ్యాన్ని నిర్మూలించడానికి నేడు రాయలసీమ జిల్లాల ప్రజలు కోరుతున్నట్లు, అనంతపురంలో ఆంధ్రవిశ్వవిద్యాలయం తన పోస్టుగ్రాడ్యుయేటు కోర్సులను (Post graduate Courses) ఏర్పర్చటం; తిరుపతిలో ప్రత్యేక విశ్వవిద్యాలయాన్ని స్థాపించటం అవసరం.

వృత్తివిద్యా కళాశాలల విషయంలోగూడ నేడున్న లోటును పూడ్చడం అత్యవసరం. ఇందుకు రాయలసీమ జిల్లాలలో ఒక వైద్యకళాశాల, ఒక మైనింగ్ అండ్ మెట్లర్జి కళాశాలను నిర్మించటం అవసరం

ఆంధ్ర దేశంలో నాల్గుమూలలా నేడు దాగి ఉన్న సిరిసంపదలను, ఆంధ్రదేశంగుండా ప్రవహించే జీవనదుల ప్రవాహాలను, ప్రజాజీవనస్థాయిని అభివృద్ధి పర్చుటకును, ఆంధ్ర ప్రజలలో విజ్ఞాన వికాసాలను పెంపొందించుటకును యీ కనీస చర్యలను ఆంధ్ర ప్రభుత్వం అమలు జరపడం అత్యవసరం.

**వివిధ జిల్లాలలోని మొత్తం విద్యాలయాలు - మొత్తం విద్యార్థులు (1950–'51)**

| జిల్లా | విద్యాలయాల మొత్తం సంఖ్య | 1950 - '51 మొత్తం విద్యార్థులు | | | 1950 - '51 మొత్తం జనాభాలో విద్యార్థుల శాతం | | |
|---|---|---|---|---|---|---|---|
| | | బాలురు | బాలికలు | మొత్తం | బాలురు | బాలికలు | మొత్తం |
| శ్రీకాకుళం | 1,760 | 1,06,029 | 48,138 | 1,54,167 | 10.2 | 4.4 | 7.2 |
| విశాఖ | 1,287 | 89,811 | 36,609 | 1,26,420 | 8.8 | 3.5 | 6.1 |
| తూర్పుగోదావరి | 2,173 | 1,38,212 | 83,960 | 1,22,172 | 11.4 | 6 9 | 9.2 |
| పశ్చిమగోదావరి | 1,738 | 1,13,156 | 73,703 | 1,86,859 | 13.3 | 8.7 | 11.0 |
| కృష్ణా | 1,920 | 1,23,682 | 77,071 | 2,00,753 | 13.7 | 8.8 | 11.3 |
| గుంటూరు | 2,813 | 1,85,016 | 1,02,-65 | 2,87,281 | 14.3 | 8.1 | 11.3 |
| కర్నూలు | 1,263 | 71,001 | 31,707 | 1,02,708 | 11.0 | 5.0 | 8.1 |
| అనంతపురం | 897 | 60,157 | 21,931 | 82,088 | 8.6 | 3.3 | 6.1 |
| కడప | 1,162 | 67,986 | 27,265 | 95,251 | 11.4 | 4.8 | 8.2 |
| నెల్లూరు | 1,661 | 1,00,486 | 49,149 | 1,49,635 | 11.1 | 5.5 | 8.3 |
| చిత్తూరు | 1,212 | 87,827 | 34,534 | 1,22,361 | 9.5 | 3.9 | 6.8 |
| బళ్ళారి | 876 | 51,778 | 21,269 | 73,047 | 8.2 | 3.5 | 5.9 |
| | 18,762 | 11,95,141 | 6,07,601 | 18,02,742 | 10.8% | 5.6 % | 8.2% |

Source : Report on Public Instruction in Madras State 1950–'51Pages 152–153

# ఆంధ్రరాష్ట్రం

## విద్యాలయాలు - విద్యార్థులు

బళ్ళారిజిల్లా సంఖ్యలు మొత్తం యివ్వబడ్డాయి.
శ్రీకాకుళం - విశాఖ జిల్లాల మొత్తాలు
కలిపి యివ్వబడ్డాయి.




ఒరిస్సా

మధ్యప్రదేశ్

శ్రీకాకుళం

విశాఖపట్నం

తూ.గోదావరి

హైదరాబాద్

ప.గోదావరి

కృష్ణ

గుంటూరు

బళ్ళారి

కర్నూలు

బంగాళాఖాతం

అనంతపూర్

కడప

నెల్లూరు

చిత్తూరు

మైసూరు

మద్రాసు

### సూచిక

ప్రాథమిక పాఠశాల

ప్రాథమిక పాఠశాలా విద్యార్థులు

సెకండరీ పాఠశాల (లక్షలలో)

సెకండరీ పాఠశాలా విద్యార్థులు

కళాశాలలు (వేలలో)

కళాశాల విద్యార్థులు (వేలలో)

విశ్వవిద్యాలయం
(మార్కులక్రింద జిల్లామొత్తం
సంఖ్యలు యివ్వబడ్డాయి.)

# ఒక్క ప్రాథమిక పాఠశాలకూడ లేని గ్రామాలు

## జిల్లావారీ, జనసంఖ్యలవారీ పట్టిక (1950 - '51)

| జిల్లా | 1941 జనాభా లెక్కల ప్రకారం 2 వేలు, అంతకు తక్కువ జనసంఖ్యగల గ్రామాల మొత్తం సంఖ్య | 1941 సం॥ జనాభా విభజన ప్రకారం ఒక ప్రాథమిక పాఠశాలకూడ లేని గ్రామాల సంఖ్య: 2,000 నుండి 1,000 జనాభాగల గ్రామాలు | 1,000 నుండి 500 జనాభాగల గ్రామాలు | 500-200 మధ్య జనాభాగల గ్రామాలు | 200 జనాభా లోపు గ్రామాలు | 2 వేలు ఆ పై తక్కువ జనాభాగల గ్రామాలలో ఒక్క ప్రాథమిక పాఠశాల కూడా లేని గ్రామాలు |
|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 2,417 | 40 | 131 | 447 | 441 | 1,059 |
| విశాఖ | 1,035 | 14 | 86 | 130 | 120 | 350 |
| తూర్పుగోదావరి | 960 | 22 | 18 | 17 | 409 | 466 |
| పశ్చిమగోదావరి | 795 | — | 5 | 36 | 27 | 68 |
| కృష్ణా | 1,052 | 9 | 24 | 30 | 40 | 103 |
| గుంటూరు | 1,204 | 4 | 15 | 78 | 22 | 119 |
| కర్నూలు | 717 | — | 49 | 40 | 47 | 136 |
| అనంతపురం | 997 | 47 | 83 | 108 | 153 | 391 |
| కడప | 829 | 4 | 16 | 113 | 89 | 222 |
| నెల్లూరు | 1,681 | 9 | 142 | 242 | 251 | 644 |
| చిత్తూరు | 1,808 | 34 | 111 | 382 | 345 | 872 |
| బళ్ళారి | 836 | 29 | 98 | 171 | 71 | 369 |
| మొత్తం | 14,354 | 212 | 778 | 1,794 | 2,015 | 4,799 |

Source: 1950-'51 Report on Public Instruction in Madras State లో Page 173 లో యిచ్చిన లెక్కల ఆధారంతో

# ప్రాథమిక పాఠశాలలు - విద్యార్థులు, విద్యార్థినులు (1950-'51)

| జిల్లా | ప్రాథమిక పాఠశాలలు: మొత్తం పాఠశాలలు | ప్రభుత్వ సంస్థలు | జిల్లాబోర్డు సంస్థలు | పంచాయతీ బోర్డు సంస్థలు | మునిసిపాలిటీ సంస్థలు | ప్రయివేటు సహాయం పొందిన సంస్థలు | ప్రాథమిక పాఠశాలలోని మొత్తం బాలుర సంఖ్య | 1951 పురుషుల జనాభాకు శాతం | ప్రాథమిక పాఠశాలలోని బాలికల మొత్తం సంఖ్య | 1951 స్త్రీల జనాభాకు శాతం | మొత్తం బాల బాలికల సంఖ్య | 1951 జనాభాకు బాల బాలికల శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 1,702 | 2 | 356 | 2 | 9 | 1,333 | 94,632 | 9.13 | 47,437 | 4.4 | 1,42,695 | 6.7 |
| విశాఖ | 1,057 | 6 | 539 | 5 | 52 | 455 | 66,411 | 6.5 | 32,209 | 3.1 | 98,620 | 4.8 |
| తూర్పు గోదావరి | 1,803 | 111 | 760 | 6 | 68 | 858 | 1,00,547 | 3.3 | 75,908 | 6.3 | 1,76,455 | 7.3 |
| పశ్చిమ గోదావరి | 1,553 | 47 | 578 | 15 | 40 | 873 | 83,742 | 9.9 | 67,946 | 8.0 | 1,51,688 | 8.9 |
| కృష్ణా | 1,770 | 48 | 587 | 12 | 64 | 1,059 | 89,834 | 9.9 | 71,764 | 8 2 | 1,61,602 | 9.0 |
| గుంటూరు | 2,566 | 33 | 593 | 4 | 64 | 1,872 | 1,39,732 | 10.8 | 94,823 | 7.5 | 2,34,555 | 9.2 |
| కర్నూలు | 1,199 | 28 | 611 | — | 29 | 531 | 57,390 | 8.9 | 30,102 | 4.8 | 87,492 | 6.9 |
| అనంతపురం | 833 | 58 | 543 | 13 | 43 | 176 | 47,753 | 6.8 | 20,540 | 3.1 | 68,293 | 5.0 |
| కడప | 1,058 | 12 | 460 | 3 | 30 | 553 | 55,179 | 9.3 | 25,379 | 4.5 | 80,558 | 6.9 |
| నెల్లూరు | 1,470 | 90 | 560 | 25 | 24 | 771 | 80,283 | 8.9 | 45,564 | 5.1 | 1,25,847 | 7.0 |
| చిత్తూరు | 1,115 | 27 | 600 | 85 | 17 | 386 | 71,230 | 7.7 | 31,654 | 3.6 | 1,02,914 | 5.7 |
| బళ్ళారి | 810 | 49 | 445 | 2 | 45 | 259 | 41,492 | 6.6 | 19,591 | 3.2 | 61,083 | 5.0 |
| మొత్తం ... | 16,936 | 511 | 6632 | 172 | 485 | 9,126 | 9,28,225 | | 5,62,947 | | 14,91,176 | |

Source : Report on Public lustruction in Madras State. — Page 174.

# సెకండరీ పాఠశాలలు - బాలురు, బాలికలు (1950-'51)

| జిల్లా | మొత్తం పాఠశాలలు | మొత్తం విద్యార్థులు | బాలుర పాఠశాలలు | | | | జనాభాలో వెయ్యి మందికి విద్యార్థులు | బాలికల పాఠశాలలు | | | | [illegible] |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | పాఠశాలలు | బాలురు | బాలికలు | మొత్తం విద్యార్థులు | | పాఠశాలలు | బాలురు | బాలికలు | మొత్తం విద్యార్థులు | |
| శ్రీకాకుళం | 28 | 10,083 | 27 | 9,591 | 369 | 9,960 | 0.92 | 1 | — | 123 | 123 | .45 |
| విశాఖపట్నం | 24 | 13,388 | 20 | 11,924 | 643 | 12,567 | 1.16 | 4 | 7 | 814 | 821 | .15 |
| తూర్పుగోదావరి | 57 | 28,381 | 53 | 24,854 | 2,458 | 27,312 | 2.06 | 4 | — | 1,069 | 1,069 | .29 |
| పశ్చిమ గోదావరి | 53 | 26,009 | 48 | 22,995 | 1,848 | 24,843 | 2.70 | 5 | — | 1,166 | 1,166 | [illegible] |
| కృష్ణా | 77 | 33,367 | 71 | 28,799 | 3,175 | 32,194 | 3.18 | 6 | — | 1,173 | 1,173 | [illegible] |
| గుంటూరు | 111 | 41,940 | 101 | 36,889 | 2,629 | 39,518 | 2.86 | 10 | 58 | 2,364 | 2,422 | [illegible] |
| కర్నూలు | 28 | 13,048 | 25 | 11,808 | 647 | 12,482 | 1.83 | 3 | — | 556 | 556 | [illegible] |
| అనంతపురం | 25 | 10,964 | 22 | 9,863 | 490 | 10,353 | 1.40 | 3 | 7 | 604 | 611 | .16 |
| కడప | 28 | 11,045 | 25 | 9,964 | 436 | 10,400 | 1.67 | 3 | 14 | 631 | 645 | [illegible] |
| నెల్లూరు | 46 | 16,988 | 39 | 14,202 | 1,220 | 15,422 | 1.57 | 7 | 6 | 1,500 | 1,506 | .33 |
| చిత్తూరు | 36 | 15,972 | 31 | 13,838 | 1,152 | 14,990 | 1.49 | 5 | — | 982 | 982 | [illegible] |
| బళ్ళారి | 25 | 10,075 | 19 | 8,515 | 217 | 8,732 | 1.35 | 6 | 46 | 1,297 | 1,343 | [illegible] |
| మొత్తం ... | 538 | 2,31,200 | 481 | 2,03,242 | 15,284 | 2,18,773 | 1.89 | 57 | 138 | 12,279 | 12,417 | [illegible] |

విద్యార్థికి తలఒక్కింటికి సం॥ 1కి సగటు ఖర్చు—దాని ఆదాయ భాగాలు (1950–'51)

| | ప్రభుత్వ భాగం% | స్థానిక సంస్థల భాగం% | విద్యార్థుల జీతాల భాగం% | ఇతర ఆదాయాలు% | మొత్తం ఖర్చు సగటున ఒక్కొక్క విద్యార్థికి రూపాయలలో |
|---|---|---|---|---|---|
| కళాశాలలు | 21.8 ♦ (రు॥46.3) | 0.3 ♦ (రు॥ .7) | 60.8 ♦ (రు॥129.1) | 17.1 ♦ (రు॥36.2) | ♦ (రు॥212.3) |
| సెకండరీ పాఠశాలలు | 27.2 ♦ (రు॥16.7) | 10.9 ♦ (రు॥6.7) | 55.2 ♦ (రు॥33.8) | 6.7 ♦ (రు॥ 4.1) | ♦ (రు॥ 61.3) |
| ప్రాథమిక పాఠశాలలు | 67.8 ♦ (రు॥15.4) | 25.6 ♦ (రు॥6.2) | 1.2 ♦ (రు॥ 0.3) | 5.4 ♦ (రు॥ 1.3) | ♦ (రు॥ 24.2) |
| బేసిక్ పాఠశాలలు | 52.8 ♦ (రు॥11.2) | 41.0 ♦ (రు॥8.7) | 5.5 ♦ (రు॥ 0.1) | 5.7 ♦ (రు॥ 1.2) | ♦ (రు॥ 21.2) |

Source : - Report on Public Instruction. 1950–'51 Page 172

♦ ఈ గుర్తతో బ్రాకెట్లలో యిచ్చిన మొత్తం తల ఒక్కింటికి ఆ యా విద్యాలయాలలో, ఆయా సంస్థలు ఖర్చుపెట్టే మొత్తం. ఇది రూపాయలలో యివ్వబడ్డది.

విద్యాలయాలలోని విద్యార్థుల ఆదాయ విభజన (1950–'51)

[మొత్తం విద్యార్థులలో శాతం]

| కోర్సు | 6000 రు॥ల పైన సంవత్సరం ఆదాయం గలవారు | రు॥ 6,000–2,500 మధ్య ఆదాయం గలవారు | రు॥ 2,500–751 మధ్య ఆదాయం గలవారు | రు॥ 750 లోపు ఆదాయం గలవారు |
|---|---|---|---|---|
| కళాశాలలు–(బాలురు) | 8% | 22% | 46% | 24% |
| కళాశాలలు–(బాలికలు) | 15% | 24% | 40% | 21% |
| ఇంజనీరింగు | 13% | 27% | 46% | 14% |
| వైద్యం | 22% | 30% | 32% | 16% |
| సెకండరీవిద్యాలయాలలోని విద్యార్థులు | 4% | 16% | 40% | 40% |
| ప్రాథమిక–పాఠశాలలు | 1% | 3% | 17% | 79% |

Source: Report on Public Instruction in Madras State. 1950–'51లోని 166–167 పేజీలలోని సంఖ్యల ఆధారాలతో

# వైద్యసహాయం - ఆరోగ్యం

'ఆరోగ్యమే మహాభాగ్యం' అని సామెత. ఆంధ్ర ప్రజలకు అన్ని భాగ్యాలు లోపించినట్లే ఈ ఆరోగ్య భాగ్యంకూడా లోపించింది.

ఆరోగ్య భాగ్యాన్ని నిర్ణయించేది ప్రజల జీవన ప్రమాణస్థాయి, వారి ఆరోగ్య రక్షణకు ప్రభుత్వం వహించే శ్రద్ధాశక్తులు. జనాభాలో నూటికి 90 మంది కడు బీదవారవటం, వీరి జీవన ప్రమాణ స్థాయిని అభివృద్ధి చేసేందుకు ప్రభుత్వం ప్రయత్నించకపోగా, ఆరోగ్యరక్షణలో, వైద్యసహాయం విషయంలో వీరు ప్రదర్శించే అలసత్వం, ఆంధ్ర ప్రజలకు ఈ మహాభాగ్యం అబ్బకుండా చేసిందని వివరాలను పరిశీలించితే విశదమవుతుంది.

ప్రజల జీవన ప్రమాణం :

దేహానికి వ్యాధి నిరోధకశక్తి ఉండాలంటే పుష్టికరమైన ఆహారముండాలి. కాని రెండుపూటల తినుటకే నోచుకోని, నూటికి తొంభై మందిగా ఉన్న బీద ప్రజానీకానికి "పుష్టికరమైన ఆహారం" ఎలా సమకూరుతుంది ?

ఈ విషయం 1950 లో మదరాసు ప్రభుత్వం వివిధ తరగతుల ప్రజలు తీసికొనే ఆహార వివరాలపై (కొన్ని తమిళజిల్లాలతోపాటు) అనంతపురం, బళ్ళారి, గుంటూరు, కర్నూలు, నెల్లూరు, విశాఖపట్నం జిల్లాలలో) విచారణ జరిపించింది. ఈ విచారణ చాలభాగం గ్రామసీమలలోని ప్రజలగూర్చే జరిగింది. అనాధ శరణాలయాలు, విద్యార్థి వసతిగృహాలుకూడా ఈ విచారణలోకి వచ్చాయి. రాష్ట్రం మొత్తంమీద రు 200 ల నుండి రు. 50 ల లోపువరకు ఆదాయాలు వచ్చే 964 కుటుంబాలవారు విచారించబడ్డారు.

ఆదాయాలవారీ ఈ కుటుంబాలవారు ఈ విధంగా విభజించబడ్డారు :

| ఆదాయం | తరగతి విభజన | ఎన్ని కుటుంబాలు |
|---|---|---|
| నెలకు రు 200 లకు పైబడి ఆదాయం వచ్చే కుటుంబాలు | I | 164 |
| నెలకు రు. 100_200 వచ్చే కుటుంబాలు | II | 195 |
| నెలకు రు. 50 _ 100 వచ్చే కుటుంబాలు | III | 300 |
| నెలకు రు. 50 కి లోపు వచ్చే కుటుంబాలు | IV | 305 |

అన్ని కుటుంబాలవారు, (రెండుపూటల తింటున్నట్లు విచారణకమిటీ లెక్కించింది.) అధికంగా బియ్యం, జొన్నలు, రాగులు, సజ్జలు మొదలైన కాయ ధాన్యా (cereals) లనే ప్రధానంగా తింటున్నారు. ఆరోగ్య శాస్త్రజ్ఞులు సూచించి నట్లు శరీరాన్ని పోషించగల పరిమితిలో ఆహారపదార్థాలను (balanced diet) చేర్చి తీసుకోవడం అనేది అన్నితరగతుల కుటుంబాలలోను కనిపించదు.

పప్పుదినుసులు ప్రతివ్యక్తికి దినానికి 3 ఔన్సులు తినాలని శాస్త్రవేత్తలు చెపితే! 1 వ తరగతివారు 2.73 ఔన్సులు, 2 వ తరగతివారు 1.74 ఔన్సులు, 3 వ తరగతివారు 1.88 ఔన్సులు, 4 వ తరగతివారు 10.3 ఔన్సులు మాత్రమే తీసి కొంటున్నారు.

అన్ని కుటుంబాలవారు, కూరగాయలను ముఖ్యంగా ఆకు కూరలను కావలసిన పాళ్ళలో తీసికోవడంలేదు. ఒక ఔన్సుకంటె తక్కువే వీరు తీసుకుంటు న్నారు. 115 కుటుంబాలవారు (మొత్తం విచారించబడిన కుటుంబాలలో నూటికి పన్నెండు కుటుంబాలు) అసలే ఆకుకూరలను తీసికోవడంలేదు. పండ్లు తినడం చాల అరుదు.

పాలు, పాలతో చేసిన పదార్థాల వినిమయంకూడా చాల తక్కువ. ప్రతి వ్యక్తి రోజుకు పది ఔన్సుల పాలు తాగాలని ఆహార సలహా సంఘంవారు సూచిం చారు. కాని, 1 వ తరగతివారు 3.45 ఔన్సులు, 2 వ తరగతివారు 1.87 ఔన్సులు, 3 వ తరగతివారు 1.82 ఔన్సులు, 4 వ తరగతివారు 1.47 ఔన్సులు, సగటున తీసికుంటున్నట్లు ఈ విచారణవల్ల తేలుతున్నది. బీద తరగతివారు (4 వ తరగతి) 305 కుటుంబాలలో నూటికి 52 కుటుంబాలవారు (160 కుటుంబాలు) అసలే పాలు తీసుకోవడంలేదు.

నెలకు 200 రూపాయల ఆదాయంవచ్చే కుటుంబాలవారు కూడా నిర్ణీత పాళ్ళలో శాస్త్రజ్ఞులు నిర్ణయించిన సంపూర్ణాహారాన్ని (Balanced diet) తీసుకోలేక పోతున్నారంటె, ప్రజల జీవన ప్రమాణం ఎంత హీనంగా ఉందో వ్యక్తమవుతుంది.

పోషకపదార్థాలు కావలసిన పాళ్ళలో తీసికోలేక పోవడంవల్ల వ్యాధి నిరోధకశక్తి నీరసించి, అనేకరకాల వ్యాధులకు మన ప్రజలు బలై పోతున్నారు.

మరణాలు:

ప్రతి సంవత్సరం రాష్ట్రంలో సుమారు 4 లక్షలమంది వివిధ రోగాలతో మరణిస్తున్నారంటే, దీని ప్రభావం ఎంత హెచ్చో అవగతమవుతుంది.

మన రాష్ట్రపు చావుల రేటును (Death rate) ఇతర దేశాల చావుల రేటుతో పోల్చి చూస్తే, ఇది ఎంత అధికమో వ్యక్తమవుతుంది.

| ♦ దేశం పేరు | | ప్రతి వెయ్యిమంది జనాభాకు చావులు |
|---|---|---|
| కెనడా | ... | ... 9 6 |
| అమెరికా (U. S. A.) | ... | ... 10.6 |
| జర్మనీ | ... | ... 12.3 |
| బ్రిటన్ | ... | ... 12.2 |
| ఆస్ట్రేలియా | ... | ... 17.6 |
| ఇండియా | ... | ... 21.2 |
| * ఆంధ్ర | ... | ... 23.2 |

పై దేశాల జీవన ప్రమాణస్థాయి మనకంటె అధికం కనుకనే ఆ యా దేశాలలో చావుల రేటు మన రాష్ట్రపు రేటుకంటె ఎంతో తక్కువ.

వివిధ వ్యాధులవల్ల మన రాష్ట్రంలో 1950లో 3,83,873 మంది మరణించారు. మొత్తం మరణించినవారిలో నూటికి 20 పాళ్ళు శిశువులు. నూటికి 60మంది 30 సంవత్సరాలలోపు యువకులు, శిశువులు! ప్రజల ఆరోగ్యస్థితిగతుల ప్రతిబింబించే దర్పణం – ఈ అకాల మరణాలు!

మన రాష్ట్రంలో వస్తున్న ముఖ్యవ్యాధులు: "జ్వరాలు", రక్తవిరోచనాలు – భేదులు, ఊపిరితిత్తుల సంబంధమైన వ్యాధులు, మలేరియా, క్షయ మొదలగునవి. మరణించిన వ్యక్తి వాస్తవంగా ఏవ్యాధితో మరణించాడో దానికి సంబంధించిన వివరాలు మన ప్రభుత్వ రికార్డులలో దొరకవు. ఉదాహరణకు అనేకమంది

♦ "భారత ఆర్థికాభివృద్ధికి పథకం" నుండి 1944.

* మదరాసు రాష్ట్ర సరాసరి "ఆంధ్ర" పేరుతో ఇవ్వబడింది.

ఆకలి మరణాల పాలవుతున్నారు. కాని ప్రభుత్వ రికార్డులలో ఈ "వ్యాధి" అసలు కనుపించదు. పస్తులు ఉండఉండి, ఏదో కొంచెం తినగానే వాంతులు, భేదులు కావడం – చనిపోవడం జరుగుతున్నది. కాని ప్రభుత్వ రికార్డులలో దీనిని ఏదో పేర వ్రాయడం సర్వసామాన్యం. ఇక ఏ జబ్బుతో చనిపోయినా, వ్యాధి "జ్వరం" అని తప్పుగా నమోదు (Recording) చేసే పద్ధతిని హేళనచేస్తూ; ఒకప్పుడు మదరాసు ప్రభుత్వ కార్యదర్శిగా పనిచేసిన యస్. వై. కృష్ణస్వామి ఇలా వ్రాశాడు : "భారత దేశంలో వచ్చే ఏ వ్యాధితో ఒకవ్యక్తి మరణించినా, గ్రామరికార్డులలో సామాన్యంగా జ్వరముతో మరణించినవారి సంఖ్యలో చేర్చబడతాడు." ఈవిధంగా మరణకారణాల విషయంలో ప్రభుత్వ లెక్కలు యధార్థాన్ని దాచివేస్తున్నాయని చెప్పక తప్పదు. ఈ దృష్టితోనే దిగువ లెక్కలు పరిశీలించాలి.

ప్రభుత్వ లెక్కల ప్రకారం 1950 వ సంవత్సరంలో మరణించిన మొత్తం జనాభాలో ఈ "జ్వరాల" వల్ల మరణించినవారు 1,23,592; లేక నూటికి 32.2 మంది. ప్రతి వెయ్యిమంది జనాభాలో, "జ్వరాల" తో చనిపోయేవారు 6.28.

మలేరియావల్ల 1950 లో చనిపోయినది 3,141 (సగటున వెయ్యిమంది జనాభాకు, 0.19 మంది). ఇది చిన్న సంఖ్యగానే కనిపించినా, వాస్తవం ఇందుకు విరుద్ధం! మన దేశంలో, మలేరియానుగూర్చి విచారణ జరిపిన శింటన్, (What Malaria Costs India అనే గ్రంథంలో) "కలరా,మశూచి, ప్లేగు వ్యాధులన్నీ కలసి కలుగ చేస్తున్నంత నష్టాన్ని, భారత దేశానికి ఒక్క మలేరియా కలుగ చేస్తున్నది" అని వ్రాశాడు. కనుక మలేరియా చావులు ఇంతకన్న హెచ్చనీ; "జ్వరం" చావులలో చాల భాగం చేర్చబడి ఉంటాయని తలంచవచ్చు. ఇందుమూలంగా మలేరియావలన కలుగుతున్న జననష్టం, ప్రభుత్వలెక్కలలో వాస్తవికపరిమాణంలో కనిపించడంలేదు.

దీని తర్వాత ఎక్కువమందిని పొట్టనపెట్టుకొనే వ్యాధులు "ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులు" (Respiratory Diseases). వీటివల్ల 1950 లో 28,347 మంది మరణించారు. ప్రతి 1000 మంది జనాభాకు ఈ వ్యాధితో మరణించినవారు 1.41 మంది. ఈవ్యాధి 1949లోకంటె, 1950లో హెచ్చుమందిని పొట్టనపెట్టుకొన్నది. దీనివల్ల చావులు పల్లెలలోకంటె (సగటున మైలుకు 1.38) పట్టణాలలో (సగటున మైలుకు 3.84) అధికంగా సంభవిస్తున్నాయి.

ఈ వ్యాధికి కారణాలు అత్యధికమైన జనసమ్మర్దం, ఇరుకుగా ఉండే ప్రదేశాలలో కాపురము ఉండడం. ఈ స్థితి పట్టణాలలో హెచ్చు కనుక, చావులసంఖ్య కూడా హెచ్చు.

రక్తవిరోచనాలు, భేదులు (Dysentry and Diarrhoea) తరువాత చెప్పదగిన వ్యాధి. దీనివల్ల 1950 లో 22,171 మంది (వెయ్యిమంది జనాభాకు 1.04 మంది) చనిపోయారు.

ఈ వ్యాధివల్ల మరణాలు క్రమంగా అధికమవుతున్నాయి. [illegible] పాలయినవారు ఇందులో చేర్చబడుతున్నారు.

క్ష య వ్యా ధి :

ఆహార లోపంవల్ల వచ్చే వ్యాధులలో ఇది ఒకటి. వైద్యం పొందిన రోగులు 1949 లో 25,505 అయితే, 1950 కి ఈ సంఖ్య 45,337 కు పెరిగింది! దీనినిబట్టి, ఈ వ్యాధి త్వరితగతిని ప్రబలుతున్నట్లు కనబడుతున్నది.

ఈ విషయాన్ని అంగీకరిస్తూ, మదరాసు ఆరోగ్యశాఖా డైరెక్టరు తమ శాఖ సాంవత్సరిక (1950) రిపోర్టులో ఇలా వ్రాశారు : "చికిత్స నిమిత్తం వైద్యశాలలకు వచ్చేవారి సంఖ్య చూస్తే, క్షయవ్యాధి (Pulmonary and non pulmo_nary tuburculosis) సోకటం పెరుగుచున్నట్లు తెలియుచున్నది." ఈ అంకెలలో A తరగతి వ్యాధి సోకినవారి సంఖ్య లేదు. (వీరికి ప్రభుత్వ వైద్యశాలలో చికిత్స చేయరు). కనుక ఈ అంచనాలు, వ్యాధి ప్రబలతను ఉన్నదున్నట్లు చిత్రించక, చాల తక్కువ అంచనాను యిస్తున్నాయి.

ఈ వ్యాధివలన మరణించేవారు సగటున ప్రతి వెయ్యిమంది జనాభాకు 1949 లో 1.31 ♦ అయితే, యిది 1950 కల్లా 1.40 కి పెరిగింది.

అం టు వ్యా ధు లు :

1950 లో మశూచివల్ల 10,364 మంది చనిపోయారు. ఇతర అంటు వ్యాధులకన్న యిది ఎక్కువ మరణాలకు కారణమైనది. కలరావల్ల మరణాలు 6,60'. ఇవి ప్రతి సంవత్సరం ఏదో ఒకమూల ఊడ్చుకుపోతూనే ఉన్నాయి.

ప్లేగువల్ల మరణాలు నామమాత్రం (1950 లో 34). వివిధ వ్యాధులవల్ల లక్షలసంఖ్యలో ప్రజలు చనిపోతూఉంటే, వ్యాధిగ్రస్తుల సంఖ్య అధికమవుతూఉంటే వీరి రక్షణకున్న వైద్య సౌకర్యాలు శోచనీయంగా ఉన్నాయి.

రెండుకోట్ల జనాభా ఉన్న మన రాష్ట్రంలో వైద్యసౌకర్యాలకు, వైద్య విద్యకు కలిపి, ప్రభుత్వం 1953 – '54 బడ్జట్‌లో రు. 82,28,100 లను మాత్రమే కేటాయించింది. తల 1కి వైద్యవిద్యకు, వైద్యసౌకర్యాల నిమిత్తం ప్రభుత్వం 6.73 అణాలు (ఆరణాల ముక్కాలు) మాత్రమే ఖర్చుచేస్తున్నది!

1950 మార్చి 31 వ తేదీకి మనకున్న వైద్యశాలల మొత్తం అన్నిరకాలు కలిపి జిల్లాలవారీ ఈవిధంగా ఉన్నాయి :

♦ ఈ అంచనాలు మొత్తం మదరాసురాష్ట్రపు సగటు అంచనాలు.

1950 మార్చి 31 న ఉన్న వైద్యశాలల వివరాలు

| జిల్లా | వైద్యశాలల సంఖ్య | ♦ ఎంతమంది జనాభాకు ఒక వైద్యశాల? | సగటున ఎన్ని చదరపు మైళ్ళకు ఒక వైద్యశాల? * |
|---|---|---|---|
| శ్రీకాకుళం, విశాఖపట్నం | 98 | 42,814.63 | 98.00 |
| తూర్పు గోదావరి | 85 | 28,409.50 | 66.85 |
| పశ్చిమ గోదావరి | 49 | 34,647.49 | 61.52 |
| కృష్ణా | 51 | 34,891.84 | 68.60 |
| గుంటూరు | 82 | 31,097.51 | 70.38 |
| కర్నూలు | 50 | 25,416.86 | 116.72 |
| అనంతపురం | 46 | 29,729.60 | 145.79 |
| కడప | 34 | 34,168.55 | 174.38 |
| నెల్లూరు | 59 | 30,434.44 | 134.91 |
| చిత్తూరు | 44 | 41,122.20 | 133.75 |
| బళ్ళారి (అన్ని తాలూకాలు) | 43 | 28,919.17 | 136.78 |
| రాష్ట్రంలోని వైద్యశాలలు | 641 | | 100.36 |

దీనినిబట్టి సగటున 33 వేలమంది ప్రజలకు నూరు చదరపుమైళ్ళకు ఒక వైద్యశాల ఉన్నట్లు తేలుతున్నది. కనీసం ఈ రేటుచొప్పునయినా, అన్ని ప్రాంతాలలో వైద్యశాలలు లేవు. శ్రీకాకుళం, విశాఖజిల్లాలలో 43 వేల మంది కొకటి, చిత్తూరుజిల్లాలో 41 వేల మందికి ఒక్క వైద్యశాల ఉన్నది. కర్నూలు, కడప, అనంతపురం, నెల్లూరు జిల్లాల్లో వైద్యశాలలు 170–130 చదరపుమైళ్ళకు ఒక్కటిచొప్పున ఉన్నాయి. గ్రామాలనుండి వైద్యశాలకు వెళ్ళాలంటె కనీసం 50–60 మైళ్ళు ప్రయాణం చెయ్యవలసి ఉంటుంది. ఇంతదూరం వెళ్ళటం, ప్రస్తుతపు ఆర్థికస్థితిగతులలో ఎందరికిసాధ్యం? అందుచేత ఉన్న కొద్దివైద్యశాలల ప్రయోజనాన్నికూడా ప్రజలు పొందలేక పోతున్నారు.

ప్రభుత్వవైద్యశాలలలో 1949లో పనిచేస్తున్న డాక్టర్లు, నర్సులు, మంత్రసానులు (midwives), బెడ్సు (Beds) జనాభాతో పోల్చితే దామాషా ఇలా ఉన్నది:

♦ ఈ అంచనాలు 1951 జనాభా లెక్కలప్రకారం తయారు చేయబడ్డాయి.

* ఈ కాలంలోని సగటుఅంచనాలు, రెండవకాలంలోని ప్రభుత్వవివరాల ఆధారంతో మేము వేశాం.

Source : Madras in Maps.

డాక్టర్లు:

ప్రతి 28 వేల జనాభాకు ఒక్కరు.

నర్సులు:

ప్రతి 33 వేల జనాభాకు ఒక్కరు.

మంత్రసానులు:

ప్రతి 50 వేల జనాభాకు ఒక్కరు.

బెడ్సు:

ప్రతి 4 వేల జనాభాకు ఒక్కటి.

వైద్య విద్య సౌకర్యాలుకూడా ఇదేస్థితిలో ఉన్నాయి. మనకున్న వైద్య కళాశాలలు సంఖ్యకురెండున్నాయి. ఒకటి విశాఖపట్నంలో, రెండవది గుంటూరులో. గుంటూరు కళాశాలలో, కళాశాలకు కావలసిన పూర్తి లాబొరేటరీ సౌకర్యాలు లేక రెండవ సంవత్సర అనంతరమే విద్యార్థులు విశాఖపట్నం కళాశాలకు పంప బడుతూ ఉండటం జగమెరిగిన సత్యం!

---

Wealth and welfare in Madras State, అనేపుస్తకంలో Dr. B. Natarajan ఇచ్చిన మదరాసురాష్ట్రపు వివరాల ఆధారంతో తయారుచేయబడిన అంచనాలు.

* మెడికల్ రిజిష్టరులో 1949 లో రిజిష్టరయిన అన్నిరకముల డిగ్రీలు పొందిన డాక్టర్ల ట్రయినింగుపొందిన నర్సుల, మంత్రసానుల దామాషా ఇలాఉన్నది.

డాక్టర్లు:

6,000 జనాభాకు ఒక్కరు.

నర్సులు:

1,25,000 జనాభాకు ఒక్కరు.

మంత్రసానులు:

8,334 జనాభాకు ఒక్కరు.

ప్రభుత్వ వైద్యశాలలలో పనిచేసేడాక్టర్లు, నర్సులు, మంత్రసానులకంటె ప్రయివేటు ప్రాక్టీసు నర్సు అధికమని ఈ అంచనాలు తెలియచేస్తున్నాయి. ఆచరణలో ఈ డాక్టర్లవలన వైద్యసహాయం డబ్బు చెల్లించుకో గలిగిన కొద్దిమందికి మాత్రమే లభిస్తుందిగాని, ప్రజలందరికి ఒకే ప్రమాణంలో వైద్య సహాయం లభించదు. నర్సులు, మంత్రసానుల విషయంకూడా ఇంతే. అందుచేత అసంఖ్యాక ప్రజానీకం ప్రభుత్వ వైద్యశాలలపై ఉచిత వైద్య సహాయానికి ఆధారపడవలసిందే! కనుక, వాస్తవిక పరిస్థితిని తెలియ చేసేది మొదటి అంచనాలే! రెండవ అంచనాలు చూచి పరిస్థితి మెరుగని తలచరాదు.

శి శు జ న నా లు :

ఆంధ్ర దేశంలో, 1950 లో జననాలు 6,13,863 గా ప్రభుత్వ ఆరోగ్య శాఖ లెక్కలు తేల్చింది. గత 5 సంవత్సరాలలోను సగటున వెయ్యి మంది జనాభాకు శిశు జననాలు 25.49 అయితే, 1950 లో ఇది 30.2 కు పెరిగింది. కొన్ని ముఖ్య దేశాల శిశుజనన పరిమితికంటె మన రాష్ట్ర పరిమితి హెచ్చని, ఈ దిగువపట్టి తెలియచేస్తుంది :

| దేశంపేరు | | వెయ్యిమంది జనాభాకు శిశుజననాలు |
|---|---|---|
| * కెనడా | ... | 20.3 |
| అమెరికా(U. S. A.) | ... | 17.3 |
| జర్మనీ | ... | 20.3 |
| బ్రిటన్ | ... | 15.3 |
| ఆస్ట్రేలియా | ... | 17.7 |
| జపాన్ | ... | 27.0 |
| భారతదేశం | ... | 33.0 |
| ♦ ఆంధ్ర | ... | 30.2 |

రాష్ట్ర మంతటిలోను అనంతపురం జిల్లాలో శిశుజనన పరిమితి (Birth-rate) అధికం (వెయ్యిమంది జనాభాకు 37.53). దీని తరువాత కర్నూలు (33.39) శిశుజనన పరిమితిలో రెండవస్థాన మాక్రమిస్తున్నది. తూర్పుగోదావరి జిల్లాలో ఈ పరిమితి అన్ని జిల్లాలకంటె తక్కువ. (మైదాన ప్రాంతాలలో 25.53, ఏజన్సీ ప్రాంతాలలో 26.17).

శి శు మ ర ణా లు :

మన రాష్ట్రంలో శిశుజనన రేటువలె మరణపు రేటుకూడా ఇతర దేశాలన్నింటికంటె అధికం. 1950 సంవత్సరంలో చనిపోయినవారిలో నూటికి 20.4 మంది శిశువులంటే, శిశు మరణాలు ఎంత అధికంగా ఉన్నాయో అవగతమవుతుంది.

శిశుమరణపు రేటు 1949 లో 1000 జననాలకు 119.81 అయితే, 1950 సంవత్సరంలో 130.13 కు పెరిగింది. గత పది సంవత్సరాలు (1940-'49) సగటురేటు 157.50. చనిపోతున్న శిశువులలో సంవత్సరపు లోపువారు దాదాపు నూటికి 50 మంది !

మన రాష్ట్రపు శిశుమరణాల రేటును కొన్ని విదేశాల రేటుతో పోల్చి చూస్తే ఈ సత్యం మరింత నగ్నంగా కనిపిస్తుంది.

* "భారతదేశ ఆర్థికాభివృద్ధికి పథకము" నుండి

♦ ఆరోగ్యశాఖ సాంవత్సరిక రిపోర్టు 1950

| దేశం పేరు | | మరణపు రేటు (1000 జననాలకు) |
| --- | --- | --- |
| కెనడా | ... | 61 |
| అమెరికా (U. S. A.) | ... | 22.0 (1948) |
| జర్మనీ | ... | 60 |
| ♦ బ్రిటన్ | ... | 32.0 (1949) |
| ఆస్ట్రేలియా | ... | 38 |
| జపాన్ | ... | 114 |
| భారతదేశం | ... | 167 |
| ♦ ఆంధ్ర | ... | 157.50 (1940-'49) |

మన శిశు మరణాలు బ్రిటన్ శిశు మరణాలకు దాదాపు 5 రెట్లు, అమెరికాకు ఏడురెట్లు ! ప్రొఫెసర్ గంగూలీ ఈ విషయాన్నిగూర్చి ప్రస్తావించుతూ ఈ అత్యధిక శిశు మరణాలు, ప్రజారోగ్యం ఎలా ఉన్నదో తెలియజేయుటయేగాక, ఇది నికృష్ట పరిస్థితులకు మూలమని ... కూడా తెలియచేస్తున్నాయని "భారత దేశంలో ఆరోగ్యము-ఆహారము" అనే గ్రంథంలో వ్రాశారు. ఈ విపరీతపు శిశు మరణాలకు ప్రజల బీదతనమే కారణమని మదరాసు ప్రభుత్వ ప్రజారోగ్యశాఖా డైరెక్టరు చేసిన పరిశోధన మూలంగా తెలుస్తున్నది. వీరి అంచనాల ప్రకారం, తక్కువ ఆదాయం వచ్చే బీదల కుటుంబాలలో శిశుమరణపు రేటు అధికమని తేలింది.

**బాలింతల మరణాలు:**

శిశుమరణాలకువలె బాలింతల మరణాలు (Meternal Deaths) అధికమని ప్రక్క-పేజీలో పొందుపరచబడిన పట్టిక తెలియజేస్తున్నది :

ఆంధ్రలో 1950 లో 4,069 మంది బాలింతలు కాన్పు కాలంలో చని పోయారు. ప్రతి వెయ్యి జననాలకు కాన్పుల కాలంలో మరణించిన బాలింతల సగటు 7.22. 1949 లో ఈ రేటు మొత్తం మదరాసు రాష్ట్రానికి 5.78, 1950 లో 6.21, గత పది సంవత్సరాల (1941-'50) సరాసరి రేటు 7.1.

♦ ఈ అంచనాలు మదరాసు ప్రభుత్వ ఆరోగ్యశాఖా సాంవత్సరిక (1950) రిపోర్టునుండి. మిగిలినవన్నీ "భారతదేశ ఆర్థికాభివృద్ధికి పథకం"నుండి.

1950 లో బాలింతల మరణాలు

| జిల్లా | | మరణాలు | సగటున వెయ్యి కాన్పులకు ఎన్ని మరణాలు ? |
|---|---|---|---|
| 1. శ్రీకాకుళం | ... | 255 | 3.94 |
| 2. విశాఖపట్నం | ... | 299 | 5.02 |
| 3. తూర్పుగోదావరి : | | | |
| మైదాన ప్రాంతం | ... | 461 | 8.57 |
| ఏజన్సీ ప్రాంతం | ... | 49 | 9.02 |
| 4. పశ్చిమగోదావరి : | | | |
| మైదాన ప్రాంతం | ... | 349 | 8.36 |
| ఏజన్సీ ప్రాంతం | ... | 32 | 11.27 |
| 5. కృష్ణా | ... | 354 | 7.02 |
| 6. గుంటూరు | ... | 434 | 5.85 |
| 7. అనంతపురం | ... | 400 | 8.26 |
| 8. కర్నూలు | ... | 372 | 8.40 |
| 9. కడప | ... | 306 | 9.16 |
| 10. నెల్లూరు | ... | 302 | 6.29 |
| 11. చిత్తూరు | ... | 273 | 5.51 |
| 12. బళ్ళారి (అన్ని తా॥లు) | ... | 185 | 4.37 |
| రాష్ట్ర మొత్తం | | 4,071 | 7.22 |

— Report on Health Conditions in Madras State 1950, Page 127.

ఇతరదేశాల బాలింతల మరణాలతో పోల్చి చూస్తే మన రాష్ట్రపు బాలింతల మరణాలు ఎంత అధికమో వ్యక్తమవుతుంది :

| దేశం పేరు | | వెయ్యి జననాలకు మరణించిన బాలింతలు |
|---|---|---|
| డెన్మార్కు | ... | 2.6 |
| నార్వే | ... | 2.8 |
| బ్రిటన్ | ... | 0.97 ( 1949 ) |
| స్విట్జర్లండు | ... | 4.4 |
| న్యూజీలెండ్ | ... | 4.8 |
| దక్షిణాఫ్రికా | ... | 4.9 |
| జర్మనీ | ... | 5.1 |
| ఆస్ట్రేలియా | ... | 5.5 |
| అమెరికా ( U. S. A. ) | ... | 1.2 ( 1948 ) |
| జపాన్ | ... | 2.8 |
| మదరాసు (అవిభాజ్యం) | ... | 6.21 |
| ఆంధ్ర | ... | 7.22 |

ఈ బాలింతలమరణాలకు మూలకారణం, పుష్టికరమైన ఆహారం లోపించటం! డాక్టరు లక్ష్మణస్వామి మొదలియారు విచారణ జరిపి వ్రాసిన రిపోర్టులో అధిక బాలింతమరణాలకు కారణాలు యిలా వివరించారు :

"బాలింతమరణాలు ఇంకా అధికమవుతూనే ఉన్నాయి. ఆహారలోపంవల్ల, గర్భిణీస్త్రీలకు వచ్చే రక్తహీనత ( Anaemia of Pregnancy ) అనేకమంది మరణాలకు కారణం అని తేలింది. గర్భిణీకాలంలో తర్ఫీదుపొందిన మంత్రసానుల సహాయం పొందే అవకాశం లేకపోవడం, ఇతర సాంఘిక కారణాలుకాక, మరేమయినా కారణాలున్నాయా? అని విచారించితే గాలి, వెలుతురు ధారాళంగా వచ్చే విశాలమైన ఇండ్లలో గర్భవతి నివసించే అవకాశం లేకపోవడం, కాన్పుకు కాన్పుకు మధ్య తల్లి కోలుకొనేంత వ్యవధి లేకపోవడం" అని కనుగొనబడింది.

ఈ విచారణ మదరాసునగరంలో జరుపబడినా, అధిక మరణ కారణాలు ఆంధ్రకు కూడా అనువర్తిస్తాయనడంలో ఎట్టి సందేహమూ లేదు.

**మాతా శిశు సంరక్షణ :**

మాతా శిశు మరణాలు ఇంత అధికంగా ఉంటే, మాతాశిశుసంరక్షణా శ్రద్ధ మరింత హీనంగా ఉందని, ప్రక్క పేజీలో యివ్వబడిన పట్టీ తెలియచేస్తుంది :

మాతా శిశు సంరక్షణా కేంద్రాలు – (1950)

| జిల్లా | | వివిధ సంస్థలచే నడుపబడుతున్న కేంద్రాల సంఖ్య | వీటిలో పనిచేస్తున్న | |
|---|---|---|---|---|
| | | | హెల్తువిజిటర్లు | మంత్రసానులు Midwives |
| 1. శ్రీకాకుళం | ... | 3 | 1 | 5 |
| 2. విశాఖపట్నం | ... | 8 | 2 | 16 |
| 3. తూర్పు గోదావరి | ... | 13 | 3 | 26 |
| 4. పశ్చిమ గోదావరి | ... | 20 | 3 | 25 |
| 5. కృష్ణా | ... | 17 | 6 | 28 |
| 6. గుంటూరు | ... | 17 | 2 | 21 |
| 7. నెల్లూరు | ... | 5 | — | 9 |
| 8. కర్నూలు | ... | 12 | 4 | 10 |
| 9. అనంతపురం | ... | 11 | 4 | 16 |
| 10. కడప | ... | 6 | 2 | 10 |
| 11. చిత్తూరు | ... | 12 | 3 | 17 |
| 12. బళ్ళారి (అన్ని తా॥లు) | ... | 9 | 4 | 15 |
| మొత్తం | ... | 133 | 34 | 198 |

—Report on Health Conditions in Madras State 1950, P. 120.

రెండుకోట్ల జనాభా ఉన్న ఆంధ్రదేశంలో వివిధ సంస్థలచేత నిర్వహించబడుతున్న మాతా శిశు సంరక్షణా కేంద్రాల మొత్తం, 1950 లో 133 మాత్రం! సగటున ప్రతి 505.6 చదరపు మైళ్ళకు, ప్రతి లక్షా యాభై ఎనిమిది వేల జనాభాకు ఒక్క మాతా శిశు సంరక్షణా కేంద్ర మున్నట్లు తేలుతున్నది.

ఈ కేంద్రాలలో హెల్తు విజిటర్లు ( Health visitors ), మంత్రసానులు (Midwives) ఉంటారు.

ప్రతి హెల్తు విజిటరు, ప్రసవించిన తల్లుల, కిండర్ గార్డెన్ స్కూలు వయస్సువరకు వారి బిడ్డల పెంపకం, ఆరోగ్య విషయాలలో శ్రద్ధ తీసికోవలసి ఉన్నది. ఇట్టి హెల్తు విజిటర్లు మన రాష్ట్రంలోని వివిధ కేంద్రాలలో 33 మంది ( 1950 లో ) ఉన్నారు. సగటున ప్రతి 1974.63 చదరపు మైళ్ళకు, ప్రతి 6,15,821.41 జనాభాకు మాత్రమే ఒక్క హెల్తు విజిటరు ఉన్నారు! వీరు ఎందరు తల్లుల, బిడ్డల ఆరోగ్యాన్నిగూర్చి శ్రద్ధ తీసికోగలరో ఊహించవచ్చు!

మంత్రసానులు (midwives) తక్కువలు [illegible]. రాష్ట్రంలోని వివిధ కేంద్రాలలో, వీరు 198 మంది (1950 లో) ఉన్నారు. పది 3 మైళ్ళ ప్రదేశం తిరిగి 4 – 5 వేల జనాభాను చూడగలిగితే చాలని ప్రభుత్వ ఉద్దేశ్యం!

రాష్ట్రంలో సగటున ప్రతి 339.58 చదరపుమైళ్ళకు, ప్రతి 1,06,252.21 జనాభాకు ఒక్క మంత్రసాని ఉన్నది. 1950 సంవత్సరపు జననాలసంఖ్య తీసికొంటే ఆ సంవత్సరంలో పనిచేస్తున్న ఒక్కొక్క మంత్రసాని, 3,100.32 కాన్పులు చేయించ వలసి వస్తుంది. శాస్త్రజ్ఞుల అంచనాల ప్రకారం ప్రతి వంద కాన్పులకు ఒక మంత్రసాని ఉండాలి. ఈ నియమం ప్రకారం ఇపుడు మనకున్న మంత్రసానుల సంఖ్యను 31 రెట్లు పెంచవలసి ఉంటుంది. అధికసంఖ్యలో మాతృమరణాలు, శిశుమరణాలు సంభవించే ఆంధ్రలో తరిఫీదు పొందిన మంత్రసాని సహాయం ఎంతకరువు!

దామాషాన ప్రతి వెయ్యికాన్పులకు, గ్రామసీమలలో 9.17, పట్టణాలలో 68.31 (రాష్ట్ర మొత్తపు దామాషా 17.62) కాన్పులకు మాత్రమే తర్ఫీదుపొందిన మంత్రసాని సహాయం లభిస్తున్నదనే ప్రభుత్వ అంచనాలు పరిశీలించినా మాతా శిశు సంరక్షణ సిబ్బంది ఎంత తక్కువో అవగత మవుతుంది.

దామాషాన ప్రతి వెయ్యి కాన్పులకు, గ్రామసీమలలో 0.73, పట్టణాలలో 8.40 (మొత్తం సగటున 1.90, Meternity Beds) బెడ్సు ఉన్నాయి.

ప్రతి సంవత్సరం పెరుగుతున్న మాతాశిశు మరణాల నాపటానికి తగినంత సిబ్బందిని వేసి, సాధ్యమైనన్ని బెడ్సు అధికం చేయడం, సాధ్యమైనన్ని కాన్పులకు తర్ఫీదుపొందిన మంత్రసానుల సహాయం లభించేటట్లు చేయడం అత్యావశ్యకమని ఆంధ్రలో అధికసంఖ్యలో సంభవిస్తున్న మాతా-శిశు మరణాలు హెచ్చరిస్తున్నాయి.

ఆరోగ్యము – పారిశుధ్యము: (Health and Sanitation)

ప్రతి సంవత్సరం కలరా, మశూచి, తదితర అంటువ్యాధులు ఏదో ఒక మూలన వస్తూ కొన్ని వందల మరణాలకు కారణమవుతున్నాయంటే, పారిశుధ్య పరిస్థితులు (Sanitary conditions) ఎంత హీనంగా ఉన్నాయో అవగతమవుతుంది.

(1950 వ సంవత్సరంలో, మశూచివల్ల రాష్ట్రంలో 10,364 మంది, కలరావల్ల 6,607 మంది మరణించారని ఆరోగ్యశాఖవారి అంచనాలు.)

గాలి, వెలుతురు బాహాటంగా వస్తూ, జన సమ్మర్దం లేకుండా ఉండే ఇండ్లు లేకపోవుట, గృహ పరిసరాలలో మురుగునీరు, పెంటపోగులు ఇత్యాదులు లేకుండా చేసి శుచిగా ఉంచబడకపోవడం, మంచినీటి వసతులు లేకపోవడం, మున్నగునవి అంటువ్యాధులు రావడానికి ప్రధాన కారణాలు. ఇట్టి సౌకర్యాలు లేక పోవడంచేత అంటువ్యాధులు ప్రబలడం, ఆహారలోపంవల్ల వ్యాధి నిరోధక శక్తి తగ్గిపోయి ఉన్న బీద ప్రజానీకం వేల సంఖ్యలో వీటికి ఆహుతికావడం జరుగుతున్నది.

1953–'54 ఆంధ్ర బడ్జెట్‌లో ప్రజారోగ్యంకోసం 44,29,300 రూపాయలు కేటాయించారు. అంటే ప్రజల ఆరోగ్యరక్షణ నిమిత్తం ప్రభుత్వం ఖర్చుచేస్తున్నది తల 1 కి 3.3½ అణాలు మాత్రమే! ఆంధ్రదేశాన్ని ఏటా ముంచివెత్తే అంటు వ్యాధుల మహాసముద్రంలో ప్రభుత్వం ఖర్చుచేసే డబ్బు ఒక నీటిబొట్టు.

ప్రక్క పేజీలోని టేబులు పరిశీలిస్తే దీనికి తగినట్లే ఆరోగ్యసిబ్బందికూడా ఉన్నట్లు ద్యోతకమవుతుంది.

ఈ అంచనాల ప్రకారం వ్యాక్సినేటర్లు, శానిటరీఇన్‌స్పెక్టర్లు కలసి 37,500 మంది జనాభాకు, 119.85 చదరపుమైళ్ళకు ఒక్కరున్నారు. ఒక్క వ్యాక్సినేటరో, శానిటరీ ఇన్‌స్పెక్టరో ఇంత దూరం తిరగడం, ఇన్ని వేలమందికి టీకాలు వెయ్యడం, ఇతరత్రా కార్యక్రమాలు చూడడం ఎలా సాధ్యమవుతుంది ?

ఈ సిబ్బంది లోటును ఒప్పుకుంటూ, ఆరోగ్యశాఖా డైరెక్టరు 1950 సాంవత్సరిక రిపోర్టులో, ఈ కారణం వల్లనే మశూచినుండి రక్షణకు ప్రజలందరకు టీకాలు వేయవలసి ఉండగా, నూటికి 20 మందికి మాత్రమే వేయడం జరిగిందని వ్రాశారు.

సామాన్యంగా తాలూకా కొక హెల్తు ఆఫీసరు, తాలూకా బాధ్యతల చూడడానికి ఉంటారు. 1950 లెక్కల ప్రకారం, ఒక్కొక్క ఆఫీసరు సగటున 425.55 చ॥ మైళ్ళ విస్తీర్ణంలో, 41,563.57 మంది జనాభా బాధ్యత చూడవలసి ఉన్నది. ఈయన సంవత్సరంలో ఎన్ని గ్రామాలు తిరగగలడో, ఎందరినిచూడగలడో ఊహించవచ్చు !

సిబ్బంది స్థితి ఇలా ఉంటే, పారిశుధ్యం సంగతి ఇక చెప్పనే అక్కరలేదు. నూటికి 80 గ్రామాలకు మంచినీటిసదుపాయాలు లేవు. బెజవాడలాంటి పట్నంలోనే మురుగు పోయే అవకాశాలు, వీధి పారిశుధ్యం దారుణంగా ఉంటే, ఇక గ్రామ పారిశుధ్యం సంగతి చెప్పనవసరంలేదు.

ప్రజారోగ్యం క్రమంగా నీరసించిపోతున్నది. క్రమంగా వివిధవ్యాధులతో మరణించేవారిసంఖ్య అధికమవుతున్నది. ఏటా మరణించేవారిలో నూటికి 60 మంది ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలు జాతికి గర్వకారణమైన యువకులు ! అనేక దేశాలలో కంటె అధికసంఖ్యలో మాతా–శిశుమరణాలు ! ఇట్టి స్థితిలో ప్రభుత్వ వైద్య సహాయ కార్యక్రమం సముద్రంలో కాకిరెట్టలా ఉంది.

ఈ పరిస్థితులు ఈవిధంగా ఇంకా కొంతకాలంకొనసాగితే జాతి నిర్వీర్యమైపోయే ప్రమాదం లేకపోలేదు.

# ఆంధ్రరాష్ట్రం

## వైద్య సదుపాయాలు

బళ్ళారిజిల్లా అంచనాలు

అన్ని తాలూకాలకు ఇవ్వబడ్డాయి




మధ్యప్రదేశ్

శ్రీకాకుళం

విశాఖపట్నం

హైద్రాబాద్

తూ.గోదావరి

ప.గోదావరి

కృష్ణా

గుంటూరు

బళ్ళారి

కర్నూలు

అనంతపురం

కడప

నెల్లూరు

చిత్తూరు

మైసూరు

మద్రాసు

బంగాళాఖాతం

**సూచిక**

- మాతా శిశు సంరక్షణాలయం
- ఆసుపత్రి
- ఆరోగ్య శాఖోద్యోగులు
- ఆరోగ్య పరిశోధనా కేంద్రం
- వైద్య కళాశాల

# ఆంధ్రజిల్లాలలో ఉన్న ఆరోగ్యశాఖ సిబ్బంది (1950)

| జిల్లా | అంటువ్యాధుల సిబ్బంది | | హెల్తు ఇన్‌స్పెక్టర్లు | | శానిటరీ ఇన్‌స్పెక్టర్లు | | వ్యాక్సినేటర్లు | | ఇతర ఆరోగ్య సిబ్బంది | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పట్నాల్లో | పల్లెల్లో | పట్నాల్లో | పల్లెల్లో | పట్నాల్లో | పల్లెల్లో | పట్నాల్లో | పల్లెల్లో | పట్నాల్లో | పల్లెల్లో |
| శ్రీకాకుళం | | 47 | | 23 | 5 | 1 | | 33 | | |
| విశాఖపట్నం | | 1 | | 8 | 19 | 1 | 8 | 36 | 28 | 1 |
| తూర్పుగోదావరి | | 1 | | 15 | 3 | 1 | 1 | 51 | 29 | 6 |
| పశ్చిమగోదావరి | | | | 8 | 5 | 15 | 3 | 29 | 4 | 17 |
| కృష్ణా | | | | | 12 | 14 | 6 | 28 | 22 | 11 |
| గుంటూరు | | | | 19 | 10 | 9 | 5 | 34 | 12 | 28 |
| అనంతపురం | | | | 15 | 10 | | 4 | 34 | 4 | |
| కర్నూలు | | 6 | | 18 | 8 | | 6 | 27 | | 8 |
| కడప | | | 1 | 10 | 5 | 2 | 4 | 19 | 8 | 6 |
| నెల్లూరు | | 3 | | 17 | 7 | 1 | | 32 | 2 | |
| చిత్తూరు | | 45 | | 11 | 5 | 1 | | 20 | | |
| బళ్ళారి (అన్ని తా॥లు) | | 26 | 3 | 10 | 14 | 5 | 5 | 20 | 12 | |
| మొత్తం | | 129 | 4 | 154 | 103 | 50 | 42 | 366 | 121 | 77 |

Source:— Report on Health conditions in Madras State 1950. P. 196.

# 1950 లో రిజిష్టరయిన శిశుజననాలు

| జిల్లాపేరు | 1950 జనాభా (అంచనా) | రిజిష్టరయిన జననాలు | ప్రతివెయ్యి జనాభాకు శిశుజననాలు ఎన్ని? | గత 5 సం॥ల దామాషా |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం ... | 21,36,000 | 64,441 | 3[illegible].17 | 31.49 (శ్రీకాకుళం, విశాఖపట్నం) |
| విశాఖపట్నం ... | 18,20,000 | 59,138 | 32.49 | |
| తూర్పుగోదావరి | | | | |
| మైదాన ప్రాంతం ... | 20,87,000 | 53,339 | 25.53 | 29.03 |
| ఏజన్సీ ప్రాంతం ... | 2,06,800 | 5,411 | 26.17 | 29.81 |
| పశ్చిమగోదావరి ... | | | | |
| మైదాన ప్రాంతం ... | 15,27,000 | 41,494 | 27.17 | 31.18 |
| ఏజన్సీ ప్రాంతం ... | 93,700 | 2,837 | 30.28 | 32.02 |
| కృష్ణా ... | 16,22,000 | 49,925 | 30.78 | 34.13 |
| గుంటూరు ... | 25,03,000 | 73,306 | 29.29 | 31.87 |
| అనంతపురం ... | 12,84,000 | 48,182 | 37.53 | 37.37 |
| కర్నూలు ... | 13,09,000 | 43,716 | 33.39 | 31.65 |
| కడప ... | 11,56,000 | 33,188 | 28.71 | 27.43 |
| నెల్లూరు ... | 17,39,000 | 47,576 | 27.36 | 27.94 |
| చిత్తూరు ... | 18,05,000 | 49,207 | 27.26 | 27.77 |
| బళ్ళారి (అన్ని తాలూకాలు) ... | 11,45,000 | 42,103 | 36.77 | 35.31 |
| మొత్తం | 2,04,33,500 | 6,13,863 | | |

Source :— Report on health Conditions in Madras state 1950 — (Ed. 1952) P — 124 - 125.

నోటు : (1) రాష్ట్రంలో 1950 సంవత్సరంలో ప్రతి వెయ్యిమంది జనాభాకు శిశుజననాలు 30.2 (2) గత ఐదు సంవత్సరముల సగటు [illegible].

# 1950 లో వయస్సువారీ మరణాలు

| జిల్లా (1) | ఒక సంll రం లోపు (2) | 1–5 సంll ల వారు (3) | 5–10 సంll ల వారు (4) | 10–15 సంll ల వారు (5) | 15–20 సంll ల వారు (6) | 20–30 సంll ల వారు (7) | 30–40 సంll ల వారు (8) | 40–50 సంll ల వారు (9) | 50–60 సంll ల వారు (10) | 60 సంll ల అంతకు పైబడిన వారు (11) | మొత్తం మరణాలు (12) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 శ్రీకాకుళం | 7,630 | 7,176 | 2,306 | 2,638 | 5,526 | 2,501 | 3,797 | 3,598 | 2,486 | 1,368 | 44,086 |
| 2 విశాఖపట్నం | 8,073 | 6,516 | 1,673 | 1,801 | 2,487 | 2,289 | 3,170 | 3,147 | 2,610 | 8,520 | 39,236 |
| 3 తూర్పు గోదావరి | 9,008 | 4,901 | 1,680 | 1,024 | 1,257 | 2,647 | 2,450 | 2,595 | 2,713 | 10,053 | 39,318 |
| 4 పశ్చిమ గోదావరి | 7,311 | 3,957 | 1,250 | 897 | 1,099 | 1,762 | 1,880 | 2,074 | 1,946 | 8,946 | 31,109 |
| 5 కృష్ణా | 7,417 | 4,189 | 1,299 | 853 | 1,119 | 1,740 | 1,699 | 1,872 | 1,942 | 7,477 | 29,667 |
| 6 గుంటూరు | 10,885 | 7,378 | 2,199 | 1,151 | 1,297 | 3,059 | 2,709 | 2,709 | 2,161 | 11,976 | 46,404 |
| 7 అనంతపురం | 6,872 | 4,018 | 2,376 | 1,551 | 1,878 | 1,631 | 1,711 | 1,844 | 1,614 | 2,705 | 26,207 |
| 8 కర్నూలు | 6,355 | 5,563 | 1,664 | 989 | 968 | 1,781 | 2,094 | 2,040 | 1,709 | 4,474 | 27,833 |
| 9 కడప | 3,688 | 2,969 | 957 | 600 | 668 | 1,288 | 1,378 | 1,575 | 1,739 | 4,001 | 18,893 |
| 10 నెల్లూరు | 6,353 | 4,849 | 1,323 | 833 | 862 | 1,776 | 1,771 | 2,03 | 2,213 | 8,745 | 30,736 |
| 11 చిత్తూరు | 6,719 | 3,158 | 2,126 | 1,858 | 2,571 | 1,606 | 2,120 | 2,445 | 1,917 | 3,219 | 27,746 |
| 12 బళ్లారి (అన్ని తాlllలు) | 6,173 | 3,219 | 1,535 | 1,114 | 1,285 | 1,384 | 1,566 | 1,688 | 1,366 | 2,778 | 22,614 |
| మొత్తం | 86,484 | 57,893 | 20,448 | 15,309 | 19,017 | 23,464 | 26,345 | 27,618 | 24,416 | 80,262 | 3,83,873 |

Source :— Report on the Health Conditions in Madras State 1950.

ఇవ్వబడిన అంచనాల ఆధారంతో తయారు చేయబడింది.

# 1950 సంగులో వివిధ వ్యాధులవలన సంభవించిన మరణాలు

| జిల్లా | కలరా | వెయ్యి జనాభాకు మరణాలు | మశూచి | వెయ్యి జనాభాకు మరణాలు | జ్వరాలు (మలేరియా కాక) | వెయ్యింటికి మరణాలు | మలేరియా | వెయ్యింటికి మరణాలు | రక్త విరేచనాలు - గ్రహణి | వెయ్యి జనాభాకు మరణాలు | శ్వాసకోశ సంబంధ వ్యాధులు | వెయ్యింటికి మరణాలు | ప్లేగు | వెయ్యి జనాభాకు మరణాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం ... | 103 | 0.05 | 475 | 0 14 | 20,727 | 9.70 | 115 | 0.05 | 2,088 | 0.98 | 1,697 | 0.79 | – | – |
| విశాఖపట్నం ... | 122 | 0.07 | 88 | 0.03 | 15,785 | 8.67 | 175 | 0.10 | 1,850 | 1.02 | 1,883 | 1.03 | – | – |
| తూర్పు గోదావరి : | | | | | | | | | | | | | | |
| మైదాన ప్రాంతం ... | 244 | 0.12 | 318 | 0.09 | 9,729 | 4.67 | 178 | 0 09 | 1,873 | 0.90 | 3,255 | 1.56 | – | – |
| ఏజన్సీ ప్రాంతం ... | 61 | 0.29 | 159 | 0.47 | 1,823 | 8.82 | 89 | 0.43 | 178 | 0.86 | 163 | 0.79 | – | – |
| పశ్చిమ గోదావరి : ... | | | | | | | | | | | | | | |
| మైదాన ప్రాంతం ... | 485 | 0.32 | 353 | 0.14 | 7,141 | 4.68 | 167 | 0.10 | 1,819 | 1.19 | 2,840 | 1.87 | – | – |
| ఏజన్సీ ప్రాంతం ... | 9 | 0.10 | 15 | 0.11 | 690 | 7.36 | 33 | 0.35 | 97 | 1 04 | 273 | 2.91 | – | – |
| కృష్ణా ... | 820 | 0.51 | 1,023 | 0.37 | 8,082 | 4.58 | 266 | 0.16 | 1,624 | 1.00 | 2,858 | 1.76 | – | – |
| గుంటూరు ... | 917 | 0.37 | 3,693 | 0.87 | 14,128 | 5.64 | 242 | 0.10 | 2,273 | 0.91 | 4,137 | 1.65 | – | – |
| అనంతపురం ... | 652 | 0.51 | 1,062 | 0.49 | 6,679 | 5.20 | 208 | 0.16 | 2,055 | 1 60 | 1,658 | 1.29 | 6 | 000 |
| కర్నూలు ... | 808 | 0.62 | 1,401 | 0.59 | 11,236 | 8.58 | 329 | 0.28 | 1,141 | 0.87 | 1,591 | 1.21 | – | – |
| కడప ... | 1,275 | 1.10 | 554 | 0.30 | 7,044 | 6.10 | 247 | 0.21 | 842 | 0.73 | 1,248 | 1 08 | – | – |
| నెల్లూరు ... | 381 | 0.22 | 668 | 0.23 | 7,108 | 4.55 | 696 | 0.40 | 1,603 | 0.92 | 1,726 | 0.99 | – | – |
| చిత్తూరు ... | 371 | 0.21 | 989 | 0.31 | 6,094 | 3.38 | 125 | 0.07 | 2,503 | 1.39 | 2,397 | 1.3[illegible] | 4 | 0 00[illegible] |
| బళ్ళారి (అన్ని తాలూకాలు)... | 359 | 0.31 | 566 | 0.27 | 6,522 | 5.70 | 251 | 0.22 | 1,325 | 1.16 | 1,813 | 1.58 | 21 | 0 0[illegible] |
| రాష్ట్రం మొత్తం ... | 6,607 | 0.36 | 11,364 | 0.31 | 1,23,588 | 6.28 | 3,121 | 0.19 | 21,271 | 1.04 | 27,547 | 1.44 | 34 | .... |

Source :— Report on Health Conditions in Madras State 1950. P. 182.–195.

# కొండజాతుల ప్రజలు

మన ప్రజలలోకెల్ల నికృష్టజీవితాన్ని గడిపేవారు కొండజాతి ప్రజలు. వీరి జీవిత పరిస్థితులనుగూర్చి ప్రభుత్వం సరిఅయిన భోగట్టాకూడ అట్టిపెట్టిన పాపాన పోలేదు.

భారతరాజ్యాంగంలో కొండజాతులక్రింద నమోదుచేయబడిన తెగలలోని వారు 1951 సం॥ జనాభాలెక్కలప్రకారం ఆంధ్రజిల్లాలలో 5,09,509 మంది ఉన్నారు. ఇందులో 2,55,478 మంది పురుషులు, 2,54,031 మంది స్త్రీలు (జిల్లా వారీ వివరాలకు అధ్యాయం చివరి పట్టికచూడండి).

ఈ కొండజాతి ప్రజలకు శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరిజిల్లాలలోని ఏజన్సీ అడవులు; గుంటూరు, కర్నూలు జిల్లాలలోని నల్లమల అడవులు ప్రధాన నివాసకేంద్రాలు. ఏజన్సీ అడవులలో నివసించేవారిని ఏజన్సీ వాసులగను; నెల్లూరు, గుంటూరు, కర్నూలు, అనంతపురం మున్నగుచోట్ల నివసించేవారిని నాన్ఏజన్సీ వాసులుగను ప్రభుత్వం పరిగణిస్తూ వస్తున్నది. కాని వీరందరి సాంఘిక, ఆర్థిక పరిస్థితులలో మాత్రం భేదంలేదు.

కోయలు, కొండరెడ్లు, బగాట్లు, మూకదొరలు, భూమియులు, సవరలు, గొండ్లు మున్నగువారు ఏజన్సీ ప్రాంతంలో నివసించే ప్రధానతెగలు.

చెంచులు, ఏనాదులు, ఎరుకల, లంబాడీ మున్నగు తెగలవారు నల్లమల అడవులూ, దానిచుట్టుపట్ల, నెల్లూరు, గుంటూరు, కర్నూలు జిల్లాలలో నివసిస్తున్నారు.

అటవీజాతుల ప్రజలసంరక్షణకు ప్రభుత్వంఏమీ శ్రద్ధ తీసుకొనుటలేదని యీ తెగల జనాభాలెక్కలే స్పష్టంచేస్తున్నాయి. దేశమంతటా గత 10 సంవత్సరాలలో నూటికి 12-13 చొప్పున జనాభా పెరుగుతోంది కాని, ఆంధ్ర ఏజన్సీ ప్రాంతంలోని కొండజాతి ప్రజల జనాభాలో పెరుగుదల లేకపోగా గత 10 సంవత్సరాలలోనూ 1941 సం॥ జనాభాకన్న 31,261 మంది తరిగిపోయారు. 1941 సం॥ జనాభా లెక్కలప్రకారం ఏజన్సీ ప్రాంతంలో 3,33,392 మంది కొండజాతి ప్రజలు

జీవిస్తూ ఉండగా, 1951 సం॥ జనాభాలెక్కలలో యీ ప్రాంతంలోని వీరిజనాభా 3,02,131 కి క్షీణించింది. ఇదేకాలంలో ఏజన్సీ ప్రాంతాలకు మైదాన ప్రాంతాలనుండి వలసపోయి స్థిరపడిన వారుగాని, కొత్తగా వలసపోయినవారుగాని పెరిగారు. 1941 సం॥ లెక్కలప్రకారం యీ ప్రాంతాలలో 1,59,864 మంది ఉన్నవీరు - 1951 సం॥కు 2,37,134 మందికి వృద్ధిచెందారు.

కొండజాతుల ఆరోగ్యసంరక్షణను ప్రభుత్వం తక్షణచర్యలు తీసుకోనక పోయినట్లయితే కొండప్రజల జనాభాలో పొడచూపిన యీ క్షీణత ఆగదు. అనారోగ్య పరిస్థితులతోనూ, అజ్ఞానంతోనూ, నికృష్టపు ఆర్థిక పరిస్థితులతోనూ వీరు క్షీణించడం జరుగుతున్నది. దీనిని అరికట్టి వారికి సక్రమ జీవనపరిస్థితులు కల్గించటం మన కనీసకర్తవ్యం.

నేడా - వీరు ఎట్టి సంరక్షణలులేక మైదానప్రాంతాలలోని వ్యాపారస్తుల చేత, భూస్వాముల చేత, కంట్రాక్టర్లచేత విపరీతంగా దోపిడీ చేయబడుతున్నారు. కొండజాతుల సంరక్షకులుగా అచ్చట తిష్టవేసే ప్రభుత్వ ఉద్యోగులుకూడ వీరితో మిలాఖతే!

1920-'23 సం॥లో ఏజన్సీ ఏరియాల కమీషనర్‌గా ఉండిన యల్. టి. హారిస్ ఏజన్సీ ఏరియాల సంపదలనుగూర్చి, అచ్చటి ప్రజల జీవిత పరిస్థితులనుగూర్చి వ్రాసిన యీక్రింది వాక్యాలు కొండజాతి ప్రజలు ఏవిధంగా నిలువుదోపిడీ చెయ్య బడుతున్నది వ్యక్తంచేస్తాయి.

"వరి, రాగి, చెరకు, కాఫీ, పండ్లతోటల, నూనెగింజల పెంపకానికి తోడ్పడే భూమి, వేల చదరపుమైళ్ళలో ఏజన్సీ ప్రాంతంలో ఉంది. వీటికి తగిన వర్షాధారమూ, ప్రవాహములనీటికి అడ్డుకట్టలు వేసి సప్లయిచేయు వీళ్ళుకూడ కలవు. ఇవిగాక ఇంతవరకూ ఎట్టి ఆదాయాన్ని తియ్య ప్రయత్నించని విలువైన అడవులు కూడ గలవు. ఇచ్చట లభించే ఇనుము, బొగ్గు, మైకా, మేంగనీసు, ప్లంబగో (Plumbogo), బంగారం మున్నగు ఖనిజాలుకూడ బయటికితవ్వడానికి ఎట్టి ప్రయత్నం కూడ చెయ్యలేదు. జల ప్రవాహంతో విద్యుత్తును అభివృద్ధి చేయడానికి పనికివచ్చే చక్కటి జలపాతాలుకూడ యీ ప్రాంతంలో కలవు." మన కొండజాతి ప్రజలు నివసించే భూభాగంలోని సిరిసంపద లివి. కాని పైన పేర్కొన్న యల్. టి. హారిస్‌యే వారి ఆరోగ్య పరిస్థితులనుగూర్చి యిలా వ్రాశాడు. "ఈప్రాంతంలోని ప్రధానసమస్య మలేరియా. ఏజన్సీలోని పీఠభూమి పైభాగంలో నివసించే ప్రజలలో నూటికి 89 మందికి, క్రింది భాగంలో నివసించేవారిలో నూటికి 90 మందికి ప్లీహపు జబ్బులు కలవు. ఈ జబ్బు మలేరియా మూలంగా ఏర్పడుతుంది. ఈ పరిస్థితి యీప్రాంతంలోని మలేరియా తీవ్రతను సూచించుతుంది."

(Report on the Socio-Economic conditions of the Aboriginal Tribes in the Province of Madras - Pages 8-9.)

ఏజన్సీ, నాన్-ఏజన్సీ ప్రాంత ప్రజల స్థితిగతుల పరిశీలనకని మద్రాసు ప్రభుత్వం 1948 లో ఒక విచారణకమిటీని నియమించింది. ఈ ప్రజల హీనజీవన పరిస్థితులను గమనించాలంటే యీ రిపోర్టులో అంగీకరించిన అంశాలుచాలు. వ్యవసాయంపై ఆధారపడి జీవించాలనే వీరిప్రయత్నం, ఎలా దోపిడీదార్ల చేత వమ్ముచేయ బడుతున్నదీ యీక్రింది సాక్ష్యాలు స్పష్టపరుస్తాయి.

"చెమట ఓడ్చి, కృషిజేసి వీరు (ఏజన్సీప్రజలు) శాశ్వత వ్యవసాయానికని చదునుచేసి, బాగుచేసుకొన్న భూములన్నీ - ఏజన్సీ ప్రజలపై ఆర్థిక పెత్తనాన్ని సాధించిన షావుకార్ల, మైదాన ప్రాంతవాసుల చేతిలోనికి పోయినవి. ఏజన్సీప్రజలు కష్టపడి భూములు బాగుచేసినా ఆ ఫలితం వారికి దక్కదనేది సులభగ్రాహ్యం. రెండు తరాలకుపూర్వం మొత్తం సాగుక్రింద ఉన్నభూమి అంతా కొండరెడ్లు,కోయల అధీనంలోఉన్న రెండుగ్రామాలలో, ఆభూమిఅంతా నేడు ఇతరులచేతిక్రిందకు పోయి నది. బహు కొద్ది శిస్తు బాకీక్రింద జమీందారు వీరి భూములను ఒక ప్రక్కనుండి స్వాధీనం చేసుకొన్నాడు. వడ్డీవ్యాపారి మరొక ప్రక్కనుండి వీరిభూమిని స్వాధీనం చేసుకుంటాడు. లేకపోతే వరుసన కొన్నిసంవత్సరాల పంటను తనదని హామీ తీసి కొని ఫలాన్ని తీసుకొని వెళ్ళుతాడు. కనుక శాశ్వత వ్యవసాయంద్వారా తమకు దక్కేదిశూన్యం అని కొండజాతులవారు భావిస్తున్నారు. కనుక స్థిరత్వంలేని "పోడు" వ్యవసాయాన్ని వీరు స్వీకరిస్తున్నారు (ప్రభుత్వ విచారణ రిపోర్టు - పేజీలు 15-16).

వడ్డీ వ్యాపారస్తులు యీ ప్రజలపై తమ దోపిడీని ఎలా కొనసాగించేదీ ప్రభుత్వ విచారణ రిపోర్టులోని యీ వాక్యాలే స్పష్టం చేస్తాయి. "ఏజన్సీ ప్రాంతాలలో అప్పు తెచ్చుకొనడం అంటే, ఆర్థికంగా ఆత్మహత్య చేసుకొను టయే! ... ... ఈ ప్రదేశాల ( అటవీ ప్రాంతాలు ) లో కొద్ది మొత్తాలను అప్పులు పెట్టేది ఒక్క షాహుకార్లు మాత్రమే. కనుక యీ కొండ ప్రజలు వీరికి బాకీపడి ఉంటారు. ఈ కొండ ప్రజలలో తెచ్చుకొన్నది చెల్లించాలనే చైతన్యం చాలా బలంగా ఉంది. దీనిని ఆధారంగా జేసుకొని యీ షాహుకారులు వీరిని ఘోరంగా దోపిడీ చేస్తారు."

కాంట్రాక్టర్ల దోపిడీనిగూర్చి, యీ ప్రాంతాలలో ప్రబలంగా ఉన్న వెట్టి చాకిరినిగూర్చి ప్రభుత్వ విచారణ రిపోర్టులో యీ విధంగా చెప్పబడింది :

"స్థానిక రేట్లలో వీరికి ( కొండ ప్రజలకు ) కూలి యివ్వబడుతుందని చెప్పినా, కొన్ని రకములైన అడివి పనులకు అసలు ఏ విధమైన కూలీ యివ్వబడటం లేదని కమిటీకి ఫిర్యాదులు చెయ్యబడ్డాయి. ప్రభుత్వ కూలిరేట్లు స్థానిక రేట్లకన్న తరచుగా హీనంగానే ఉంటాయని కొందరు ఫారెస్టు ఉద్యోగస్థులే మాకు చెప్పారు."

ఈ ప్రాంతాలలోని ప్రభుత్వ ఏజంటు ముఠాదారు. 10 నుండి 20 పల్లెల వరకూ యీ ముఠాదారు పెత్తనంక్రింద ఉంటాయి. ఇక వీరి దోపిడీకి అంతుఉండదు.

ప్రభుత్వ విచారణ రిపోర్టులోనే వీరి నిరంకుశత్వాన్ని గూర్చి యిలా సాక్ష్యంయిచ్చినట్లు అంగీకరింపబడింది. "ముఠాదార్లు రైతులను బాధిస్తారు. వసూలు జేసిన శిస్తుకు రసీదులు యివ్వరు. నాగలికి రెండు రూపాయల చొప్పున నిర్బంధంగా వసూలు జేస్తారు. గ్రామంలో ఎవరికైనా పెండ్లి అయితే ముఠాదారు వారినుండి కట్నం వసూలు జేస్తాడు. ఈ కట్నం 5 నుండి 50 రూ॥ వరకూ ఉంటుంది. రాజ లాంఛనాలపేర కూరగాయలు వగైరా తీసుకొంటారు. "జట్టీ" పనిపేర, కూలి యివ్వకుండా పనిచేయించుకొంటారు. రైతు కుటుంబంలోని ఆడ, మొగ సంవత్సరానికి వారంనుండి పది రోజులవరకూ వెట్టిచాకిరి చెయ్యాలి. కొన్ని పర్యాయాలలో గంజిమాత్రం పోస్తారు. కూలి యివ్వటమనేదే లేదు."

"పైన యిచ్చిన 'మామూళ్ళ' జాబితాకు కలపవలసినవి ఇంకా చాలా ఉన్నాయి." (Page 25).

ఈ వెట్టిచాకిరీ ప్రభుత్వ ఉద్యోగస్తులు, వడ్డీవ్యాపారస్తులు, కంట్రాక్టర్లు కూడ చేయించుకొనటం మామూలే. ఈ విషయంలో ప్రభుత్వ విచారణకమిటీ తమ అభిప్రాయాన్ని ఇలా యిచ్చింది. "కంట్రాక్టర్లు కొండప్రజలకు అప్పుపెట్టి, వ్యాపారస్తులు 'వెట్టి' చేయించుకొని బహు స్వల్ప ప్రతిఫలం యిస్తున్నారు. ఇక ముఠాదార్లు తమ అజమాయిషీ ప్రాంతాలలో తమ హక్కుగా గుడిసెకు ఒక మనిషిచొప్పున వెట్టిచేయించుకుంటున్నారు... ఈ విధమైన 'వెట్టి' ప్రబలంగానే ఉంది. ఈ ముఠా పద్ధతిని తొలగిస్తే తప్ప యీ 'వెట్టి' పోదు."

"రెవిన్యూఉద్యోగస్తులకు, పోలీసులకు, ఫారెస్టుఉద్యోగస్తులకు గూడ 'వెట్టి' చెయ్యమని నిర్బంధం జరుగుతోందని కొండప్రజలే మాకు ఫిర్యాదులుచేశారు."

వివిధ చట్టాలద్వారా ఏజన్సీప్రజలను సంరక్షిస్తున్నామని ప్రభుత్వం చెప్పుకున్నా, వారి యథార్థపరిస్థితు లింత హేయంగా ఉండగా, ఎట్టి సంరక్షణలు లేని నాన్-ఏజన్సీ ప్రజల స్థితి ఎంత హీనంగా ఉంటుందో దురూహ్యం. ఈ విషయాలను ప్రభుత్వ విచారణ కమిటీయే యీ క్రింది మాటలలో అంగీకరించింది.

"ఉన్న కొద్దిపాటిభూములు మైదానప్రాంతాలలోని షావుకార్లకు, వ్యాపారస్తులకు ధారాదత్తం గావటం, నిత్యం వడ్డీ వ్యాపారస్తుల పెత్తనంక్రింద బ్రతకటం, చిన్న ఉద్యోగస్తుల నిరంకుశత్వం క్రింద 'వెట్టి' చాకిరీ చేస్తూ జీవించడం మున్నగు సమస్యలు నాన్-ఏజన్సీ ప్రజలకు, ఏజన్సీ ప్రజలకన్న తీవ్రంగా ఉన్నాయి. ఇచ్చట ప్రభుత్వం వీరి సంరక్షణకు ఎట్టిచర్యలూ తీసుకొనకపోవడంచేత, కొండప్రజలను దోపిడీ చేయువారు యిచ్చట ఏజన్సీ ప్రాంతాలలోకన్న మరింత హెచ్చుగా ఉండడంచేత పరిస్థితి మరింత తీవ్రరూపం దాల్చింది."

" నాన్-ఏజన్సీ ప్రజలలోకెల్ల చెంచుల విషయంలోనే గతంలో ప్రభుత్వం శ్రద్ధతీసుకొనడం జరిగింది. దీనికి కారణం చెంచులు ప్రభుత్వానికి చాలా యిబ్బందులు కల్పించటమే ... ... "

“ అయినా ప్రేక్షకులు చెంచుల అరణ్య నివాసాలను ( Chenchu forest settlement ) చూస్తే అచ్చటి పరిస్థితులపై సదభిప్రాయం ఏర్పడదు. స్త్రీలు, పురుషులు చాలా దీనంగా కన్పిస్తారు. స్కూళ్ళు, పిల్లల పరిస్థితి మరింత హేయంగా ఉంటుంది. ఈ పరిస్థితులలో ఏదో తీవ్రమైన లోపం ఉండి తీరాలనే అభిప్రాయం ప్రేక్షకునికి కల్గిస్తుంది. ” ( Page 32 ). ఇక ఇతరుల విషయం ఎలా ఉండేదీ దురూహ్యం.

కొండ జాతుల కిచ్చిన సంరక్షణ, తోడ్పాటుకూడ లేక నేరస్థుల జాతులుగా ప్రకటించిన ఏనాది, ఎరుకల మున్నగువారి జీవిత పరిస్థితులేమిటి? వీరిని “నాగరికులు”గా చెయ్యడానికి ప్రభుత్వ కార్యక్రమం ఏమిటి ?

ప్రభుత్వ విచారణ కమిటీయే బిట్రగుంట ( నెల్లూరు జిల్లా ) ఎరుకల సెటిల్ మెంటులలోని జీవితాన్ని యిలా వర్ణించింది : “ ఈ సెటిల్ మెంటు పరిస్థితులు కమిటీ సభ్యులకు నాజీ కాన్ సెన్ ట్రేషన్ క్యాంపులను గుర్తుకు తెచ్చింది. పిల్లలను అతి ప్రమాదకరమైన జంతువులవలే ముళ్ళతీగలవెనుక పెంచడంచూడ హృదయ విదారకంగా ఉంది.” (పేజి 37.) ఇదీ వీరిని “నాగరికులుగా” జేయడానికి ప్రభుత్వం తీసుకొనే శ్రద్ధ !

ఇక యీ వెనుకబడిన జాతుల విద్యా, ఆరోగ్యాభివృద్ధికి ప్రభుత్వం చూపు శ్రద్ధ ఏమిటి ?

ఏజన్సీ ఏరియాలలో కొండజాతి ప్రజల భాషలను అభివృద్ధిపర్చడానికి ప్రభుత్వం ఎట్టి చర్యలూ తీసుకొనుటలేదు. పైగా ప్రత్యేక భాషఉన్న సవర, కోయ జాతులకుకూడ వారి భాషను నేర్పడానికి ఎట్టి చర్యలూ గైకొనుటలేదు. దీని ఫలితంగా యీ బాలురకు పాఠశాలలు అగమ్యగోచరంగా తయారవుతున్నాయి. ఈ ప్రదేశంలోని మలేరియా జ్వర వ్యాప్తిమూలాన చాల స్కూళ్ళు సంవత్సరంలో అధికభాగం మూసివేసియే ఉంటాయి. జ్వరపడిన ఉపాధ్యాయుని స్థానంలో యీ పాఠశాలలలో వేరు వ్యక్తిని నియమించటమనేదిజరగదు.

5 లక్షల పైబడి జనాభాఉన్న ఏజన్సీ ప్రాంతం మొత్తంలో 3 వైద్యశాలలూ, 17 డిస్పెన్సరీలు మాత్రమే ఉన్నవి. పైగా యీ ప్రదేశం మలేరియా జ్వరమునకు కేంద్రమని గుర్తించిన, యీ “సౌకర్యముల” విలువ గ్రహించవచ్చు. “2-3 డిస్పెన్సరీలు, కావలసిన పరివారంలేక మూతలబడి ఉండడమనేది ఎల్లప్పుడూ జరుగుతూనే ఉంటుంది. ఉపాధ్యాయులులేక స్కూళ్ళు మూతబడినట్లే, మలేరియా జ్వర ఉధృతకాలంలో యివీ మూతబడతవి” అని పైన పేర్కొన్న విచారణకమిటీయే యీ విద్యా, వైద్య సౌకర్యాలపై తన అభిప్రాయాన్ని వెల్లడించింది.

ఈ నికృష్టపరిస్థితులలో నేటికీ ఆంధ్రదేశంలోని కొండప్రజలు నివసించడం జరుగుతున్నది. వీరిలోని ప్రధాన జాతుల స్థితిగతులనుగూర్చిన మరికొన్ని వివరాలు క్రింద యిస్తున్నాం.

కోయలు :

ఏజన్సీ ప్రాంతంలోని ప్రధానతెగ కోయప్రజలు. పశ్చిమ గోదావరిజిల్లా లోని పోలవరం తాలూకా, తూర్పుగోదావరిజిల్లాలోని చోడవరం, ఎల్లవరం, భద్రాచలం తాలూకాలు కోయప్రజలు నివసించే ప్రదేశం. ఈ కోయజాతి ప్రజలు ఒరిస్సాలోని మల్కనగిరి తాలూకాలోనూ, నైజాం సంస్థానంలోని గోదావరినదీ ప్రాంతపు కుడి, ఎడమలలో బస్తరు సంస్థానంవరకూ, దక్షిణమున కమ్మమెట్టువరకూ కూడ విస్తరించి ఉన్నారు.

కోయజాతిప్రజలు నివసించే యీభూభాగం కొండలమయం. ఈప్రాంతంలో సంవత్సరమునకు 50 అం॥ల వర్షమువరకూ కురుస్తుంది. కాని యీ వర్షం సంవత్సరములో మూడు మాసాలలోనే కురుస్తుంది. కనుక మెట్టపంటలు పండవు. వర్షాకాలంలో మాగాణిపంటలు మాత్రమే పండించబడతాయి.

1941 జనాభా లెక్కలప్రకారం ఆంధ్ర ప్రాంతంలో 95,633 మంది కోయ ప్రజలు ఉన్నారు. వీరు జిల్లాలవారీగా యీ క్రిందివిధంగా ఉన్నారు.

| | |
|---|---:|
| తూర్పుగోదావరి ఏజన్సీ | 90,959 |
| తూర్పుగోదావరి మైదాన ప్రదేశంలో | 2,204 |
| పశ్చిమగోదావరిలోని మైదాన ప్రదేశంలో | 1,717 |
| విశాఖపట్నం ఏజన్సీలో | 320 |
| విశాఖపట్నం మైదాన ప్రాంతాలలో | 394 |
| గుంటూరుజిల్లాలో | 39 |
| మొత్తం | 95,633 |

కోయప్రజలు కోయభాషలో మాట్లాడుతారు. ఇది తెలుగుభాషనుండియే ఉత్పన్నమైనది. కొండప్రజలు యాసతో చాలాచోట్ల తెలుగు మాట్లాడుతారు. కోయలలోని లింగకోయలు తమ నిత్య వ్యవహారాలన్నీ తెలుగుద్వారానే జరుపుకొంటారు. వీరికి కోయభాష రాదు. కాని వీరు మాట్లాడే తెలుగుకూడ చాలా యాసగా ఉంటుంది.

కోయ ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం, అటవీ సంపదను ప్రోగుజేసుకొని అమ్మి జీవించడం. వీరి అనాగరిక స్థితిగతులను ఆధారం జేసుకొని ప్రక్కనుండే మైదాన ప్రాంతాల భూస్వాములు, వడ్డీ వ్యాపారస్తులు వీరిని విపరీతంగా దోచుకొంటూఉంటారు.

బ్రతుకుతెరువుకు వేరు ఆధారంలేక, అడవులలోని కొండ ప్రదేశాలలోని కొద్దిపాటి చదునుభూములు, చెట్లుకొట్టి శుభ్రంచేసి వ్యవసాయం ప్రారంభిస్తారు. అక్కడక్కడా ఉండే నీటి వనరులక్రింద కొద్దిపాటి మాగాణికూడ చేస్తారు. కాని

1,2 సం॥లు కష్టించి భూములు సేద్యానికి వీలుగా తేగానే, వీటిని అప్పులపేర ప్రక్క భూస్వాములు, వడ్డీ వ్యాపారస్తులు దిగమ్రింగుతుంటారు. అలానే యీ ప్రజలను నికృష్టజీవన పరిస్థితులనుండి విముక్తం చెయ్యడానికి ప్రభుత్వంకూడ తగిన చర్యలు తీసుకోనకపోవడంచేత, వీరు నిత్యం యీ మూలనుండి ఆ మూలకు తమ వ్యవసాయాలు మార్చవలసి వస్తుంది. వీరు బ్రతికేది రిజర్వు అడవులలో. అచ్చటనే వీరు తమ కొండ వ్యవసాయం కొనసాగిస్తారు. కాని అటవీశాఖ ఉద్యోగులు వీరిని ఒక ప్రాంతంలో వ్యవసాయాన్ని అభివృద్ధిచేసుకొని, స్థిరనివాసం ఏర్పర్చుకొన నివ్వక ఒకమూలనుండి మరొకమూలకు తరుముతుంటారు. ఈ స్థిరత్వంలేని వ్యవసాయాన్నే "పోడు" వ్యవసాయం అంటారు. సుమారు 4 వేల ఎకరాలు ప్రతి సంవత్సరం యీ రకమైన "పోడు" వ్యవసాయంక్రింద కోయప్రజలు నివసించే ప్రదేశంలో ఉంటుందని అంచనా వేయబడింది.

అడవులలోని ఫలసాయాన్ని పోగుజేయడం; అడవుల కొట్టు కంట్రాక్టర్ల వద్ద కూలీలుగా పనిచెయ్యటంకూడ వీరి ప్రధాన వృత్తులలో ఒకటి. వీటితోపాటు వెదురు, తుంగ మున్నగునవి ప్రోగుచేసి అమ్ముకొనడం; బుట్టలు, చాపలు మున్నగునవి తయారుచేసి అమ్ముకొనడంకూడ వీరి వృత్తులలో ఒకటి. కోయగ్రామాలలోని, చుట్టుపట్లనున్న మైదానప్రాంతాలలోని వడ్డీ వ్యాపారులు; వ్యాపారస్తులు విపరీత వడ్డీలతో కొద్ది మొత్తాలు వీరికి అప్పులుపెట్టి - ఈ వత్తిడితో వారు అడవులలో ప్రోగుజేసుకొనివచ్చు చింతపండు, కుంకుడుకాయలు, తేనె, ఇప్పపువ్వు, వెదురు, తుంగ, బీడీ ఆకులు, విస్తరాకులు మున్నగునవి కారు చౌకగా కొంటారు. ఈ సరుకులు యితర ప్రదేశాలకు ఎగుమతిచేసి యీ దళారులుమటుకు విపరీత లాభాలు తీస్తారు. కాని కష్టించే కోయలు మాత్రం అనారోగ్యంతోనూ, తిన తిండిలేకా బ్రతుకు గడపవలసి వస్తుంది. చివరకు త్రాగే నీరుకూడ వీరికి కరువే!

కష్టించి అటవీ సంపద నంతటిని బయటి ప్రజల అవసరాలకు అందించడానికి కృషిచేసే యీ కోయలకు గోచిపాతలు మినహా, కట్ట గుడ్డను కొనుక్కొనే ఆర్థిక పరిస్థితి లేదు. కనుక తలకొక చిన్నగుడ్డ, మొలకు కౌపీనం వీరికి దుస్తులు. వీరి ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా వీరు కొనగల్గిన అత్యంత నాగరకమైన దుస్తులు, 20 వ నెంబరు బట్ట మాత్రమే!

కోయల నిత్య ఆహారం గంజి, చెట్ల దుంపలు, బెరళ్లు మాత్రమే! వీటితో పాటు చింతవిత్తుల గంజికూడ ఎక్కువగా తాగుతుంటారు. వీటి ఫలితంగా కోయ ప్రజలు తరతరానికి నీరసించడం, మరుగుజ్జు కాళ్ళు కల్గి ఉండటం జరుగుతున్నది అని ప్రభుత్వ రిపోర్టులే అంగీకరిస్తున్నాయి. మద్యపాన నిషేధానికి ముందు కల్లు వారి ఆహారంలో ఒక ముఖ్యభాగంగా ఉండేది. సంవత్సరంలో నాల్గు మాసములు కల్లు, చెట్ల కాయలపై బ్రతకడం మినహా మరి యేయితర ఆధారంలేదు. ఇట్టి స్థితిలో ప్రభుత్వం మద్య నిషేధాన్ని అమలుజరిపి వారి నోళ్ళలో రాయికొట్టింది.

## సవరలు:

శ్రీకాకుళంజిల్లాలోని నాలూరు, పార్వతీపురం, పాలకొండ తాలూకాలలో సవరజాతి ప్రజలు నివసిస్తున్నారు. ఏజన్సీప్రాంతంలోని మొత్తం సవరజనాభాలో మూడింట రెండువంతులు ఒక్క పాలకొండతాలూకాలోనే ఉన్నారు. 1941జనాభా లెక్కల ప్రకారం 14,696 మంది సవరలు మన రాష్ట్రజనాభాలో కలరు. వీరిలో 12,842 మంది ఏజన్సీ ప్రాంతంలోనూ, 1,842 మంది మైదాన ప్రాంతాలలోనూ నివసిస్తున్నారు. ఈ సవరలలో 25 రకముల పైబడి వర్ణవిభేదాలున్నట్లు తెలుస్తున్నది.

కోయలకువలెనే సవరలకుకూడా వ్యవసాయం, అటవీసంపదను ప్రోగుచేసి కొని అమ్ముకొనడం ప్రధాన జీవన ఆధారాలు. వీరు నివసించే ప్రదేశంలో కోయల ప్రదేశంకన్న హెచ్చుగా కొండలు, గుట్టలు కలవు. దీని ఫలితంగా వీరి "పోడు" వ్యవసాయం అధిక ప్రయాసతో కూడుకొనిఉంది. అయినా జీవనంకొరకు యీ రాతి భూములనే కొద్దికొద్ది భాగాలు చదరంచేసి, మడులుకట్టి నీళ్ళు నిల్వజేసి మాగాణి వ్యవసాయం కొనసాగిస్తారు. కంట్రాక్టర్ల, వడ్డీ వ్యాపారస్తుల దోపిడీతో వీరూ రోజు రోజుకూ నీరసించటం జరుగుతూంది.

సవరభాష ముండాజాతి భాషలకు సమీపమనీ, ఆర్య, ద్రవిడ భాషలతో ఎట్టి పోలికలు కలిగి లేదని భాషావేత్తల అభిప్రాయం. లిపిలేని సవరభాషకు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు లిపిని ఏర్పరచి, ఒక శబ్దార్థ చంద్రికను కూడతయారు చేసినారు.

## వాల్మీకులు:

వీరు ఏజన్సీ ప్రాంతంలోని అన్ని ప్రాంతాలలోనూ కన్పడుతారు. 1931 జనాభా లెక్కలప్రకారం వీరి జనాభా 4,289. 1941 జనాభా లెక్కలలో వీరి జనాభా వివరాలు తీసినట్లు కన్పించదు. వీరినే కొన్ని ప్రాంతాలలో 'కొండమాలలు' అనికూడ పిలుస్తారు. వీరిని మైదాన ప్రాంతాలలోనూ, ఏజన్సీలో కూడ అంటరాని వారినిగా పరిగణిస్తారు. కొండజాతులు కూడ వీరిని అస్పృశ్యులుగానే పరిగణించి దూరంగా ఉంచుతారు.

ఈ వాల్మీకులలో నూటికి 60_70 మంది వ్యవసాయంమీాద, 20 మంది కూలీలుగానూ, 5 మంది కల్లుగీత పనివారుగను జీవిస్తున్నారు. వీరిలో అత్యధికులు బుట్టలు, చాపలు తయారుచేయటం, సమీాప పట్టణాలలో అమ్ముకొనటం మున్నగు నవి కొనసాగిస్తున్నారు.

నిత్య జీవనంలో కోయ, సవర మున్నగు కొండ ప్రజలకన్న వీరి ఆర్థిక పరిస్థితులు మెరుగనీ, కొద్దిపాటి మొత్తాలలో వీరిలో కొందరు కొండజాతులకు వడ్డీ కిచ్చి వారిని విపరీతంగా దోపిడీజేస్తు ఉన్నారనీ ప్రభుత్వ విచారణ రిపోర్టులు చెబు

తున్నాయి. వాల్మీకులు వాస్తవంగా కొండజాతి ప్రజలు కారనీ, మైదాన ప్రాంతాల నుండి ఇచ్చటకు వలస వచ్చినవారు మాత్రమేననిగూడ పై రిపోర్టులలో ఉదహరించ బడింది.

చెంచులు:

నల్లమల అడవులు వీరి ప్రధాన నివాస కేంద్రం. నల్లమల అడవులలో కృష్ణానదికి అవతల ప్రక్కన ఉండే నైజాం సంస్థాన భాగంలో కూడ వీరు నివసిస్తున్నారు. గోదావరీ నదీలోయలోని ఎగువ భాగాన్ని కోయలు నివాసస్థానంగా జేసుకొన్నట్లే, చెంచులు కృష్ణా లోయ ఎగువ భాగాన్ని తమ నివాస కేంద్రంగా చేసుకొన్నారు.

1941 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్రంలో వీరి జనాభా 9,003. ఇందులో 5,878 మంది కర్నూలు జిల్లాలోనూ, 2,104 మంది గుంటూరు జిల్లా లోనూ, మిగిలిన 1,121 మంది కృష్ణా, విశాఖ, శ్రీకాకుళం, ఉభయ గోదావరులలో అచ్చటచ్చటా నివసిస్తున్నారు.

చెంచులకు వారి ప్రత్యేకభాష కలదు. కాని దానికి లిపి ఉన్నట్లు కన్పించదు. కొండప్రజల యాసతో వారు తెలుగునే మాట్లాడుతారు.

అడవులలో ప్రజాఅవసరాలకు తోడ్పడే వాటినెల్ల పోగుజేసుకొని బయట ప్రాంతాలకు తీసుకొనివెళ్ళి అమ్ముకొని జీవించడమే వీరి ప్రధానవృత్తి. కాయ ధాన్యాలు, అడవిలోని చెట్లవేరులు, అడివిలో దొరకేపండ్లు, జంతువుల మాంసం వీరి ప్రధాన ఆహారం. మువాయాచెట్టు పిందెలను, పూలనూ, చింతకాయలను మరే ఆధారంలేక తిని బ్రతుకుతుంటారు. వెదురువిత్తనాలు ప్రోగుజేసి, దంపి శుభ్రంచేసి, తినుటకేమీ దొరకని కాలంలో తినుటకు భద్రపర్చుకొంటారు.

వీరికి వంటినిండా కట్టుకోను అవసరమైన బట్టనుకూడ కొనుక్కొనగల్గిన తాహతు లేదు. కనుక గోచీపాతలతోనే గడుపుతుంటారు.

నల్లమల అడవుల ప్రాంతంలోకూడ వ్యవసాయాభివృద్ధికి తోడ్పడే పెద్ద చెరువులూ, ప్రవాహాలు కలవు. కాని వీటి అభివృద్ధికి ప్రభుత్వం ఎట్టిశ్రద్ధ తీసుకొనక పోవుటచేత యీ ప్రాంతంలోని ముఖ్య నివాసులైన చెంచుల జీవితపరిస్థితి దినదినం క్షీణించుచున్నది. రాయల కాలంనాటి పెద్దచెరువులు యీ ప్రదేశంలో ఉన్నా, అవి కూడ అశ్రద్ధచేయబడి పాడుబడిన ఆకారంలో నేడు కన్పిస్తాయి. ఏజన్సీప్రాంతములతో పోల్చిచూస్తే యిచ్చట మలేరియా ఉధృతం తక్కువ. కాబట్టి యిచ్చట అభివృద్ధి పథకాలు తక్కువ వ్యయప్రయాసలతో అమలు జరపవచ్చు. అయినా యీ ప్రాంతం సంపూర్ణంగా నిర్లక్ష్యం చెయ్యబడింది.

ఎరుకలు - ఏనాది:

ఆంధ్రరాష్ట్రంలో నెల్లూరు, చిత్తూరుజిల్లాలు వీరి ప్రధాన కేంద్రాలు. అడివి, కొండ ప్రాంతాలను తరతరాలక్రితమే వదలి, మైదాన ప్రాంతాలకువచ్చి ఏదో ఒక వృత్తిని నేర్చుకొని ముఖ్యంగా భూస్వాములవద్ద బాలేరుగాజేరి కొందరు జీవనం చేయటం జరుగుతున్నది. వీరికే "మంచి ఏనాది" అంటారు. పైనాటి మాత్రంకూడ సాంఘిక సంబంధాలు లేక, ఆంధ్రదేశంలోని వివిధపట్టణాలలో పాకీ పనివారుగనూ, వీధులూడ్చువారుగనూ బ్రతికే ఏనాదులను "చల్లయానాదులు" అంటారు. మరి కొందరు గ్రామంవెలుపల గుడిసెలు వేసికొని గ్రామ కాపలాదారులుగా గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో నివసిస్తున్నారు. వీరిలో కొందరు అడివి ప్రాంతాల చుట్టుపట్ల నివసిస్తూ బొగ్గులు, కట్టెలు మున్నగునవి అమ్ముకొని జీవిస్తున్నారు.

ఎరుకలు, ఏనాది మొదలైన ముఠాలను ప్రభుత్వం చాలాకాలంనుండి నేరస్థజాతులుగా (Criminal tribes) పరిగణించి, వీరిపై నిర్బంధచర్యలు అమలుజరపడం జరిగింది. వీరికి కొన్ని క్యాంపులను ఏర్పరచి అవిదాటి అధికారుల అనుమతి లేనిదె వెళ్ళరాదని నిషేధాలు అమలుజరిపారు. జీవనం గడుపుకోను ఎట్టిసహాయం చెయ్యక పోయినా యిట్టి నిర్బంధచర్యలుమాత్రం వీరిపై నిరాటంకంగా అమలుజరపబడ్డాయి. ఫలితంగా వీరు పోలీసు ఉద్యోగులకు, గ్రామభూస్వాములకు వెట్టిచాకిరీచేసే పరిస్థితి ఏర్పడింది. నామకా యీ నేరస్థులచట్టం రద్దుచెయ్యబడ్డా వీరిపై పోలీసుల పెత్తనం, వెట్టిచాకిరీ చేయించుకొనటం నేటికీ నిరభ్యంతరంగా కొనసాగుతున్నది. అభ్యున్నతి పథకాల పేరుతో వీరు పోలీసుల దయాదాక్షిణ్యాలకు వదలబడ్డారనటం అతిశయోక్తి కాదు.

[1951 సం॥లో సేకరించిన జనాభా లెక్కలలో కొండజాతుల తెగలవారీ జనాభా వివరాలు ప్రకటించలేదు. కొండజాతులుగా పరిగణించే తెగలందరి లెక్కలు తీయబడ్డాయి. కనుక తెగలవారీ జనాభాల ప్రస్తావన వచ్చినచోట్ల 1941 సం॥ లెక్కలనే యివ్వవలసి వచ్చినది ]

## ఆంధ్రజిల్లాలలోని కొండజాతుల ప్రజల జనాభా

(1951 సం॥ జనాభా లెక్కలనుండి)

| జిల్లా | మొత్తం జనాభా | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 1,66,235 | 88,458 | 77,777 |
| విశాఖ | 1,44,036 | 68,413 | 75,623 |
| తూర్పుగోదావరి | 1, 9,505 | 59,291 | 60,214 |
| పశ్చిమగోదావరి | 32,484 | 16,250 | 16,234 |
| కృష్ణా | 2,779 | 1,637 | 1,142 |
| గుంటూరు | 12,742 | 4,554 | 8,188 |
| నెల్లూరు | 4,202 | 2,122 | 2,080 |
| కడప | 888 | 258 | 630 |
| కర్నూలు | 10,445 | 5,289 | 5,156 |
| అనంతపురం | 11,463 | 6,381 | 5,082 |
| చిత్తూరు | 3,977 | 2,523 | 1,454 |
| బళ్లారి | 753 | 302 | 451 |
| | 5,09,509 | 2,55,478 | 2,54,031 |

# ఆంధ్రప్రజలు : జీవన పరిస్థితులు

మన రాష్ట్రసిరిసంపదలనుగూర్చి వెనుకటి అధ్యాయాలలో పరిశీలించాం. కాని ఆంధ్రప్రజలలో నూటికి 95 మంది ఈ సిరిసంపదలు అనుభవించలేకపోతున్నారు. నూటికి 5 మందిగాఉన్న భూస్వాములు, వడ్డీవ్యాపారస్తులు దేశ సిరిసంపదలను స్వాధీనం జేసుకొని భోగవిలాసాలతో కాలం వెళ్ళబుచ్చుతున్నారు. నేటి అధికధరలు, నిరుద్యోగం వీరు మరింత ధనవంతులు అవడానికే తోడ్పడుతున్నాయి. అసంఖ్యాక ప్రజానీకపు జీవన పరిస్థితులుమాత్రం దినదినం క్షీణిస్తున్నాయి.

మన ప్రజల జీవనపరిస్థితులను అర్థంచేసుకోవాలంటె కష్టజీవులైన వారి సంవత్సర ఆదాయం, ఖర్చులు పరిశీలించడం అవసరం. ఇందుకు నమూనాలుగా యిచ్చట 5 ఎకరాల లోపు భూమిగల రైతు, కౌలుదారు, వ్యవసాయకూలి, చేనేత పారిశ్రామికుడు, రైసుమిల్లు కార్మికుడు, మైకాగని కార్మికుడు, మధ్యతరగతి ఉద్యోగస్తుడు, వీరి బడ్జెట్లు తీసుకొని వివరించడం జరిగింది. వీరు మన ప్రజలలో నూటికి 95 గా ఉన్న కష్టజీవులు. కనుక వీరి జీవితా లెలాగడుస్తున్నాయో పరిశీలించితే, ఆంధ్రప్రజల జీవనపరిస్థితు లెలాఉన్నాయో ద్యోతకమవుతుంది.

ఐదు ఎకరాలు - అంతకు తక్కువ భూమి ఉన్న రైతులు :

వీరి కుటుంబ బడ్జెట్‌లను పరిశీలించితే ఆరుగాలం కష్టించినా వీరి జీవితం నికృష్టంగా ఉన్నట్లు అర్థమవుతుంది. డాక్టరు నారాయణస్వామి నాయుడుగారి అంచనాల ప్రకారం 1939 - '45 సంవత్సరాల బడ్జెట్‌లు యీ విధంగా ఉన్నాయి : [ప్రక్క-పేజీలోని టేబుల్ చూడండి]

1939 సంవత్సరంలో ఉన్న రు. 7.9 ల మిగులుబాటు 1945 సంవత్సరానికి 0.9 లకు దిగజారింది. జీవిత వ్యయ ప్రమాణం 1939 కంటె 1945 కు సుమారు మూడు రెట్లు పెరిగితే, వీరి బడ్జెట్‌లో ఏ ఒక్క ఖాతాకిందకూడా ఖర్చు రెండు రెట్లకు మించి పెరగలేదంటే, 1935 లోని వీరి జీవన ప్రమాణ స్థాయి 1945 సంవత్సరానికి చాలా పడిపోయినట్లు స్పష్టమవుతున్నది. అందుచేత జీవనం గడవక,

చాలమంది ఈ తరగతికి చెందిన రైతులు అప్పుల పాలయ్యారు. డాక్టరు నారాయణ స్వామినాయుడు ఋణభారం విషయమై జరిపిన విచారణలో యీ తరగతి రైతులలో నూటికి 23.9 మంది, 1939 – '45 మధ్య కాలంలో కొత్త అప్పులు చేశారని, 13.3 మందికి ఉన్న అప్పు పెరిగిందని, 7.3 మంది ఉన్న అప్పును అసలు ఏమీ తీర్చలేక పోయారని తేలింది. ఈ విధంగా అప్పు పెంచుకొన్నవారిలో నూటికి 3.8 మంది మాత్రమే, భూములు కొనుక్కోనేందుకు – మొత్తం పదివేల రూపాయలవరకు – అప్పు చేశారు. † కనుక చేసిన అప్పంతా నిత్యావసరాలు గడుపుకొనుటకు మాత్రమే చేసినట్లు తేలుతున్నది.

| ఖర్చు వివరం | | 1939 (రూ॥లలో) | 1945 (రూ॥లలో) |
|---|---|---|---|
| వ్యవసాయం | ... | 84.8 | 175.6 |
| ఆహారం | ... | 196.4 | 361.0 |
| బట్టలకు | ... | 46.7 | 86.8 |
| పండుగలు | ... | 14.6 | 49.7 |
| రిపేర్లు | ... | 13.9 | 6.3 |
| చదువుకు | ... | 0.6 | 7.9 |
| ఇతరాలకు | ... | 34.1 | 63.9 |
| మొత్తం ఖర్చు | ... | 390.1 | 751.2 |
| మొత్తం ఆదాయం | ... | 398.5 | 750.3 |
| మిగులు (+) తరుగు (–) | ... | +7.9 | (–) 0.9 |

—Report of the Economist for Enquiry into Rural indebtedness. Page 109.

1945 సంవత్సరం తర్వాత జీవన వ్యయ ప్రమాణస్థాయికూడా పెరిగి పోయింది. ఇట్టి పరిస్థితులలో, క్రమంగా అప్పుల పాలవుతున్న యీ తరగతిలో చాల మంది జీవిత ప్రమాణం తగ్గిపోతున్నది.

**కౌలుదారులు:**

వీరు వ్యవసాయంపై ఆధారపడిజీవించే జనాభాలో నూటికి ఎనిమిది పాళ్లుంటారు. వీరిలో కొందరికి కొద్దోగొప్పో పొలం ఉన్నా, ప్రధానంగా భూస్వామి వద్ద కౌలుకుతీసుకున్న భూమే ప్రధాన జీవనాధారం. వీరి జీవనస్థితి హీనంగాఉన్నట్లు వీరి కుటుంబబడ్జెట్‌లు రుజువుచేస్తున్నాయి.

† Report of the Economist for Enquiry into Rural indebtedness Page : 38.

డాక్టరు నారాయణస్వామినాయుడుగారి అంచనాల ప్రకారం 1939_'45 సంవత్సర కుటుంబ బడ్జెట్లు ఇలా వున్నాయి:

| ఖర్చు వివరం | | 1939 (రూపాయలలో) | 1945 (రూపాయలలో) |
|---|---|---|---|
| వ్యవసాయానికి | ... | 91.2 | 183.9 |
| తిండికి | ... | 176.9 | 382.3 |
| బట్టలకు | ... | 37.9 | 71.9 |
| ఇతర అవసరాలకు | ... | 27.7 | 53.9 |
| పండుగలకు | ... | 4.0 | 21.4 |
| మరమ్మతులకు | ... | 7.4 | 6.5 |
| చదువుకు | ... | 0.1 | — |
| మొత్తం ఖర్చు | ... | 345.2 | 719.9 |
| మొత్తం ఆదాయం | ... | 343.3 | 675.8 |
| తరుగు | ... | 1.9 | 44.1 |

– పై గ్రంథమే – పేజీ 109.

వీరికి 1939 సంవత్సరంలోనే, ఆదాయంకంటె ఖర్చు ఎక్కువ. ఈ సంవత్సరంలో కుటుంబ బడ్జెట్‌లో లోటు 1.9 రూపాయలయితే, ఇది 1945 సంవత్సరానికి 44.1 రూపాయలకు పెరిగింది. క్రమంగా పెరుగుతూ వస్తున్న జీవన వ్యయ ప్రమాణాన్ని భరించలేక కొన్ని ఖర్చులు తగ్గించుకొంటున్నారు. ఉదాహరణకు, 1945 సంవత్సరంలో ఇదివరలో పిల్లల చదువుకు ఖర్చుచేస్తున్న నామ మాత్రపు ఖర్చును మానివేశారు. అయినా, కుటుంబ ఖర్చులకు తమ ఆదాయం సరిపోక అప్పుల పాలవుతున్నారు.

ఉదాహరణకు, 1939_'45 మధ్య కాలంలో, నూటికి 27.78 మంది కౌలుదారులు కొత్తగా అప్పులు చేశారు. 15.22 మందికి ఉన్న అప్పులు పెరిగాయి. 6.54 మంది ఉన్న అప్పులో కాసీకూడా తీర్చలేకపోయారు. నూటికి 8.3 మంది మాత్రమే అప్పు నంతటినీ తీర్చగలిగారు. మొత్తంమీద యీ తరగతివారికి తల 1కి సగటున 4.1 రూపాయలు అప్పు పెరిగింది.

1945 సంవత్సరం తర్వాత, జీవనవ్యయ ప్రమాణం క్రమంగాపెరుగుతూ వుంటే, వీరి స్థితి మరింత నీరసించిపోయింది. రోజులు గడచినకొలదీ వీరి జీవితం మరింత దుర్భరంగా తయారవుతున్నది.

వ్యా వ సా య కూ లీ లు :

వీరు వ్యవసాయంమీద ఆధారపడి జీవించేవారిలో సుమారుగా నూటికి అరవైమంది ఉంటారు. రెక్కల కష్టంమీద జీవనోపాధి గడించుతారు. పసిపిల్లల దగ్గరనుండి, కుటుంబంలోనివారంతా పనిచేస్తారు. పసిపిల్లలు అధికసంఖ్యలో పనిచేసే వృత్తులలో ఇది మొదటిది.

నీటి పారుదల వసతులులేని మెట్ట ప్రాంతాలలో పనిచేసేవారికి, సగటున సంవత్సరంలో **3-4** నెలలు మాత్రమే పని దొరుకుతున్నది. డెల్టా ప్రాంతాలలో **6-8** నెలలు పని దొరుకుతున్నది. † మిగిలిన కాలంలో వ్యవసాయేతరపని ఏదయినా చూచుకోవాలి. ఈ పనులలో వీరికి మామూలు వ్యవసాయపనులకు గిట్టే కూలీ కంటే ఎంతో తక్కువ గిడుతుంది. కొంతమంది ఇతర ప్రాంతాలకుపోయి, పనిచేసు కోవటంకూడా కద్దు.

మామూలుగా వ్యవసాయపు పనులకు మగవారికి 12 అణాలనుండి రూపాయివరకు, స్త్రీలకు తొమ్మిది అణాలనుండి పన్నెండణాలవరకూ, పిల్లలకు ఎనిమి దణాలనుండి పన్నెండణాలవరకు కూలీ ఇవ్వబడుతున్నట్లు, వ్యవసాయకూలీల వేతనాల గూర్చి కేంద్ర ప్రభుత్వ కార్మికశాఖ జరిపించిన విచారణలో తేలింది. కూలీరేట్లు పని తరహానుబట్టి మారుతూ ఉంటాయి.

1950లో కేంద్ర ప్రభుత్వం, వ్యవసాయ కూలీల స్థితిగతులపై విచారణ జరిపించింది. మదరాసు రాష్ట్రంలో, చంగల్‌పట్ జిల్లాలోని 'వందలూరు' లో జరిపిన విచారణ వివరాలు చూస్తే, మన వ్యవసాయ కూలీల జీవిత స్థితిగతులుగూడ స్థూలంగా అర్థమవుతాయి.

ఈ లెక్కల ప్రకారం, ఒక్కొక్క కుటుంబం (కుటుంబంలో ముగ్గురు పెద్దలు, ఇద్దరు చిన్నలు ఉన్నట్లు అంచనాలు వేశారు) సంవత్సరానికి సగటున రు. **322.6** సంపాదిస్తుంటే, రు. **336.4** లు, కుటుంబ పోషణకు ఖర్చవుతున్నట్లు (సంపాదనకు మించి 13.8 రూపాయలు) తేలుతున్నది. ఈ ఆదాయాన్ని (సంవత్సర ఆదాయాన్ని) యీ దిగువ ఖాతాలక్రింద ఖర్చు చేశారు.

ఆహారానికి 75%; గుడ్డలకు, చెప్పులకు 11.9; ఇంటి అద్దెకు 2.2%; వంటచెరుకు, దీపం ఖర్చుకు 0.6%, వైద్య సహాయానికి 0.2%, పిల్లల చదువుకు 0.1%, ఇతర చిల్లర ఖర్చులకు 10%.

ఒక్క తిండిఖర్చుకే, 75% ఖర్చవుతున్నది. అద్దెకు సంవత్సరానికి 2.2% అంటే, సుమారు 7 రూపాయలు ఖర్చుచేస్తున్నారు. ఈ అద్దెకు ఎటువంటి నివాస వసతి లభిస్తుంది? వీరి బడ్జెట్‌లో, పిల్లలచదువుకు వైద్యసహాయానికి కలిపి 0.3%,

---

†Report of the Grow more Food Enquiry Committee. Page: 51

అంటే రూపాయికంటె కొంచెం తక్కువ ఖర్చుచేస్తున్నారు. ఈ ఖర్చుచేసే రూపాయితో ఎంత వైద్యసహాయం పొందగలరు? ఎవరు పిల్లలను చదివించగలరు?

తినే ఆహారంకూడా పుష్టికరమైనది కాదు. వీరు ఆహారం కొరకు కేటాయించిన రు. 252 లను ఈ ఖాతాలక్రింద ఖర్చుచేస్తున్నారు.

81.1% తిండిగింజలకు (Cereals), 4.9% పప్పుదినుసులకు (Pulsus), పంచదార, బెల్లములకు 1.5%, ఉప్పు వగైరాలకు 5.5%, నూనెలకు 4.3%, కూరగాయలకు 2.2%, మాంసం, చేపలకు 0.4%, ఇతర చిల్లర సరుకులకు 0.1% పాలకుగాని, పాలతోచేయబడిన పదార్థాలకుగాని, పండ్లకుగాని వీరి బడ్జెట్‌లో ఆస్కారం లేదు.

వీరు ఖర్చుచేసే రు. 252 లో, తిండి గింజలు కొనడానికే సుమారు రు. 200 రూపాయలు అయిపోతే, మిగిలిన 50రూపాయలు పై ఖర్చులకు ఏవిధంగానూ చాలవు.

ఇట్టి నికృష్ట జీవితం గడిపే వ్యవసాయకూలీ, అప్పుల పాలయ్యాడంటే ఆశ్చర్యపడ నవసరంలేదు.

డాక్టరు నారాయణస్వామినాయుడుగారి అంచనాలప్రకారం, 1939-'45 సంవత్సరాల మధ్యకాలంలో నూటికి 25.5 మంది కొత్తగా అప్పులు చేశారు. 15.5 మందికి ఉన్న అప్పులు పెరిగాయి. 8.9 మంది అప్పును ఏమాత్రం తగ్గించుకోలేక పోయారు. అందుచేతనే 1939 నుండి, 1945 సంవత్సరంనాటికి, తల 1 కి ఉన్న సగటు అప్పులభారం 40.8 రూపాయలకు పెరిగింది. పైన ఉదహరించిన యితర తరగతుల అప్పుభారంకంటే, ఈతరగతి అప్పుభారం చాల అధికంగాపెరిగింది. ఈ అప్పులు పెట్టి గ్రామ భూస్వాములు వ్యవసాయకూలీలను బానిసలుగా చేసుకొనటం జరుగుతున్నది. పైగా వ్యవసాయ కూలీలలోని నిరక్షరాస్యతను వీలుగా తీసుకొని, తప్పుడు లెక్కలతోనూ, దగా కొలతలతోనూ మోసగించడంకూడా జరుగుతున్నది.

దినానికి 10 గంటలు ఇంటిల్లపాది పనిచేసినా, నోటికి చేతికి అందని నికృష్ట జీవితం మన వ్యవసాయకూలీలు గడుపుతున్నారు. వైద్యసహాయంలేదు. పిల్లలకు చదువు చెప్పించుకొనే భాగ్యం అసలేలేదు.

అనారోగ్యకరమైన చిన్న పూరి ఇండ్లలో వీరి నివాసం. ఆరోగ్యవంతమైన నివాసం అంటే (5 గురు ఉన్న కుటుంబం నివసించేందుకు) సగటున నివాసి 1 కి 70 చదరపు అడుగుల చొప్పున కనీసం 340 చదరపు అడుగులుండాలి. మనగ్రామ సీమలలో ఒక్క వ్యవసాయకూలీలకే కాదు, పేదరైతులకు, కౌలుదార్లకు, ఎవరికీ ఇంతటి విస్తీర్ణం గలిగిన గృహావసతులు లేవు.

ఇదీ మన వ్యవసాయకూలీ జీవితస్థితిగతి! వ్యవసాయంపై జీవించేవారిలో నూటికి అరవైమంది ప్రజల జీవితం ఇంత దుర్భరంగా ఉంది!

చేనేత పారిశ్రామికులు :

వీరిని స్వతంత్రులు, అస్వతంత్రులు (మాస్టరు వీవర్ల కింద పనిచేసేవారు), కోపరేటివుల్లో చేరినవారు, కూలీలు అని నాల్గు విధములుగా విభజించవచ్చును.

స్వతంత్రులు : వీరు నూలుకొని నేసిన బట్టను అమ్ముకుని దానిపై వచ్చిన లాభంతో జీవనం గడుపుతారు.

అస్వతంత్రులు : వీరు ఏవిధంగానూ పెట్టుబడి పెట్టగల స్థితిలో లేరుగనుక, తమకు నూలుఇచ్చి, బట్టలునేయించుకొనే మాస్టరు వీవరు క్రింద పనిచేస్తారు. వీరికి నేయబడిన గుడ్డ అమ్ముడుపోయినా, పోకపోయినా మాస్టరు వీవరు, చేసినపనికి కూలి ఇస్తాడు. వీరు కుటుంబం గడవక తరచు మాస్టరు వీవరువద్ద ఎడ్వాన్సులు తెచ్చు కోవడంకూడా కద్దు. దీని నాధారంగా చేసికొని, మాస్టరు వీవరు న్యాయంగా వీరికి రావలసిన కూలీ రేటుకంటె, తక్కువ ఇస్తూ ఉంటాడు. ఈ తరగతికి చెందిన కార్మి కులు సుమారు నూటికి 60 మంది ఉంటారు.

కూలీకార్మికులు : వీరికి స్వంత మగ్గాలుకూడా ఉండవు. ఎవరయినా మగ్గం, నూలు ఇచ్చి పనిచేయమంటే, చేసి, ఆ చేసినదానికి కూలి పుచ్చుకుంటారు. వీరినుండి మగ్గం వాడుకొన్నందుకు బాడుగకూడా వసూలుచేయటం కద్దు. కనుక, మాస్టరు వీవర్ల కింద పనిచేసే 'అస్వంతంత్రులు' కంటె, వీరికి తక్కువకూలి గిడుతుంది. మగ్గానికి వసూలు చేయబడే బాడుగ నెలకు 4–5 రూపాయలుంటుంది. *

"ఈ నిత్య దరిద్రులు స్వంతమగ్గాలు కొనడం కలలోనిమాట. ఒకవేళ ఎవరయినా కొనగలిగినా, దానిని ఉంచడానికి తగిన ఇల్లు సాధించడం అసలే దుస్సాధ్యం" అని వీరి దుస్థితిని వివరిస్తూ చేనేత పరిశ్రమపై ప్రభుత్వం ప్రకటించిన రిపోర్టులోనే పేర్కొనబడింది.

కోపరేటివుల క్రింద పనిచేసేవారు సుమారు నూటికి 9–10 మంది ఉంటారు. సక్రమంగా పనిజేసే సొసైటీలలోని సభ్యులకు మార్కెట్ రేటుప్రకారం కూలి లభించుటేకాక, కోపరేటివు సంపాదించిన లాభాలలో తమ షేరుప్రకారం లాభంకూడా పంచుకుంటారు.

నూలు సరిగా సప్లయి అయినా, నెలలో 20 రోజులకంటె పనిదొరకదు. యుద్ధకాలంలో నూలు కొరతతో నెలలో పది రోజులుకూడా పని ఉండేదికాదు. ప్రస్తుతం నూలు సప్లయి అభివృద్ధి చెందినా, నేసిన బట్ట కొనేనాథుడులేడు. కనుక, నెలలో 20–25 రోజులు నిరుద్యోగిగానే ఉండవలసి వస్తున్నది.

ఈ పరిశ్రమలో పనిచేసే కార్మికునికి, కుటుంబంలోని పిల్లలు, ఆడవారు కూడా సహాయం చేస్తారు. అలా చేయడం అత్యవసరంకూడా.

* 1948 లో డాక్టరు నారాయణస్వామిగారి అంచనా.

వీరి దినకూలీని అంచనా వేయుటం కష్టం. నాగను నేయుటకు ముందు చేయవలసిన పనులకు, ఒక్కొక్కదానికి ఒక్కొక్క కూలీరేటు; నేసినందుకు మరొక రేటు. ఇవికూడ వివిధ ప్రాంతాలలో వివిధ రకాలుగా ఉంటాయి. కనుక దినకూలి ఇంత అని అంచనా వేయటం కష్టం. కార్మికునికి కుటుంబం అంతా సాయపడుతుంది కనుక, ఎవరికి ఎంతకూలో, నిర్ణయించడంకూడా కష్టమే. అందుచేత ఒక్కొక్క కుటుంబం నెలకు ఎంత సంపాదిస్తున్నదో విచారించటం తప్ప మరొక మార్గంలేదు.

1947 లో చేనేత పరిశ్రమపై, ప్రభుత్వం తరఫున రిపోర్టు సేకరించిన డాక్టరు నారాయణస్వామినాయుడు చేనేత కుటుంబాల ఆదాయవ్యయాలపై వేసిన అంచనాలు పరిశీలించదగ్గవి.

ప్రతి కుటుంబంలోను సగటున 5.02 మంది ఉన్నారు. (వీరిలో ముగ్గురు పెద్దలు, ఇద్దరు పిల్లలుగా జమకట్టవచ్చు.)

సగటున ప్రతి కుటుంబం నెలకు రు. 61-1-11 లు సంపాదిస్తోంది. కుటుంబంలోని ప్రతి సభ్యుడు సగటున నెలకు రు. 12-3-7 సంపాదించుతున్నాడు.

ఆదాయాలవారీ, వివిధ కుటుంబాలు, నెలకు ఎంత సంపాదించుతున్నదీ, ఎంత ఖర్చు చేస్తున్నదీ, ఎంత మిగులు, ఎంత తరుగు ఇత్యాది విషయాలు ఇలా వివరించబడివున్నాయి:

| ఆదాయంవారీ విభజన | సగటు కుటుంబ ఆదాయం (రూపాయలలో) | సగటు కుటుంబ ఖర్చు (రూపాయలలో) | తరుగు (−) మిగులు (+) (రూపాయలలో) | తరుగు, మిగులు ఖర్చులలో ఎంత శాతం? |
|---|---|---|---|---|
| రు. 35 కు లోపు | 29- 2- 1 | 48- 4- 4 | -19- 2- 3 | - 39.7 |
| రు. 35 కు పైన 50 కి లోపు | 39-12-11 | 51-10-10 | -11-13-11 | - 22.9 |
| రు. 50 కి పైన రు. 75 లోపు | 59-9- 6 | 72- 0- 1 | -12-12- 7 | - 17.8 |
| రు. 75 కు పైన రు. 100కి లోపు | 82-13- 7 | 87- 5- 4 | - 4- 7- 9 | -5.1 |
| రు. 100 పైన | 130- 0- 5 | 129- 0- 1 | +1- 0- 4 | + 0.8 |
| సగటు | 61- 1-11 | 71-12- 6 | -10-10- 7 | - 14.8 |

Source: Report of the court of enquiry into Labour Conditions in Hand-loom Industry. Page 22

అధికంగా ఆదాయాలు వచ్చే వర్గంలో పనిచేసేవారి సంఖ్య అధికంగా ఉంటుంది. ఈ పెద్ద కుటుంబంవారు మాత్రం చాటూచాటీగా వచ్చే ఆదాయం సరిపెట్టుకోగలుగుతున్నారు. తక్కువ ఆదాయం వచ్చే కుటుంబాలవారికి, (రు. 1000 లకు పైబడి ఆదాయం వచ్చేవారు తప్ప) తమ సంపాదన కుటుంబ పోషణకు చాలటం లేదనేది పై టేబులు స్పష్టం చేస్తున్నది.

వీరి కుటుంబ బడ్జెట్ * చూస్తే, వీరు ఎలా బ్రతుకుతున్నారో అర్థమవుతుంది. ఖర్చుచేసే మొత్తంలో నూటికి 61 వంతులు (సుమారు రు. 43) ఆహారానికి ఖర్చు పెడుతున్నారు. ఇంటి అద్దెకు నూటికి 22 వంతులు (సుమారు రు. 16 లు) ఖర్చు పెడుతున్నారంటే, ఇంటి అద్దె చౌక అని భావించరాదు. అంతకుమించి వారు భరించలేక ఏ కూపంలోనో నివసిస్తున్నారు. "వీరి నివాసాలు, వారి దుర్భర దారిద్ర్యానికి ప్రతిబింబాలు" అని నారాయణస్వామినాయుడు వ్రాశారు. మిగిలిన రు. 13 లతో, ఇంటి-దీపం ఖర్చులు, పిల్లల చదువులు, వైద్యసహాయం, ప్రయాణం, తదితర ఖర్చులకు వినియోగించుతున్నారు.

అన్ని తరగతుల కార్మికులుకూడ దుర్భరదారిద్ర్యజీవితం గడుపుతున్నారని పై వివరాలు రుజువుచేస్తున్నాయి. వచ్చే ఆదాయంలో నూటికి 60 పాళ్ళు ఆహారం కోసం ఖర్చుచేయడమే, వీరి దారిద్ర్య జీవితానికి కొలతబద్ద.

ఆదాయాలకు మించిన ఖర్చుతో వీరు అప్పులపాలవుతున్నారు. 1947 లో వీరి అప్పులు, ఆదాయాలవారీ ఈ విధంగా ఉన్నాయి:

| ఆదాయంవారీ విభజన | సగటు కుటుంబపు అప్పు (రూపాయలలో) | పనిచేసే ప్రతి ఒక్కరికి ఎంత అప్పు (రూపాయలలో) |
|---|---|---|
| రు. 35 కు లోపు | 136- 3- 5 | 129-13- 0 |
| రు. 35 కు పైన 50 కి లోపు | 156- 6-11 | 132- 4- 0 |
| రు. 50 కి పైన 75 కు లోపు | 258- 1- 2 | 143- 0-10 |
| రు. 75 కి పైన 100 కు లోపు | 177- 1 -0 | 84- 9- 4 |
| రు. 100 కు పైన | 221- 6- 3 | 68- 8- 8 |
| సగటు | 190-15- 2 | 110- 8- 2 |

— పై గ్రంథమే 23 వ పేజీ

* బడ్జెట్ అంచనాలు పై పుస్తకంనుండి తీసుకోబడ్డాయి.

వీరి ఈ అప్పులు తాము నెలకు సంపాదించే భత్యానికంటె 8 రెట్లు అధికం అంటే, వీరి అప్పులభారం ఎంత పెద్దదో తేలుతున్నది.

ఈ అంచనాలన్నీ, నూలుకొరతవల్ల నెలలో ఎన్నిరోజులు పని దొరకక పోయినా, దొరికిన నూలుతో నేసిన గుడ్డను, ప్రజలు ఎగబడి కొనేరోజులలో (1947). ఆ రోజుల్లో, మజూరీలుకూడా అధికమే. నెలలో ప్రతి కార్మికునికి 15రోజులకు తగ్గని పని ఉండేది. ఇట్టి స్థితిలోనే, చేనేతకార్మికుని జీవితగతి ఇంత దుర్భరంగా ఉంటే చేద్దామన్నా పనిలేని ఈ రోజుల్లో 1947 కంటె జీవన వ్యయ ప్రమాణం పెరిగిన నేడు, చేనేత కార్మికుని జీవితం ఎంత దుర్భరంగా ఉంటుందో ఊహించటం సులభమే !

అనేకమంది చేనేత పారిశ్రామికులు, కుటుంబాలు పోషించలేక భార్యా బిడ్డలను వదలి కానని కంతలకు పారిపోవడమో, ఆత్మహత్య చేసుకోవడమో, తరచు జరుగుచున్నదంటే, వీరి జీవితం నేడు ఎంత నికృష్టంగా ఉందో అర్థమవుతుంది. ఇతర గ్రామీణ పరిశ్రమలలో పనిచేసే, కార్మికుని జీవిత స్థితిగతులు స్థూలంగా ఇందుకు ఏమాత్రమూ భిన్నంగాలేవు. చాలీచాలని వేతనాలు, మురికికూపాలలో నివాసం, అప్పులభారంతో క్రుంగడం, విద్యావైద్య సౌకర్యాలు శూన్యం. ఇదీ నేడు ఈ వర్గాల జీవిత స్థితి గతి !

## రైసు మిల్లు కార్మికులు :

రైస్‌మిల్లులు ఒక సీజనులోనే పనిచేస్తూఉంటాయి. ఈపనిచేసేకాలంలో దిన కూలీకి కార్మికులను పనిలోకి తీసుకుంటారు. రోజూ ఒకే కార్మికుని తీసుకోవాలనే ఆచారం లేదు. అందుచేత ఏ ఒక్క కార్మికునికి, ఏఒక్క ఫ్యాక్టరీలోను సర్వీసు (continuous service) లేదు. ఇంజను డ్రైవర్లు, మెషిన్‌మెన్‌లువంటి టెక్నికల్ కార్మికులుమాత్రమే నెలజీతాలపై నియమించ బడుతున్నారు.*

వీరి నెలజీతాలు రు. 25 నుండి, 35 వరకు ఉంటాయి. మగకూలీల కూలి రు. 0_8_4, ఆడకూలీలకు రు. 0_7_6 ఇస్తున్నారు. (1946)

ఈ వేతనాలు కుటుంబపోషణకు ఎటూ చాలవుకనుక, ఒకే కార్మికుడు రెండు షిఫ్టులలోకూడా పనిచేయడం సామాన్యం. ఇందుకు వీరికి ఓవరుటైము కూలి ఇవ్వబడడంలేదు. పనిచేసే ఫ్యాక్టరీలో కార్మికులకు ఎట్టివసతులు, ప్రమాదాలనుండి రక్షణలులేవు. రైసుమిల్లు కార్మికుల స్థితిగతులపై కేంద్రప్రభుత్వం తరఫున విచారణ జరిపిన శ్రీ బి. పి. అడార్కరు,* "కొన్ని ఫ్యాక్టరీలు వెల్తురు గాలి చొరని గుహాలలా ఉన్నా"యని వ్రాశారు. "మిల్లులు చాలా ఇరుకుగా ఉన్నాయి. మరుగు దొడ్డి సౌకర్యాలు చాలా హీనంగా ఉన్నాయి. టిఫిన్ షెడ్‌లు, విశ్రాంతికి షెడ్‌లు అసలే లేవు. ఏఒక్క మిల్లుకూ ఆసుపత్రి లేదు, ప్రథమ చికిత్సా సౌకర్యాలు నామ మాత్రంగా ఉన్నాయి."

*Report on Labour conditions in the rice mills (1946) Pages 66-67

ఇంజన్ కార్మికుడు, ఇంజన్ వేడివల్ల వచ్చే దగ్గు, ఊపిరి తిత్తుల వ్యాధితోనూ, కాటా కూలీలు బరువులు మోయడంవల్ల నడుము నొప్పులతోను, పొట్టు ఎత్తిపోసేవారికి దుమ్మునుండి రక్షణ సాధనం (Respirator) లేకపోవటంవల్ల దగ్గు రక్తపు వాంతులతోను, దాదాపు కార్మికులంతా కంటి జబ్బులతోను బాధ పడుతూ ఉండటం సామాన్యమైన విషయమని; వీరికి వైద్యం, చికిత్సవిషయంలో మిల్లు యజమాని ఎట్టి శ్రద్ధ వహించడంలేదని ఈ రిపోర్టులో పేర్కొనబడింది.

వీరికిచ్చే జీతాలు ఎటూ చాలవుకనుక, కార్మికులంతా అప్పులలో మునిగి తేలుతున్నారు. కూలీలలో చాలమందికి తల 1కి సగటున రు. 50–100 ల అప్పులు ఉన్నాయి. రూపాయకు నెల 1కి అణా చొ॥న వడ్డీ చెల్లించుతున్నట్లు అంచనా వేయబడింది. "ధరలు పెరిగిన నిష్పత్తిలో కూలీ పెరగక పోవడమే ఈ అప్పుల పెరుగుదలకు కారణం"* అని శ్రీ అడార్కరు వ్రాశారు.

కార్మికుల గృహావసతులు చాల దారుణంగా ఉన్నాయి. వీరంతా పూరి ఇండ్లలోనే నివసిస్తున్నారు. వీరి గృహావసతిని శ్రీ అడార్కరు ఈవిధంగా వర్ణించారు:

"చిన్నగది, దాని ప్రక్కన ఒక వంటగది ఉన్న పాకలో 4–5 కుటుంబాలవారు ఉంటున్నారు. వేసవిలో బైట పడుకుంటారు. కాని వర్షాకాలాలో, చలి కాలంలో విపరీతంగా బాధపడతారు. వీటిలో కొన్ని ఎంత చిన్నపాకలంటే, నిలువుగాగాని, అడ్డంగాగాని, మనిషి పడుకుంటే పొడవు చాలదు. కనుక మూలవాటుగా పడుకుంటారు."♦

ఇట్టి జీవితంలో వచ్చే అనేక వ్యాధులకు చికిత్స చేయించుకొనే స్థోమత వీరికి లేదు. పిల్లలను చదివించడంకూడా వీరికి మించినపనే!

మైకాగని కార్మికులు :

వీరికి సంవత్సరంలో ఎనిమిది లేక తొమ్మిది నెలలుమాత్రమే పని ఉంటుంది.

వీరి దినకూలి, మగవారికి రూపాయి నుండి ఎనిమిదణాలవరకు, ఆడవారికి ఎనిమిదణాలనుండి 12 అణాలవరకు ఉన్నది. నిపుణతనుబట్టి కూలీరేటు మారుతున్నది. †

కేంద్ర ప్రభుత్వం, మైకా కార్మికుల జీవిత స్థితిగతులపై ప్రకటించిన రిపోర్టు విచారణ సందర్భంలో వివరించిన కూలి రేట్లు వాస్తవంగా ఇవ్వబడుతున్న రేటుకంటే హెచ్చుగా ఉన్నాయనీ, ఆ రేట్లయినా 1939 తర్వాత జీవన వ్యయ ప్రమాణం పెరిగిన నిష్పత్తిలో పెరగలేదనీ వివరించబడింది.

---

*పై గ్రంథమే - పేజీ 19.

♦పై గ్రంథమే పేజీ 26.

†పై గ్రంథమే పేజీ 24

Report on the Labour conditions in the Mica Mining and Mica manufacturing Industry–pages : 43–44.

కార్మికులలో అత్యధిక సంఖ్యాకులు ఒకే గనిలో ప్రతిసంవత్సరం నెల జీతాలపై పనిచేయడం అనేదిలేదు. అందుచేత వీరికి ఎలవెన్సులుగాని, బోనసులు గాని ఇవ్వబడడంలేదు.

కూలీలు తక్కువయినా, ఇతరసౌకర్యాలు ఎలాఉన్నా, ఓవరుటైము పని చేయడంమాత్రం తప్పటంలేదు. ఏ ఇతర పరిశ్రమలోకంటె ఈ పరిశ్రమలో ఓవరు టైము పని చేయడం అధికం.

*ప్రభుత్వ రిపోర్టులో "అన్ని గనులలోను, గనులచట్టం (Indian mines Act) సూచించిన పరిమితికి (ఈ పరిమితిప్రకారం వారానికి ఆరురోజుల పని, 54 గంటలకు) మించి పనిచేయించరాదు. కాని అన్ని గనులలోను ఈ పరిమితికంటె ఎక్కువకాలం పనిచేయిస్తున్నారు... పైగా గనులచట్టంలో కార్మికుడు గని ముఖ ద్వారంలో ప్రవేశించిన దగ్గరనుండి, తిరిగి సాయంత్రం బైటకు వచ్చేవరకు పనిరోజు క్రింద జమకట్టబడవలసిఉంటే, ఇచ్చట (గూడూరులో-రచయితలు) చాలా గనులలో, కార్మికుడు గనిలోనికి రావడానికి, లోపలికి వెళ్ళడానికి పట్టేకాలాన్ని పనిగంటలలో చేర్చడంలేదు.

ఏ గనిలోకూడ కార్మికుని ప్రాణ రక్షణకు, ఆరోగ్య రక్షణకు తగిన చర్యలు తీసికొనబడడంలేదు. నాల్గు లేక ఐదు గనులలో మాత్రం (1944 లో) విద్యుత్ దీపాలు ఉన్నాయి. మిగిలినవాటిలో కొవ్వొత్తులు, కిరసిన్ దీపాలు ఉప యోగించబడుతున్నాయి. చాల కొద్ది గనులలోమాత్రం గాలి (artificial air) లోపలికి పంపబడుచున్నది. గనిలో ఊరేనీటిని వెలుపలికి పంపకపోవుటచేత కార్మికులు ఆ నీళ్ళలోనే పని చేయవలసి వస్తున్నది. మంచినీటి సప్లయికూడా సరిగా లేదు. మరుగుదొడ్డి సౌకర్యాలుకూడా లేవు.

నూటికి 10-15 మంది కార్మికులకు మాత్రమే, యజమానులు గృహ వసతులు కల్పిస్తున్నారు. ఇవయినా, 54 చ॥ అడుగులమేర వేసిన పాకలు! మిగిలిన వారంతా తమ పాకలతోనే (ఇట్టివే) కాలం గడుపుతున్నారు.

గనులప్రాంతానికి ఆరుమైళ్ళ దూరంలో (పొందలకూరులో) జిల్లాబోర్డు ఆసుపత్రి మాత్రం ఒక్కటిఉన్నది (1944). కార్మికులు తరచు మలేరియాతో బాధ పడుతూ ఉంటారు. గనిలో పనిచేయడంవల్ల (తగిన రక్షణలేక) కంటిజబ్బులు, సిలి కోసిస్ (Silicosis), ఊపిరితిత్తుల జబ్బులు తరచు వస్తున్నాయి. ప్రసూతి సౌకర్యాలు గాని, ప్రమాద భీమా సౌకర్యాలుగాని లేవు." (1946 లో పై గ్రంథము-పేజీ 46.)

వచ్చేకూలితో, జీవనం గడవక, చాలమంది కార్మికులు అప్పుల పాలయి నట్లు ప్రభుత్వ రిపోర్టులో ♦ ఉదహరించబడింది. ఈ అప్పులను గనియజమానులే

* Report on Labour conditions in the mica mining and mica manufacturing Indnstry–page 45–46.

♦ పై గ్రంథమే 48 వ పేజీ.

ఎడ్వాన్సుగా ఇవ్వడం జరుగుతున్నది. కార్మికులు కొన్నిచోట్ల తిండిగింజలు, తదితర ఆహారపదార్థాలు కొని, కొట్లమీద అప్పులుచేశారు. ఇట్టి అప్పులు ఒక్కొక్క కుటుంబానికి సుమారు రు.100_150 వరకు ఉంటాయని 1944 లో అంచనా వేయ బడింది. 1944 తర్వాత జీవన వ్యయప్రమాణం పెరిగినంతగా జీతాలు పెరగలేదు కనుక అప్పుల భారం ఏ విధంగాగా ఇంతకు తగ్గే అవకాశంలేదు. పెరగడానికి ఎంతయినా వీలున్నది.

అప్పులభారంనుండి విముక్తికి వెంటనే కనీస కూలిచట్టము (Minimum Wages Act) అమలుపరచబడాలని, కూలీరేట్లుహెచ్చించబడాలని రిపోర్టు సేకరించిన శ్రీ అడార్కరు సిఫార్సుచేశారు. కాని ఇవి ఇంతవరకూ అమలుజరపబడడంలేదు.

దుర్భర దారిద్ర్యజీవితం గడుపుతున్న కార్మికులు పిల్లలకు చదువు చెప్పించుకొనే భాగ్యం లేదు. పిల్లల శ్రమ తక్కువ కూలికి లభిస్తుంది. కనుక, యజమాని పిల్లలనుకూడా పనిలో పెడుతున్నాడు. తాము సంపాదించేది దినభత్యానికే చాలదు కనుక, కార్మికులు తమ పిల్లలను పనిలోకి పంపుతున్నారు. దినమంతా పనిచేసినా మన గనికార్మికుడు నిత్య దారిద్ర్యాన్ని అనుభవించక తప్పటంలేదు.

మధ్యతరగతి ఉద్యోగస్తులు :

తెల్ల గుడ్డలు కట్టినా వీరూ దినమంతా కష్టించేవారే. ఈఉద్యోగస్తులలో అత్యధికులు నెలకు రు. 75_100 లు సంపాదించేవారే!

వీరి జీవిత పరిస్థితులగూర్చి 1945 లో ఒక విచారణ జరిపినా, అందులో గుమస్తాలలో అధిక భాగంగా ఉన్న రు. 75_100 జీతం వారిని గూర్చిన వివరాలు లేవు. కనుక వీరి నిజపరిస్థితులు ఈ రిపోర్టు వివరించదు.

కార్మికులవలె వీరిలో సంసారమంతా కష్టం చేయరు. ఉద్యోగమున్నవారి సంపాదనపై ఆధారపడి బ్రతికేవారి సంఖ్య ప్రతిగుమస్తా సంసారంలోనూ అధికంగానే ఉంటారు. కనుక సంపాదించే వ్యక్తి యీ భారాన్నంతటినీ మోయవలసి వస్తున్నది. ఇక ఇప్పటి పరిస్థితులలో ఉన్న ఉద్యోగాలు నిల్పుకొనటమే గగనంగా ఉన్నది.

మదరాసు రాష్ట్రంలో యీ మధ్యతరగతి కుటుంబాలలో నూటికి 39 మంది మాత్రమే రు. 140 రూపాయలతో (నెలకు) గడుపుతున్నట్లు, నూటికి 22 కుటుంబాలు రు. 150_250 లతో గడుపుకుంటున్నట్లు ఈ రిపోర్టులో వివరించబడింది. ఒక్కొక్క కుటుంబంలో సరాసరి 6.7 మంది జనాభా ఉన్నారు. వీరిలో 1.12 కుటుంబాలవారికే ఇతరత్రా ఆదాయం ఉన్నది.

రు. 150 ల ఆదాయంవచ్చే కుటుంబాలవారి నెలసరి కుటుంబ బడ్జెట్ ఇలా ఉంది :

వీరు నూటికి 40.6 వంతులు తిండికి, 13.1 వంతులు బట్టలకు ఖర్చు చేస్తున్నారు. పిల్లల చదువుకు రు. 2_5_0 నుండి 4_11_0 లు, వైద్యానికి రు. 0_7_0

నుండి రు. 4-14-0 లు, వార్తాపత్రికలకు 0-4-0 నుండి రు. 3-8-0 వరకు, వినోదాలకు (సినిమా వగైరా) 0-6-0 నుండి రు. 1-7-0 వరకు ఖర్చు చేస్తున్నారు.

నివాస సౌకర్యాలుకూడా సరిగాలేవు. నూటికి 80 కుటుంబాల వారికి గదికి ఇద్దరు - ముగ్గురు ఉంటున్నారు.

ఇంత కుదించి ఖర్చుపెట్టినా, తమసంపాదన చాలక అప్పులపాలవుతున్నారు. విచారించబడిన 388 కుటుంబాలవారిలో 324 (84%) కుటుంబాలు అప్పులలో మునిగి ఉన్నాయి. అమ్మగలిగినవన్నీ (నగలు-నట్రా) అమ్ముకొనే, గత్యంతరంలేక వీరు అప్పులకు బయలుదేరుతారనే విషయం గమనించితే, వీరి నెలసరి ఆదాయాలు కుటుంబ పోషణకు ఏ విధంగానూ చాలటంలేదనే స్పష్టమవుతుంది.

ఈ వివరాలు 1945 సంవత్సరం నాటివి. జీవిత వ్యయ ప్రమాణం 1945 సంవత్సరంనుండి, 1952 నాటికి నూటికి 48.5 పాళ్ళు పెరిగింది. ఈ పరిస్థితిలో జీతాలుమాత్రం పెరగలేదు. గొర్రెతోక జీతాలతో, వామనుడిలా పెరిగే జీవన వ్యయప్రమాణంతో వీరి జీవిత స్థితిగతులు ఎంతో హీనంగా తయారయ్యాయి.

రు. 150 లు సంపాదించే, వీరి జీవితమే ఇలా ఉంటే, రు. 75-80 తెచ్చుకొనే గుమస్తాలు, రు. 18-45 జీతాలు తెచ్చుకొనే ఎలిమెంటరీస్కూలు టీచర్లు, రు. 40-75 తెచ్చుకొనే సెకండరీ గ్రేడు టీచర్ల, ప్రైవేటు కంపెనీలలో ఇంతకు మించని జీతాలతో రోజులు 10 గంటలుకూడా పనిచేసే గుమాస్తాల జీవితస్థితి ఎంత బాధాకరంగా ఉంటుందో ఊహించవచ్చు. దీనికితోడు నేడు తీవ్రరూపం దాల్చిన జీతాలకోతలు, రిట్రెంచిమెంటు, నిరుద్యోగ సమస్యలు, ఈ తరగతివారి జీవితాలను మరింత బాధాకరంగా చేస్తున్నాయి.

మన ప్రజలలో నూటికి 95 మంది దినమల్లా రెక్కలు ముక్కలుచేసికొన్నా డొక్క నిండని దౌర్భాగ్యస్థితిలో ఉన్నారనేది దీనినుండి స్పష్టమౌతుంది. ఒక పక్క ఆంధ్రదేశం ఆహారధాన్యాలను అపారంగా ఎగుమతిచేస్తూఉంటే, మరొకపక్క లక్షలాది ప్రజలు పొట్ట చేతపట్టుకొని అన్నమో రామచంద్రా అని అలమటిస్తున్నారు.

జీవనదులు మన భూమిలో ప్రవహిస్తూఉంటే, లక్షలఎకరాల నేల నెర్రలు విచ్చి నీటికై అర్రులు చాస్తోంది. నేల తల్లి గర్భంలో ఖనిజాలు ఖంగుఖంగున మ్రోగుతున్నాయే కాని, వాటిని వినియోగించుకొనే పరిస్థితులు మనకు ఇంకా కలగడంలేదు.

ఈ దుస్థితి తుదముట్టించడానికి ఆంధ్రప్రజలు ముందుకురావాలి. మన సిరిసంపదలను ఏ కొద్దిమందోకాక, జాతి యావత్తూ అనుభవించేటందుకు అవసరమైన చర్యలు గైకొనాలి. అందుకు అనువైన ఆర్థిక సాంఘిక సంస్కరణలను మన సాంఘిక వ్యవస్థలో తేవాలి. అప్పుడే ఆంధ్రజాతి వర్ధిల్లుతుంది. ఆంధ్రసంస్కృతి వికసిల్లుతుంది. తమ సిరిసంపదల ననుభవించే ఆంధ్రప్రజలతో తెలుగుసీమ కళకళలాడుతుంది.

# BIBLIOGRAPHY


1. Statistical Atlas of Madras Province 1940 – '41.
   — Published by the Economic Adviser to the Govt. of Madras.

2. Large Scale Industrial Establishments coming under operation of the Indian Factories Act for the Calendar year 1949. (Madras Government Publication.)

3. Commercial Directory – Madras State 1952 (Published by Government of Madras).

4. Seasonal Crop Report of Madras State 1950 – '51 – Published by the Economic Adviser, Government of Madras.

5. Records of Geological Survey of India Vol. 81, Part 3 – (1950).

6. Memoirs of the Geological Survey of India Vol. 80.

7. Records of the Geological Survey of India Vol. LXXVI.

8. Food and Agriculture in Madras State by Dr. B. Natarajan, Economic Adviser to the Government of Madras.

9. Administration Report of the Highways Dept. 1949 – '50, Government of Madras.

10. Administration Report of the Highways Dept. 1950 – '51, Government of Madras.

11. Administration Report of the Agricultural Department, Government of Madras 1950 – '51.

12. Administration Report of the Agricultural Department, Government of Madras 1951 – '52.

13. Administration Report of Madras, Animal Husbandry Department 1949 – '50.

14. Administration Report of Madras, Animal Husbandry Department 1950 – '51.

15. Administration Report of Forest Department, Govt. of Madras 1951.

16. Land Revenue Reforms Committee Report, Madras Vols. I & II.

17. Agricultural wages in India Vols. I & II.

18. Report of the Congress Agrarian Reforms Committee.

19. Rural Problems of Madras 1947 by S. Krishna Swamy.

20. Madras in Maps - 1951 (Madras Government Publication.)

21. Report on Public Instruction 1947 - '48.

22. Report on Public Instruction 1949 - '50.

23. Report on Public Instruction, Quinquennium, 1941 - '42 to 1947 - '48. 0

24. Educational Costing Statistics of India, 1949 (Government of India Publication.)

25. University Commission Report Vol. I.

26. Tables relating to the scales of Pay to Teachers in India.

27. Administration Report of the Public Works (Irrigation) Dept. 1948 - '49 (Government of Madras. )Part II-B.

28. Administration Report of the Public Works Dept. (Irrigation) 1949 - '50 Part IIA & IIB.

29. Wealth and Welfare of Madras State, By Dr. B. Natarajan.

30. Report of the Economist for the enquiry into Rural Indebtedness by Dr. B. V. Narayanaswamy Naidu.

31. Report on the Health Conditions in Madras State, 1950 (Government of Madras.)

32. Annual Report of the Hospitals and Dispensaries of Indigenous Medicine in the State of Madras 1950.

33. Medical Register 1949.

34. Administration Report of the Electricity Department 1950 - '51 Govt. of Madras.)

35. Administration Report of the Electricity Dept. (Government of Madras 1951 - '52).

36. Report of the Committee of Enquiry into Labour Conditions in the Hand-loom Industry by Dr. B. V. Narayanaswamy Naidu.

37. Report of the Court of Enquiry into Labour Conditions in Beedi, Cigar, Snuff, Tobacco Curing and Tanning Industry by Dr. B. V. Narayanaswamy Naidu.

38. Report of the Committee on Leather and Leather Goods 1949 (Madras Govt. Publication.)

39. Report on the Labour Conditions in the Rice Mills in India (1946) by B P. Adarkar.

40. Report on the Labour Conditions in the Mica Mining and Mica Manufacturing (1945) by B. P. Adarkar.

41. Report on the Labour Conditions in Tanneries and Leather Goods Factories in India (1946) by Ahmed Mukhtar.

42. Report on Enquiry into Conditions of Labour in the Manganese Mining Industry in India 1945. (Central Govt. Publication)

43. Visalaandhralo Prajarajyam by Puchalapalli Sundarayya.

44. Economic Wealth of Andhra – Dr. Natarajan's typed Manuscript.

45. Census Papers 1951.

46. Report on the Socio-Economic Conditions of the aboriginal tribes in the province of Madras by A. Aiyappan, M.A., Ph. D.

47. Indian Tobacco Statistics 1950 – '51.

48. Issues of Monthly Digest of Economics and Statistics published by the Economic Adviser to Govt. of Madras.

49. Cottage Industries in Madras State. (Govt. of Madras Publication.)

50. VI & VII Annual Reports of Indian Central Tobacco Committee.

51. Report on Public Instruction 1950 – '51.

52. River Basins of Andhra State, Paper read by Dr. K. L. Rao, Director, Central Water & Power Commission, Government of India, in a Scientific Symposium arranged by Delhi Andhra Association, August 1953.

53. Hydro-Thermal Power Resources in Andhra, Paper read by B.R. Somayajulu, Chief Engineer, Electricity, Andhra Government in the above symposium.

54. Report on the Working of the Factories Act in the State of Madras, for the year 1951.

55. Census of India 1951, Vol. III. Part II A.

56. Census of India 1951, Vol. III. Part II B.

57. Statistics Relating to Banks in India 1952, Published by the Reserve Bank of India.

58. Land Resettlement Report, 1950 – '51.



ఒరిస్సా
మధ్యప్రదేశ్
భద్రాచలం
చోడవరం
పోలవరం
రాజమండ్రి
ఏలూరు
భీమవరం
తెనాలి
రేపల్లె
దివి
బందరు
నర్సాపురం
అమలాపురం
రామచంద్రపురం
పిఠాపురం
తుని
సర్వసిద్ధి
అనకాపల్లి
విశాఖపట్నం
భీమునిపట్నం
శ్రీకాకుళం
నరసన్నపేట
టెక్కలి
సూచిక
జిల్లాల సరిహద్దులు
తాలూకాల సరిహద్దులు
1. శ్రీకాకుళం
2. విశాఖపట్నం
3. తూర్పు గోదావరి
4. పశ్చిమ గోదావరి
5. కృష్ణా
6. గుంటూరు
7. నెల్లూరు
8. చిత్తూరు
9. కడప
10. అనంతపురం
11. కర్నూలు